The Largest Circulated Telugu Monthly

# చతుర

డిశంబర్ 1995 రూ. 6/-



వి.ఆర్.రాసాని నవల 'మట్టిబతుకులు'

# అశ్విని హోమియో హెయిర్ ఆయిల్




- జుట్టు రాలిపోవడాన్ని, తెల్లబడటాన్ని అరికడుతుంది.
- జుట్టు ఒత్తుగా, మృదువుగా, ఆరోగ్యంగా పెరిగేందుకు సహకరిస్తుంది.
- జిడ్డులేనిది, మెదడును చల్లబరిచేది.
- మాడు నొప్పిని తగ్గిస్తుంది.
- తలనొప్పిని నివారిస్తుంది.

# అశ్విని మజిల్ ఆయిల్




- మోకాళ్ళ నొప్పులు,
- ఒళ్ళు నొప్పులు,
- బెణుకులు,
- కండరాల నొప్పులను నివారించే దివ్యౌషధం.

# అశ్విని హెర్బల్ బాత్ పౌడర్




- స్వేదరంధ్రాలను శుభ్రపరచి, రోజంతా తాజాగా ఉంచుతుంది.
- కండరాల పటిష్టతకు తోడ్పడుతుంది.
- శరీర సహజ సమతౌల్యాన్ని నిలుపుతుంది.
- మీ చర్మాన్ని మృదువుగా ఆరోగ్యంగా వుంచుతుంది.

**అశ్విని హోమియో & ఆయుర్వేదిక్ ప్రొడక్ట్స్ లిమిటెడ్**

మూసాపేట్, హైదరాబాద్ - 500 018. ఇండియా. ఫోన్స్ : 273430, 273607. ఫ్యాక్స్ : 040-276664

# చతుర కతలు

## రాశిఫలాలు

"మిమ్మల్ని ఎడిటర్‌గారు రమ్మంటున్నారు సార్' తన సీట్లో కూర్చుని నవలా పఠనంలో మునిగిపోయిన ఏకాంబరంతో చెప్పాడు బాయ్.

చదువుతున్న నవలని తీసి పక్కనపెట్టి




ఎడిటర్ రూంలోనికి దారితీశాడు ంబరం.

ఏం చేస్తున్నారు మీరు?" రూంలోనికి వెళ్ల వెంటనే ఎడిటర్ అడిగాడు.

-నయిత రమాపతిరావు రాసిన డైరెక్ట్ నవల వస్తే చదువుతున్నాను సార్, దానిమీద రివ్యూ రాద్దామని'' చెప్పాడు ఏకాంబరం.

అతను 'హాట్స్నాఫ్' అనే వారపత్రికలో సీనియర్ సబ్‌ఎడిటర్‌గా పనిచేస్తున్నాడు.

హాట్స్నాఫ్ పత్రికలో లేని ఐటమ్స్ వుండవు. సీరియల్‌నుంచి కొత్తగా పెళ్లయినవాళ్లు మొదటిరాత్రి ఎలా గడపాలివరకూ అన్ని విషయాలూ ఆసక్తికరంగా హాట్స్నాఫ్‌లో దర్శనమిస్తాయి.

వాస్తు సలహాలూ, భవిష్యతరంగాలూ, పాఠకులు పంపించే వాళ్ళ జాతకానికి సంబంధించిన ప్రశ్నలకు జవాబులు వగైరా నానా విశ్వాసాలూ కలిగిన పాఠకులకి వాళ్ల అభిరుచులకు అనుగుణంగా హాట్స్నాఫ్‌లో వివిధరకాల శీర్షికలు వుంటాయి.

"ఈ వారం రాశిఫలాలు రాయాలయ్యా'' రూంలోనికి వెళ్ళిన తరువాత ఏకాంబరంతో

చతుర ... 3

అన్నాడు ఎడిటర్!

"ఎవరూ, నేనా?" ఆశ్చర్యపోతూ, ఉలిక్కిపడినట్లు అన్నాడు ఏకాంబరం.

"అవును... నువ్వే రాయాలి''

"గ్రహాలు అంటే ఏమిటో, రాశులంటే ఏమిటో, ఫలాలు అంటే ఏమిటో అలాంటి విషయాలు నాకు బొత్తిగా అసలు తెలీవు సార్. పైగా నేను నాస్తికుణ్ణీ, హేతువాదినీ..."

"అవన్నీ ఇప్పుడు ఎవరు చూడవచ్చారయ్యా? రాశిఫలాలు రాసే ఆ పీవిజీకే శర్మ నచ్చేవారంనించీ నెలకు నాలుగువందలు ఇవ్వమని అడిగాడు. నాలుగువందలు ఇస్తేనే రాస్తాడట. అంత డబ్బు ఇవ్వలేములే నాయనా, మీరు రాయవద్దూ, పాడువద్దూ అని చెప్పాను''

"మరి ఎలా సార్ ఇప్పుడు?"

"ఎలా ఏమిటయ్యా? ఆమాత్రం నువ్వు రాయలేవా ఏమిటి? నిజానికి ఆయన భవిష్యత్ ఆయనకి తెలుసా?"

"అదికాదు సార్..."

"నువ్వు ఏం చెప్పవాకు. నాలుగయిదు వారాల పత్రికలు తిరగేసి చూడు. అతను రాసేదేమిటో తెలుస్తుంది. నువ్వు కొద్దిగా మార్పుచేసి ఇంకొంచెం ఆకర్షణీయంగా రాయి'' ఆజ్ఞాపించాడు ఎడిటర్!

తప్పదన్నట్లుగా ఏకాంబరం నిట్టూర్చి తన రూంలోనికి వచ్చాడు. పాతపత్రికలు ఒకసారి తిరగేసి రాశిఫలాలు రాసి ఎడిటర్‌కి ఇచ్చాడు.

'ఈ వారంనించీ జ్యోతిష్యరత్న, జ్యోతిష్య సామ్రాట్, దైవజ్ఞశ్రీ ఏకాంబరేశ్వర శాస్త్రిగారు మా పాఠకులకి రాశిఫలాలు అందిస్తారు' అని ఏకాంబరం పేరుకి ముందూ వెనుకా తోకలు తగిలించి, ఎడిటర్స్ నోట్‌తో పాటు రాశిఫలాలు ప్రచురించారు.

తరువాత రెండు మూడు వారాలకి రాశిఫలాలు చదివే పాఠకులనించి ఏకాంబరేశ్వరశాస్త్రి రాస్తున్న రాశిఫలాలు చాలా బాగున్నాయంటూ హాట్సాఫ్ పత్రికకి ఉత్తరాలు రాసాగాయి.

-మొలకలపల్లి కోటేశ్వరరావు

## తెలివితక్కువ నిజాయితీ

చార్మినార్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరడానికి సిద్ధంగా వుంది. పరంధామయ్య ప్లాట్‌ఫాంమీద కొచ్చాడు. అన్ని కంపార్ట్‌మెంట్లు ఎంతో రష్‌గా వున్నాయి. ఎక్కడానికి చోటు దొరకలేదు. గార్డ్ విజిల్ వేశాడు.

ఈ చివరినుంచి ఆ చివరదాకా పరిగెత్తాడు. చివరికి అనుకోకుండా మిల్ట్రీ కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కేశాడు. వాళ్లు ముందు పొమ్మని బెదిరించారు. కానీ బండి బయలుదేరటంతో వూరుకున్నారు.

గూడూరులో ఆగింది. దిగి వెళ్ళడానికి జనం అడ్డు. ఆ రష్‌లో దిగివెళ్లడం అసాధ్యంగా తోచింది. ఆకలి వేస్తోంది. మధ్యాహ్నమూ సరిగ్గా భోంచేయలేదు.

ప్లాట్‌ఫారంమీద పదేళ్ల కుర్రాడు అరటిపండు తింటూ కనిపించాడు. వాణ్ణి పిలిచి

"కేంటిన్‌నుంచి ఓ పెరుగన్నం పొట్లం తెచ్చిపెట్టు. ఓ పొట్లం నువ్వు తిను. ఇదిగో పదినోటు. మిగతా చిల్లర తెచ్చిపెట్టు'' అన్నాడు.

"అలాగే సార్' అంటూ ఆ కుర్రాడు పదినోటు తీసుకుని వెళ్ళిపోయాడు.

పది నిమిషాలైంది. రైలు కూత వేసింది వాడు ఇంకా రాలేదేంటి? ఆ పదినోటు పుచ్చుకుని పారిపోయాడేమో? ఛఛ దారినపోయేవాణ్ణి నమ్మకూడదు అనుకున్నాడు.

ఇంతలో ఆ కుర్రాడు వచ్చాడు. చి... పరంధామయ్యకు ఇచ్చాడు.

"సార్... క్యాంటిన్‌లో ఒకేఒక పెరు...








అన్నం పొట్లం వుంది. అది నేను తినేశాను. ఒక్కో ప్యాకెట్ నాల్గురూపాయలు. ఇదు గోండి. మిగతా ఆరు రూపాయలు'' అని ఇచ్చేశాడు.

రైలు పరుగు తీస్తోంది. వాడి తెలివితేట లకు ఏడవాలో లేక నిజాయితీకి సంతో షించాలో తెలీక తికమక పడిపోయాడు పరంధామయ్య.

-కె.ఎస్.ఎస్.రెడ్డి

---

## విజిటింగ్ కార్డ్

లోకం అసలే చెడ్డది. ఇప్పుడు బాగా చెడ్డదై పోయింది. ఎవరు మంచివారో, ఎవరు చెడ్డ వారో తెలియదు. మంచివాళ్లలా కనిపించే చెడ్డవాళ్లూ, చెడ్డవాళ్లలా కనిపించే మంచివా ళ్లూ వుంటారు. గోముఖ వ్యాఘ్రాలూ, వ్యా ఘ్రముఖగోవులూ వున్నాయి.

విజయనగరంనుంచి విశాఖపట్నం బయలుదేరేను. అక్కణ్ణుంచి ఉక్కునగరం క్వార్టర్సులో వున్న అమ్మాయినీ, అల్లుణ్ణీ చూడాలని సంకల్పం. విశాఖపట్నం కాంప్లెక్స్‌లోకి బస్సు ప్రవేశించిందో, లేదో "నా పర్సు పోయింది. నా పర్సు పోయింది! బస్సాపండీ'' అని అరుపు.

కండక్టరు బస్సు ఆపించి, ప్రయాణికులెవరినీ దిగనీయకుండా తలుపు వేసేసి, కాంప్లెక్స్ ఆవరణలో వున్న పోలీసుఠాణాకి వెళ్లి పోలీసుల్ని పిలిపించుకొచ్చేడు.

పోలీసులు ఒక్కొక్కరి పెట్టెలూ, సంచీ లూ విప్పించి పాంటుజేబులు, చొక్కాజేబు లు తణిఖీ చేసేరు. ఆడపోలీసులు స్త్రీ ప్రయా ణికుల్ని సోదా చేసేరు.

నా దురదృష్టం ఏమోగాని ఆ పోయిన పర్సేదో నా సంచీలో దొరికింది. దొరికిపోతాన న్న భయంతో ఏ ప్ర'బుద్ధుడు' నా సంచీలో పడేసేడో?

పోగొట్టుకున్న వ్యక్తిని ఆ పర్సులో ఎంత డబ్బుందో వివరాలడిగేరు. అతను సరిగ్గా



# నవ్వుల వ్యాపారం







వ్యాపారాలు వెయ్యి రకాలు. తెలివి తేటలుండాలేగానీ డిగ్రీలు లేకుండా కోట్లు సంపాదించవచ్చు ఎవరైనా. అమెరికాకు చెందిన సమంతా క్రైస్తన్ 'హమ్స్' నవ్వుల వ్యాపారం చేస్తోంది. చిన్నపిల్లల్ని వినోదపరుస్తూ డబ్బు గడిస్తోంది ఆమె. పిల్లలు పుట్టినరోజు వేడుకలకు నలుగురయిదుగురు బఫూన్లను సప్లయ్ చేస్తుందీవిడ. వీరు అక్కడికి వెళ్లి హాస్యపూరిత హావభావాలతో పిల్లలను నవ్విస్తారు. అందుకుగాను 150 డాలర్లు వసూలు చేస్తుంది హమ్స్.

చెప్పేడు.

మిగిలిన ప్రయాణికుల్ని పంపించివేశారు. నన్ను పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్లారు.

"ఏమయ్యా! చూడ్డానికి పెద్ద మనిషిలా ఉన్నావ్! ఇదేం పోయేకాలమయ్యా?" అన్నారు ఎస్సైగారు.

"కేడీగాళ్లందరూ పెద్ద మనుషుల్లాగానే ఉంటారండీ! కాపోతే కొందరికి చారల బనీన్లుండవు. అంతే తేడా'' అన్నారు హెడ్డుగారు.



"ఓయ్ ఫోర్ ఫార్టీఫోర్! వీడి పాంటుజేబులూ, చొక్కాజేబులూ అన్నీ సోదా చెయ్యి. ఇంకేమేమి దొంగవస్తువులున్నాయో'' అన్నారు ఎస్సైగారు.

నా జేబులు తడిమేరు. మనీపర్సు, అందులో ఓ విజిటింగ్ కార్డూ దొరికేయి. ఆ విజిటింగ్ కార్డుని ఎస్సైకి చూపెట్టేడు హెడ్డు.

ఎస్సై అది చదివి వణికిపోతూ, "సార్! సార్! మమ్మల్ని క్షమించండి సార్'' అంటూ నా చేతులు పట్టుకున్నాడు.

ఆ వెంటనే కండక్టర్‌తో "నీకేమైనా బుద్ధుందయ్యా! ఈయనా నీకు దొరికేడు?" అని ఓ అర్ధచంద్ర ప్రయోగం చేసేడు. కండక్టరు దాదాపు నేలతల్లిని ముద్దెట్టుకున్నంతపనయ్యింది.

పర్సు పోగొట్టుకున్న ఆయనకి ఆయన పర్సు, నాకు నా పర్సూ ఇచ్చేసేడు.

బతుకుజీవుడా అనుకుంటూ, బయటపడి పర్సు చూసుకున్నాను.

పదిహేనురోజులు కిందట హైదరాబాద్ వెళ్లేను. అక్కడ నా కజిన్ ఉన్నాడు. వాడి విజిటింగ్ కార్డొకటి నాకిచ్చేడు. అదిప్పుడు నా పర్సుల్లో వుంది. అది చూసే ఎస్సై వణికిపోయేడు. దానిమీద...

"..... రావు,
క్రైమ్ బ్రాంచ్ సి.ఐ.డి."

అని వుంది. అంతే! ఆ కింద ఆఫీస్ అడ్రసుంది. వెనుక ఇంటి అడ్రసుంది.

పాపం ఎస్సై.

-బులుసు జి. ప్రకాష్




# ఏరిన ముత్యాలు

★ సరైన అవగాహన ఎడారిలో ఉద్యానవనాన్ని నిర్మిస్తుంది. అపజయాన్ని విజయంగా మారుస్తుంది.

-చిన్మయానంద

★ ఉదయం రాబోయే మధ్యాహ్నాన్ని సూచించినట్లే బాల్యం భావితరాల్ని సూచిస్తుంది

-జాన్ మిల్టన్

★ విజయం సాధించాలంటే అమోఘమైన పరిశ్రమ, అచంచలమైన సంకల్పం ఉండాలి.

-వివేకానంద

★ భయమనే వరదను అరికట్టడానికి ధైర్యమనే ఆనకట్టలను నిరంతరం నిర్మించుకోవాలి.

-మార్టిన్

★ చదువు కామధేనువులాంటిది. అనవసర సమయాల్లో కూడా పాలిస్తుంది

-చాణుక్యుడు

★ నీకు ఇష్టమైందేదో దాన్ని పొందేటప్పుడు జాగ్రత్తగా వుండు. లేకపోతే నీకు లభించినదాన్ని బలవంతంగా ఇష్టపడాల్సిన పరిస్థితి రావచ్చు.

-బెర్నార్డ్‌షా

★ కష్టపడకుండా తినే మనుషులు దొంగలతో సమానం

-ఠాగూర్

★ లోకంలో మోసగాళ్లకంటే మూర్ఖులే ఎక్కువ. అందువల్లే మోసగాళ్ల మనుగడ సునాయాసంగా సాగిపోతున్నది

-శామ్యూల్ బట్లర్

★ అధికారి అన్నవాడు మృదుమధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి.

-బద్దెన

★ అదృష్టమనేది మనుషుల్ని మార్చదు. వారు వేసుకున్న ముసుగుల్ని మాత్రమే తీసివేస్తుంది.

-రికోబొని

★ దురదృష్టాలు రెక్కలతో ఎగురుకొంటూ వస్తాయి, కాళ్లతో నడుచుకొంటూ వెళ్లిపోతాయి.

శామ్యూల్ జాన్సన్

★ యోగ్యత ఆహ్వానంకోసం వేచి చూస్తుంది. అయోగ్యత అలవోకగా లోనికి నడుస్తుంది.

-బార్నబేరిచ్

సేకరణ: డి.విద్య



దాదాపు ముప్పై సంవత్సరాల క్రితం చిత్తూరు జిల్లాలోని ఓ కుగ్రామంలో పుట్టి, పెరిగి, తర్వాత ఉన్నత విద్యనభ్యసించింది తిరుపతిలో.

యూనివర్సిటీలో చిత్తూరుజిల్లా వేడుక పాటలపైన ఎమ్.ఫిల్ డిగ్రీ, రాయల సీమ వేడుక పాటలపైన పి.హెచ్.డి. పట్టా తీసుకుని, గత పదేళ్ళుగా తిరుపతి లోని ఓ టి.టి.డి. కళాశాలలో ఆంధ్రోపన్యాసకుడిగా ఉద్యోగం.

నా మొదటి కథ 1977లోనే వెలుగుచూసి నా నాటక ప్రదర్శనల్లో పడి దాదాపు పది సంవత్సరాల అనంతరం 'నేల రాలిన వసంతం' కథతో పునఃప్రవేశం జరిగింది. తరువాత వరుసగా పదిహేను కథలు, 1992లో మొదటి నవల 'చీకటిరాజ్యం', ఆ తరువాత 'ఇది తిరుపతి' అన్న శీర్షికన ఫొటోఫీచర్ రాయడం జరిగింది.

ఈ నేపథ్యంలో దాదాపుగా 60పైగా పరిశోధనాత్మక వ్యాసాలు, కొన్ని గ్రంథ సమీక్షలు, ఒక నాటిక, కొన్ని చిన్న కవితలు, నలభైదాకా కథలు వెలుగుచూశాయి.

తిరుపతి, కడప రేడియో కేంద్రాలనుంచి కొన్ని ప్రసంగాలు, నాటికలు, కథలు, కవితలు ప్రసారమయ్యాయి.

'జానపద గేయాలలో పురాణాలు, రాయలసీమ వేడుక పాటలు ఒక పరిశీలన' అన్న పరిశోధన గ్రంధాలు స్వీయ ప్రచురితాలు. కొన్ని కథలకి బహుమతులు వచ్చాయి.

ఈమధ్యనే 'చీకటి రాజ్యం' నవలకు 'కువ్వంరెడ్డెమ్మ' సాహితీ అవార్డు లభించింది.

ఆంధ్రప్రభలో ప్రత్యేక బహుమతి లభించిన కథలు నన్ను కథా రచయితగా నిలబెడితే 'చీకటి రాజ్యం' రచయితగా గుర్తింపు తెచ్చిన నవల.

నేనేది రాసినా మొదట విమర్శించి, శుద్ధ ప్రతుల్ని తయారు చేయడంలో సహకరించే నా శ్రీమతి డా॥కె.ఉమాదేవి సహకారం మరువరాని అంశం.



# చతుర

సంపుటి: 18 సంచిక:11 డిసెంబర్ 1995

ఆ ఊళ్లో అక్రమాలు... అన్యాయాలు... ఆఖరికి హత్యలూ... చాలా మామూలు విషయాలు. అమాయకులను అడ్డుపెట్టుకుని, తన చేతికి మట్టి అంటకుండా ఆడింది ఆటగా, పాడింది పాటగా... నిత్య పెళ్లికొడుకులా... విలాస జీవితం గడిపేస్తున్నాడా ఊరి పెద్ద.

ఆచారాల పేరుతో అందమైన అమ్మాయిలను చెరపట్టే ఆటవిక శృంగార క్రీడలకు ఆటపట్టయిన ఆ ఊళ్లో... ఓ శుభోదయాన ఊరంతటినీ ఉద్రూతలూగించే సంఘటన జరిగింది... ఏమిటది?

ఆధునిక యుగంలో కూడా అజ్ఞానాంధకారంలో మగ్గిపోతున్న ఓ మారుమూల పల్లె కథను అక్షర రూపంలో అందించిన... నవలల పోటీలో సాధారణ ప్రచురణకెన్నికయిన వి.ఆర్.రాసాని 'మట్టిబతుకులు' ఈ నెల చతుర సమగ్ర నవల.



అర్ధరాత్రి!

అంతవరకూ చుక్కలు కాస్తూ నిర్మలంగా వున్న ఆకాశంలో ఉన్నట్టుండి పెనుమార్పు సంభవించింది!

క్షణాలమీద కారుమబ్బులు కమ్ముకొచ్చాయి.

ఎంత వేగంగా మేఘాలావిర్భవించాయో అంత వేగంగాను కళ్లు మిరుమిట్లు గొలిపే మెరుపులు పుట్టుకొచ్చాయి. భూనభోంతరాలు దద్దరిల్లేటట్లు ఒక ఉరుము ఉరిమింది. ఆకాశం బద్దలయినట్లు పెళపెళమని ఎక్కడో దూరంగా పిడుగుపడింది.

రెడ్డన్న గుండె దడదడలాడింది. అంత గాఢ నిద్రలోను ఉలిక్కిపడి లేచాడతను. కుండపోతగా వర్షం పడుతోంది.

రెడ్డన్న మనసు మనసులో లేదు.

లేచి కూర్చుని చుట్టూ చూశాడు.

తుంగచాపమీంచి లేచి మూలనున్న గోనె సంచి తీసుకుని... గబగబ కొప్పెర పెట్టుకొని... బయటకి వెళ్ళడానికి గుడిసె తలుపు తీశాడు రెడ్డన్న.

అంతే!

ఈదురుగాలుల్తో కూడిన జల్లులు రయ్యిమని గుడిసెలోకి దూసుకువచ్చాయి.

"వొరే! ఇప్పుడెందుకురా తలుపు తీసినావు?" అని కేకేసింది తల్లి.

ఈ వర్షంలో ఏమాత్రం బయట అడుగుపెట్టలేమని అతనికి తెలిసిపోయింది.

వెంటనే తలుపేసి గొళ్లెం పెట్టి వచ్చి తిరిగి తుంగచాపపైన కూలపడ్డాడు.

నిమిషనిమిషానికీ వర్షం ఎక్కువవుతూనే వుంది. వర్షం ఎక్కువయ్యేకొద్దీ అతని గుండెదడ కూడా ఎక్కువవుతోంది.

బయటకు వెళ్ళాలనే ఆతృత, ఆ వర్షంలో పోలేని నిస్సహాయత అతన్ని నిద్రపోనీయడం లేదు. "పచ్చి ఇటిక వానకు తడిస్తే కరిగిపోతుందేమొ? పొయ్యిలనిండా కట్టె కూరి, అగ్గిపెట్టేసి వచ్చేసినాం. అంతలోపల వచ్చేసింది ఈ అన్నేకారి వాన"

"ముందే సెరువు మొగదాల ఇటికె శూల పేర్చి ఉండేది. నీళ్లు పొయ్యిలోకి పోయి కట్టె ఆరిపోయుంటుంది. పొయ్యిలోకి నీళ్లొచ్చింటే కింద ఇటిక కరిగిపోయి శూలశూలే కుసిలి పడిపోయి వుంటుంది.

ఇబ్బుడేం చేయాలబ్బా!" తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు రెడ్డన్న!

రేయి గడిచిపోతూంది.

వర్షం మాత్రం పూర్తిగా ఆగలేదు.

పొడిపొడి చినుకులు పడుతూనే వున్నాయి.

★ ★ ★

సూర్యుడు ఇంకాసేపట్లో ఆకాశంలోకి రాబోయే సమయం.

ఆ మసక చీకట్లోనే రెడ్డన్న పెద్ద చెరువు వైపు బయలుదేరాడు.

"ఏమి రెడ్డన్నా! ఎందాకా?"

వరదయ్య ఇంటికి పనికి వెడుతూ ఎదురుపడిన మునెప్ప పలుకరించాడు.

"ఏంలేదబ్బా! పెద్ద సెరువులో ఇటికె శూలకు రాత్రి అగ్గిపెట్టేసి, కట్టె యెగదోసేసి ఇట్ట వచ్చేసినామొలేదో అట్టదెబ్బటంగా వాన వచ్చేసింది. శూల ఏమయిందోనని బోతండా..."

అని పరుగులాంటి నడకతో ముందుకు సాగాడు రెడ్డన్న.

రెండునెలల రెడ్డన్న రెక్కల కష్టం ఎందుకూ పనికిరాకుండా అయిపోయింది.

జమిలిగడ్డలో ఒకరికి లక్ష ఇటికలు కోసి కాల్చి పట్టడానికి ఒప్పందం చేసుకున్నాడు రెడ్డన్న. తన కులంవాళ్లనే కూలీలుగా పెట్టుకున్నాడు. అందరివీ కూటికి నోచుకోని కుటుంబాలే... చాలీచాలని బతుకులే. ఇటుక కోసి వారం రోజులయింది. ప్రతి వరుసలోను




వరిపొట్టు కూరి, కోసిన ఇటుకనంతా రెండురో జుల క్రితమే పది పెద్ద పెద్ద పొయ్యిలతో... ఒక ఇల్లులాగ పేర్చి బట్టీ కట్టాడు.

దానికి నిన్నటి రాత్రే కిష్టుడి సాయంతో నిప్పుపెట్టి వచ్చేశాడు.

ఎట్లలేదన్నా అంటుకున్న శూల రెండు మూడురోజులు కాలుతుంది.

అలా అగ్గిపెట్టి వచ్చాడు. ఇలా వర్షం వచ్చేసింది. చేతికందబోయిన ఫలితం!

అందుకే ఆతని బాధ!

ఆ రాత్రి జాగరణం చేశాడు.

తెల్లవారగానే బయలుదేరాడు.

నిన్నటివరకూ కొద్దిపాటి నీరున్న ఆ చెరువులోకి... సగానికిపైగా కొత్త నీరు వచ్చి చేరింది.

ఆ నీళ్లు ఇటుక శూలను సుతారంగా తాకుతున్నాయి. మడిమెలవరకూ వస్తున్న నీటిలో అంగలు వేసుకుంటూ శూలను సమీపించి పరిశీలించసాగాడు రెడ్డన్న.

తాను రాత్రి పెట్టివచ్చిన అగ్గి పూర్తిగా ఆరిపోయినట్టుంది. అందుకే శూల చల్లగా వుంది.

ఆ స్థితిలో శూలను చూసిన రెడ్డన్న కడుపులో కత్తులు కవాతు చేస్తున్నట్లయింది.

శూలను ఆప్యాయంగాస్పృశిస్తూఎంతవరకూ కాలిందో చూస్తున్నాడు.

అతని దృష్టి ఒకచోట ఆగిపోయింది. అక్కడ శూలలోని ఒక పొయ్యికి పైన ఒక పెద్ద చీలిక కనిపించింది.

"ఏమైందబ్బా!" అనుకుంటూ... అక్కడ గట్టిగా చేత్తో తట్టాడు.

పేర్చిన ఇటుకలు కొంతభాగం కదలిపోయినట్లనిపించింది.

అందుకే ఈసారి ఇంకాస్త గట్టిగా తట్టాడు. అంతే! పెద్ద శబ్దం చేసుకుంటూ ఆ భాగంలోని ఇటుకలు జారి నేలపైన పడిపోయాయి.

ఒక్క క్షణంలో మీద పడబోయిన ఇటుకల్ని తప్పించుకుని పక్కకు గెంతాడు రెడ్డన్న.

మరుక్షణం ఆ దృశ్యం చూసిన అతని గుండె జల్లుమంది. నవనాడులు స్తంభించిపోయాయి.

అక్కడ ఇటుకలు పడిపోయిన భాగంలో వేలాడుతూ ఒక మనిషి చేయి కనిపించింది.

అంత చలిలోను ఆ దృశ్యం చూసిన ఆతనికి... ముచ్చెమటలు పోశాయి.

గుండె వేగంగా కొట్టుకొంటోంది.

మెల్లగా రెండడుగులు ముందుకేశాడు.

అంతే... మళ్ళీ కొన్ని ఇటుకలు... గబగబా నీటిలోకి జారిపోయాయి.

ఆ దెబ్బకు... రాళ్లు పడిన చోటునుంచీ పైకెగసిన నీళ్లు అతని ముఖాన పడ్డాయి.

ముఖంపైన పడిన నీళ్లు చేత్తో తుడుచుకొని కళ్లు తెరచి చూశాడు.

ఎదురుగా... కిందపడిన ఇటుకలపైన వెల్లకిలా పడివున్న ఒక మనిషి శవం భయంకరంగా కనిపిస్తోంది.

ఆ దృశ్యం చూసి కెవ్వున అరవబోయి అంతలోనే సంభాళించుకొని ఈసారి కళ్లు పెద్దవిచేసి శవంవైపు పరిశీలనగా చూశాడు.

కిందపడిన శవాన్ని గుర్తుపట్టిన రెడ్డన్న "వరే! శివదాసా!" అని కేకలు వేసుకుంటూ ఆ పల్లెవైపు పరుగెత్తి పోసాగాడు.

★ ★ ★

"ఇదెట్ల జరిగింది?"

అక్కడ చేరిన అందరి మెదళ్లను తొలిచేస్తున్న ఒకేఒక ప్రశ్న అది.

"వోనికి పేణాల్దీసేంత పాగోడెవ్వుడుండాడబ్బా?" అతని తల్లి ఆదెమ్మ మనసు ప్రశ్నించింది. ఆమె ఆ శవంపైన బడి ఏడుస్తూనే వుంది.

ఆ పక్కనే పదహారేళ్ళ చుక్కమ్మ అన్న

శవంపైన పడి లబోదిబోమంటూంది.

అక్క భుజం పట్టుకొని పన్నెండేళ్ల బాలకిష్టుడు ఏడుస్తూ నిలబడివున్నాడు.

అన్న మరణానికి దుఃఖిస్తూ శివదాసు మాత్రం ఓ మూల మౌనంగా... నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తూ కూర్చొనున్నాడు.

చిన్నప్పుడే తండ్రి చనిపోతే ఆ కుటుంబానికి పెద్ద దిక్కై వారి ఆలనా పాలనా చూసిన బుడ్డన్న మరణానికి వారు కాదు ఆ పల్లెలోని వారందరూ అక్కడ చేరి విలపిస్తున్నారు.

శివదాసు కళ్లు నీళ్లు రాల్చుకుంటున్నాయి. అతని పుర్రెలో ఎన్నో ప్రశ్నలు, మరెన్నో అనుమానాలు.

"ఇదెట్ల జరిగింది?

బాగున్నాడే. ఉన్నట్టుండి ఇట్టయి పూడిసినాడు. యాడనో పొరబాటు జరిగిపోయింది.

ఏందా పొరబాటు...?

ఇంతకీ ఈ పని ఎవరు చేసినట్టు?

అన్నీ సమాధానాలు లేని ప్రశ్నలే.

అతనికంతా అయోమయంగా వుంది.

అంతులేని ఆ ఆలోచనల మధ్య స్మృతిపథంలో ఆ ముందురాత్రి జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే గుర్తుకు రాసాగాయి.

★ ★ ★

కల్లూరు అడవి ఆ చీకటిరాత్రి మానవుడి అజ్ఞానానికి ప్రతీకలా స్తబ్దంగా వుంది.

కనుచూపుమేరలో గుంపులు గుంపులుగా వున్న పొదలు పాపాలు రాశులు పోసినట్లు కనిపిస్తున్నాయి.

ఆ చీకట్లో...

దూరంగా వున్న ఒక పెద్ద కొండమీద అగ్ని వలయాకారంగా చెట్లను దహించివేస్తోంది.

అడవిలోని అన్ని దారులు అస్తవ్యస్తంగా కనిపిస్తున్నాయి.




అలాంటి ఒకదారిలో...

ఈలెను ఊత పొడుచుకుంటూ అందరికంటే ముందు మునిరాజు, ఆ తర్వాత శివదాసు, అతని వెనక శివదాసు అన్న బుడ్డన్న వెళ్తున్నారు. అందరికంటె చివర్న ఒక పెద్ద కుండను నెత్తిన పెట్టుకుని వారిననుసరిస్తూ వస్తున్నాడు తిమ్మడు.

"మొండోని కనుమ" గుండా బయలుదేరి నూర్రాళ్లకాడ దారిలోని ఎగుడు దిగుళ్లను తప్పించుకుంటూ వడుపుగా అడుగులు వేస్తూ నడుస్తున్నారు. "వరే ఈ వేళకు వోళ్లు ఎత్తకొచ్చిన సరుకు దిగిపోయుంటుందా?"

"ఓc... ఇంకానా ఎప్పుడో"

"అయితే... ఇంక మన కోసరవే సూస్తా వుంటారు వోళ్లు''

"యిద్దో. తెల్లారేసందికి మూడోకంటికి తెలీకుండా మొత్తం సరుకంతా మనింటికి సేరిపోవాల యేcవిరా తిమ్మడూ యినిపిస్తా వుండాదా. ఉలూకూ పలుకూ లేకుండా గొమ్మున గంగెద్దం మాదిరిగా వస్తావుండావే'

అంతవరకూ మౌనంగా వస్తున్న తిమ్మన్ని పలుకరించాడు మునిరాజు.

"అయన్నీ ఆడికి పోయినాక నిమ్మళంగా మాట్లాడుకుందాం... ముందు పదండి'' కర్తవ్యాన్ని గుర్తుచేశాడు తిమ్మడు.

అలా వెళ్తున్నవారికి కొంత దూరంలో ఏదో మంట కనిపించింది.

దాన్ని చూస్తూనే సముద్రాన్ని ఈది వడ్డుకు చేరుకోబోతున్న గజ ఈతగాళ్ళలా అతనితోపాటు ఆనందపడిపోయారు మిగిలిన ముగ్గురూ.

"ఆc వచ్చేసినావురా... ఇంకేం పరవాలేదులే' ఉత్సాహంగా అన్నాడు మునిరాజు.

క్షణంలో వారు అక్కడికి చేరుకున్నారు. అక్కడ ఒక చిన్న బట్టీ. దానిపైన మూడు కడవలు ఒక దానిపైన ఒకటి వున్నాయి. అక్కడో ఇద్దరు నల్లని శరీరాలపైన ఆచ్ఛాదన లేకుండా చెమట కారుతుంటే, కేవలం గోచీలు మాత్రమే పెట్టుకొని కూర్చొనున్నారు.

వాళ్ళ పేర్లు గంగడు, రత్తయ్య.

వారి పక్కనే అప్పటికే ఆరిపోయివున్న ఒక పొయ్యి, దానికి కొంత దూరంలో మరికొన్ని మట్టి పాత్రలు, రెండు మూడు గోనెసంచులు, ఒక సత్తుగ్లాసు వున్నాయి.

"దించు దించురా రత్తిగా'' అన్నాడు నెత్తిమీద కడవను చూపిస్తూ అక్కడికి చేరుకున్న తిమ్మడు.

"ఓ యబ్బా! దీన్ని దించుకోలేవురా'' వ్యంగ్యంగా అని కడవను దించాడు రత్తయ్య.

"తుమ్మచెక్క ఊట బాగా ఊరిందిరా'' ప్రశ్నించాడు కడవలోని ద్రవాన్ని వాసన చూస్తూ రత్తయ్య.

"పది రోజులమింటి బాగా ఊరింది. రోజూ సెయ్యేసి బాగా పిసికి కలిబెట్టి కుళ్లనిచ్చినా'' సమాధానం చెప్పాడు తిమ్మడు.

ఆ కడవలో వున్నది సారా ముడిపదార్థం. అదే ఊట.

సారా కాచడంలో శివదాసు తనలాగే ఆరితేరిపోవాలనీ, తద్వారా నాలుగు డబ్బులు సంపాయించాలనీ బుడ్డన్న ఆశ. అందుకే అతనికి సారాకాచే విధానం బాగా నేర్పించాడు. ఇంకా బాగా అలవాటు పడాలనీ అన్ని పనులు అతని చేతనే చేయిస్తాడు బుడ్డన్న. ఆ పనులన్నీ చాకచక్యంగా వేగంగా చేస్తాడు అతను.

"ఇంగేవిరాబ్బా బట్టీ ఎక్కించు''

అందరితోబాటు సంచి పట్టలు కిందవేసికొని కూర్చున్న బుడ్డన్న పురమాయించాడు.

తిమ్మడు తెచ్చిన కడవను రెండు చేతులతో ఎత్తి పొయ్యిమీద పెట్టాడు శివదాసు.

మునిరాజు, గంగడు పక్కబట్టీలో దిగుతున్న సారాను పరిశీలిస్తున్నారు.

"రే వాసన సూసినావా... సారాయి వాసన వస్తావుండాలి. అట్ట వస్తే అబ్బుటికి సెక్క ఊరినట్టు. గుర్తుపెట్టుకో'' అందులోని పట్టువిడుపులు చెప్పసాగాడు బుడ్డన్న.

అక్కడే వున్న కట్టెలను పొయ్యిలోకి అనువుగా విరుచుకుంటూ కూర్చున్నాడు శివదాసు.

అన్న చెప్పే మాటల్ని మౌనంగా వింటున్నాడు శివదాసు.

శివదాసువైపు చూస్తూ.

"ఏంవిరాబ్బా! యింటుండవా?" తిరిగి ప్రశ్నించాడు.

"దినామ్మ సెప్పేదే గదన్నా'' కొంచెం అసహనంగా ముఖం చిట్లించి అన్నాడు శివదాసు.

"ఓరి... శివదాసా... బిన్నే బట్టి ఎక్కిచ్చరా'' తొందరచేశాడు గంగడు.

"సరే బిన్నే కానీ'' చెప్పాడు బుడ్డన్న.

ఆ తర్వాత విరిచిన కట్టెల్ని పొయ్యిలో పెట్టి పక్క పొయ్యిలోనుంచి వెలుగుతున్న ఒక కొరివిని తీసుకుని దాన్ని వెలిగించాడు.

సారా బట్టీలు రెండు పొయ్యిలమీద వేగంగా వేడెక్కుతున్నాయి.

అంతవరకూ దిగివున్న సారా ఆ పొయ్యిలకు దూరంగా రెండు పెద్ద అల్యూమినియం డాక్షన్‌లలో నింపివుంది.

"ఇంతవరకు దిగిన సరుకు యిదే నంట్రా... దాన్ని ముక్కుతో వాసన చూస్తూ అన్నాడు మునిరాజు.

"ఎంత కొంచెమేగదా ఊట... దానికంత గాక ఇంకెంత దిగుతుంది''

పొయ్యిలోని కట్టెల్ని ఎగదోస్తూ అన్నాడు రత్తయ్య.

పక్కనే పడివున్న ఒక కట్టె పుల్లను తీసి ఆ సారాలో అద్ది, దాన్ని మండుతున్న పొయ్యిలో పెట్టి వెలిగించాడు మునిరాజు.

ఆ పుల్ల గుప్పున అంటుకొని ఆ మంట లేత నీలంరంగులో నిగనిగ మండింది.

అలా నీలంరంగుతో మండడం మంచి సారా లక్షణం. అందుకే ఎగిరి గంతేసినంత పనిచేశాడు మునిరాజు.

"వొరే బెమ్మాండగా వుండాది. తలా వగ దరము (గ్లాసుడు) యేసుకుందారి. గలా సందుకో శివదాసా'' మునిరాజు చెప్పగానే రెండు సత్తుగ్లాసులు పక్కనే వున్న సంచిలో నుండి తీసి అందించాడు. తలా రెండు గ్లాసులు చొప్పున ఇచ్చి తను రెండు గ్లాసులు కొట్టాడు మునిరాజు.

ఆ సారాను గవర్నమెంటు సారాలో కలిపి అమ్మితే ఎంత లాభం రావచ్చో అంచనాలు వేసుకుంటున్నాడు మునిరాజు.

అలా ఆనందంగా కాచిన సారా మొత్తం తెల్లవారేసరికి ఇంటికి చేర్చేయాలని వారి నిర్ణయం.

అప్పటివరకు దిగివున్న సారాను శివదాసు, గంగడు, మునిరాజు వెంట అతని ఇంట్లో చేర్చేటట్లు, దిగబోయే సారాను, బుడ్డన్న, రత్తయ్య, తిమ్మడు కలిసి తీసుకొని వచ్చేటట్లు నిర్ణయాలు తీసుకున్నారు.

ఆ ప్రకారం శివదాసు ఆనాటి రాత్రే ఇంటికొచ్చాడు. అంతే ఆ తర్వాత ఏం జరిగిందో అతనికి తెలియదు. తెల్లవారేసరికి ఇలా జరుగుతుందని మాత్రం అతను కలలో కూడా ఊహించలేదు.

వరదయ్య ఇంట్లో జీతగాడిగా పనిచేస్తున్న బుడ్డన్న కొన్ని గంటల వ్యవధిలో శవంగా మారుతాడని అతని తమ్ముడైన శివదాసు బుర్రకు తట్టలేదు.

కదిలే మబ్బు తునకలా, మంచుతెరలా అతని మెదడులోనుండి గతం వీడిపోయింది.

"మరి ఇదెలా జరిగింది?"

మళ్ళీ అదే ప్రశ్న!!

సమాధానం దొరకని ప్రశ్న!!

మళ్ళీ ఆలోచనల పరంపర...

మళ్ళీ అనుమానాలు...

"ఏందిరా... యిట్టే వుంటే ఎట్టా? ఎంత దిగులుపడినా పోయినోళ్లు రారు. ఎంతసేపని యిట్టే వుండేది? జరిగేపని సూడండి. పీనిగిని దాచిపెట్టేసినాక మద్దిస్తం పెట్టిస్తాం"

అతని ఆలోచన్లకు అంతరాయం కలిగిస్తూ కర్తవ్యాన్ని గుర్తు చేశాడు రత్తయ్య. దాంతో అక్కడున్న అందరూ మద్దిస్తం చేసిందాకా శవాన్ని దహనం చేయడానికి ఒప్పుకోలేదు.

అందరూ పట్టుబట్టారు. ఒక నిర్ణయానికి వచ్చి మద్దిస్తాలు చేసే వరదయ్య దగ్గరకు బయలుదేరారు.

★ ★ ★

ఉదయాన తన వ్యవసాయపు బావి దగ్గర పుల్లతో పళ్లు తోముకుంటున్న వరదయ్య దగ్గరకు పరుగు పరుగున చేరుకున్నాడు మునిరాజు.

"ఏం మునిరాజూ! అట్లా పరుగెత్తుకొచ్చినావు. ఎవరి కొంప మునిగింది?"

"ఏం లేదన్నా... బుడ్డన్న శవం బయట పడిందంట" ఆయాసపడిపోతూ చెప్పాడు మునిరాజు.

అతని ముఖంలో రాబోయే ప్రమాదాన్ని పసిగట్టిన ఆందోళన, భయం కొట్టొచ్చినట్లు కనిపించాయి.

"ఆఁ... అట్లనా?"

కాస్తంత ఆందోళన మెరుపులా అతని ముఖంలోను మెరిసి వెంటనే మాయమైంది.

"ఇటిక శూల కాలిపోలేదా?"

తిరిగి ప్రశ్నించాడు వరదయ్య.

"రాత్రి కురిసిన వానకు ఆరిపోయిందంట. వోడు రెడ్డిగోడు పోయి శూల తట్టినాడంట. అది బయట పడిందంట"

కాచిన సారాను తెచ్చి మునిరాజు ఇంట్లో పెట్టి తాను పనిచేసే వరదయ్య ఇంటికొచ్చిన బుడ్డన్న అతని కూతురైన త్రిపుర




సుందరి కౌగిట్లో బిగిసిపోయాడు. వాళ్లనా స్థితిలో అనుకోనివిధంగా చూసి ఉగ్రుడైపోయాడు వరదయ్య. తన జీతగాడే అలా ప్రవర్తించేసరికి ఉండలేక అతను నిద్రిస్తున్న సమయంలో వెళ్లి చంపి మునిరాజు సాయంతో ఆ రాత్రే పెద్ద చెరువులో కాల్చడానికి సిద్ధంగా వున్న ఇటికశూలలలో దాచి వచ్చేశాడు.

అయితే దురదృష్టవశాత్తు అది బయటపడిపోయింది. కానీ అలాంటివి వరదయ్యకు లెక్కకాదు.

అందుకే మునిరాజు చెప్పిన వార్త విని బెంబేలు పడిపోలేదు.

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఆ సమయంలోనే బిలబిలమని గూడెం ప్రజలంతా వచ్చేశారు.

అక్కడే... వున్న నీళ్ల తొట్టిపైన కూర్చున్నాడు వరదయ్య. పక్కనే నిలబడ్డాడు మునిరాజు.

"ఏం జరిగిందయ్య పొద్దన్నె ఇట్లొచ్చినారు?" పందుంపుల్ల పారవేసి ముఖం కడుక్కుంటూ అడిగాడు.

"ఏం లేదయ్యా... బుడ్డన్నను ఎవరో సంపేసి ఇటిక శూలలో పెట్టేసినారు''

"అగ్గి పెట్టేముందే పెట్టినట్టుంది శవాన్ని. పీనిగ వాసన వస్తా వుంది''

"వాన రాబట్టి బయటిపడిందిగానీ లేకుంటే కాలిబూడిదై వుండేది''

అక్కడ చేరిన వారు ఒక్కొక్కరు ఒక్కో మాట చెబుతుంటే మునిరాజుకు దిక్కు తోచిందికాదు.

అసలు విషయం ఎవరికీ తెలిసినట్టు లేదని ఆ మాటలబట్టి గ్రహించిన వరదయ్య లోపల్నే సంతోషించాడు.

"అయ్యో పాపం! శానా మంచోడు కదయ్య, నా యింటి జీతగాడు వానికీగతి పట్టిందా''

మొసలి కన్నీళ్లు కార్చాడు వరదయ్య.

"ఈ ఖూనీ గురించీ యింకెవురికైనా తెలుసుంటే సెప్పండి, నేను న్యాయం జేస్తా!"

ముఖం కడుక్కుంటూ అడిగాడు వరదయ్య.

ఎవ్వరూ పెదవి విప్పలేదు.

"పోలీసు కేసు పెడితేను..."

అనుమానంగా అడిగాడు మునిరాజు.

"పోలీసులొచ్చి ఏం జేస్తారయ్యా... మనూరికెప్పుడైనా పోలీసులొచ్చినారా ఏందీ..."

న్యాయంజేసే న్యాయమూర్తిలా చెప్పాడు వరదయ్య.

"అది నిజమే వీళ్లేమంటారో..."

"వాళ్లేమంటారు బుసపత్తిరి. మనల్ని కాదంటారా?"

"ఏమంటారయ్యా?"

అందరివైపు చూశాడు వరదయ్య. మీ యిష్టం సామీ అన్నాడు గంగన్న.

దాంతో అందరూ గంగన్ననే సమర్థించారు.

"సరే! ముందు శవాన్ని కాల్చేయండి. లేకుంటే మీ మీదికే వచ్చే ప్రమాదం వుంది''

తాపీగా చెప్పాడు వరదయ్య.

ఆతని మాటకు ఎవ్వరూ ఎదురు చెప్పలేకపోయారు. అతనన్నట్టుగానే భయపడ్డారు కూడా.

అందుకే అందరూ తిరిగి వెళ్లిపోయారు. వరదయ్య, మునిరాజు చిద్విలాసంగా నవ్వుకున్నారు.

  

కాలం విచిత్రమైంది.

నిండు హృదయాలను ముక్కలు చేసి, ముక్కలైన హృదయాలను అతికిస్తూనే



# ఏరిన ముత్యాలు

★ నరకంలో అన్నిటికన్నా గొప్ప యాతన - అక్కడ చావు లేకపోవడం.

-జాన్ వెబ్‌స్టర్

★ జంతువులకన్న మనం మేధావులం, సమర్థులం. కనుకనే వాటి క్షేమానికి మనం కర్తలం.

-అనిబిసెంట్

★ ఎప్పుడూ నవ్వుతూ వుండేవారిని చూసి మోసపోకు. వారికంటె దురదృష్టవంతులు, దుఃఖించేవారు ఇంకెవరూ వుండరు.

-సెనెకా

★ పైపై ఆడంబరాల ఆకర్షణ కొంతసేపే పనిచేస్తుంది. శాశ్వతంగా హృదయాలలో చెరగని ముద్ర వేసేది సత్ప్రవర్తన.

-నెహ్రూ

★ ఇతరులకు అన్యాయం చెయ్యడంకన్న ఇతరులు నీకు చేసిన అన్యాయాన్ని సహించడం మేలు. అలాగే పరులను శంకించడంకన్నా నమ్మి మోసపోవడం ఉత్తమం.

శామ్యూల్ జాన్సన్

★ పేదలకు మనం ఇచ్చేదానికన్నా వారు ఇచ్చేది ఎక్కువ. వారిపట్ల కనికరం చూపడం అర్థంలేనిమాట. వారినుంచి మనం చాలా నేర్చుకోవలసివుంది.

-మదర్ థెరిసా

★ ప్రజలు వేళ్లులాంటివాళ్లయితే ప్రభుత్వం 'ఫలం' అవుతుంది. వేళ్లు చక్కగా తమ విధిని నిర్వర్తిస్తేనే పండు తియ్యగా వుంటుంది.

-గాంధీజీ

★ పుట్టినప్పటినుంచీ చనిపోయేవరకు విజ్ఞానాన్ని సంపాదించాలి. విజ్ఞానంకంటె మేలైన సంపద మరేదీ లేదు.

-ఖురాన్

★ విజ్ఞానం దృష్టివంటిది. మిక్కిలి శక్తివంతమైనది.

-భాగవతం

★ ధనం వాడితే తరిగిపోతుంది. విద్య, విజ్ఞానం వాడితే వృద్ధిపొందుతాయి.

-అరబిక్ సామెత

★ మానవుడు సృష్టించిన అద్భుతాలలో పుస్తకాలు మహత్తరమైనవి.

-మాక్సిమ్

---

సేకరణ: ఆముదాల అజయ్‌బాబు

తిరిగి ఆ గాయాలనదే స్వయంగా మాన్పుతుంది.

శివదాసు విషయంలోనూ అదే జరిగింది. భాతృ వియోగాన్ని మరచి తిరిగి తన పనులు యథావిధిగా కొనసాగించుకోవాలి అనుకున్నాడు శివదాసు.

అయితే ఆ సంఘటన ఆతని జీవితంపైన ఎంతో ప్రభావాన్ని చూపించింది.

బుడ్డన్నకు బదులుగా శివభాసును తన జీతగాడిగా చేరమన్నాడు వరదయ్య. అందుకు తిరస్కరించాడు శివదాసు. పైగా ముందులా సారా కాచడానికీ పోవడంలేదు. అన్న మరణం ఆతనికి ఎన్నో గుణపాఠాల్ని, తెలివి తేటల్ని, స్వయంగా కష్టపడి పనిచేసుకోవాలనే పట్టుదలను నేర్పించింది.

మట్టి పనులు ఒప్పుకొని ఆ పనులే సక్రమంగా నిర్వర్తిస్తూ నాలుగు రాళ్లు సంపాదించుకుంటున్నాడు.

ఒకనాటి సాయంత్రం ఐదు గంటల వేళ... వరదయ్య బావిలో పూడు ఎత్తుతున్నారు గూడెంవాళ్లు. కొందరు మగవాళ్లు సలంక పారలతో నీళ్లోడుతున్న బురదను కానగ బర్రలతో అల్లిన తట్టల్లో వేస్తున్నారు.

ప్రతి మెట్టుకు ఒక్కొక్కరు చొప్పున నిలబడి ఆ తట్టల్ని ఒకరి నుండి మరొకరు మార్చుకుంటూ అంతవరకూ గట్టున గుట్టలా వేసివున్న మట్టి కుప్పలో కుమ్మరిస్తున్నారు.

అందరూ బురదలో పొర్లాడుతున్న వింత జంతువుల్లా కనిపిస్తున్నారు.

ఆ రోజుకు పని విరమించాక అందరూ నెత్తిమీదవున్న చుట్టల్ని విప్పుకొని బిలబిలమంటూ గట్టుపైకి వచ్చి విదిలించుకోసాగారు.

శివదాసు కొరముట్లు కడుగుతున్నాడు.

పక్కనున్న బావిలోకి దూకి శుభ్రంగా బురద కడుక్కొని మగవాళ్లందరూ వెళ్లిపోయారు.

స్త్రీలు మాత్రం ఆ పక్కనేవున్న మరో దిగుడు బావిలో దిగి బురద కడుక్కోసాగారు.

బావిలో వారు తడిసివున్న చీరల్ని విప్పి నీటిలో పులిమి ఉతుక్కుంటున్నారు.

అక్కడ మగ పురుగు లేదు.

ఈత వచ్చినవారు చీరల్నే పుట్టగోచీలుగా బిగించి ఈదుతూ కేరింతలు కొడుతున్నారు.

దొరువులు బాగుండడంతో దొరువులపై నుండే కొందరు కడుక్కుంటున్నారు. వారి అర్ధనగ్న శరీరాలు ఆ సాయంత్రపు ఎెండలో మెరిసిపోతున్నాయి.

పగలంతా పనిచేసిన శ్రమను వారు ఆ విధంగా మరిచిపోతున్నారు.

పద్దెనిమిదేళ్ల రాజమ్మ ఈత రాకపోయినా ధైర్యంగా నీటిలోకి మెట్లదారి గుండా మొలలోతు వరకు దిగి, చీర విప్పి నీటిలో కూర్చొని మునిగి ఒళ్లు కడుక్కుంటోంది.

ఆమె పక్కనే యింకొంచెం పైగా దొరువుపైన కూర్చొని నీటిలో కాళ్లు చేతులు రుద్దుకుంటూ తన చీర పైటను నీటిపైన పరచి చేతుల్తో అలుముకుంటోంది మాతంగి.

ఆమెకూ ఈత రాదు!

"వసే మాతా! నా ఈపు అట్ట రుద్దే'' అంది లో బాడీ ముడి విప్పి బాడీని మెడపైకి లాక్కుంటూ రాజమ్మ.

"అంత లోతుకు నేను రాలేనే రాజీ... నువ్వే యింకొంచెం పైకి రాయే'' భయపడుతూ అంది మాతంగి.

"ఏం కాదులేయే... దొరువు పట్టుకోని ఒక మెటిక దిగిరా'' అంది రాజమ్మ.

భయపడుతూనే రాజమ్మను సమీపించి నీటిలో నిలబడి వీపు రుద్దసాగింది మాతంగి.

ఇంతలో ఈత వచ్చిన వారంతా ఒక్కొక్కరే తమ చీరలు పిండుకొని వాటిని అలాగే గట్టుపైన ఆరవేసుకొని మెల్లగా ఇండ్లకు

బయలుదేరారు.

బావిలో రాజమ్మ, చుక్కమ్మ, మాతంగి మరికొందరు బాలికలు మాత్రమే మిగిలిపోయారు.

"ముండనా సవుతుల్లారా... బిన్నేరాండే... యింకా యింట్లో శానా పనుండేది పోవాల" నీటిలో వున్న వారిని హెచ్చరిస్తూ అన్నారు మిగిలినవారు.

ఇంతలో బావిలో నుండి కేకలు!

"అయ్యో అక్కా!!" బావిలో బాలికల ఏడుపులు, "ఇంగెట్టే మాతా?"

చుక్కమ్మ, రాజమ్మ ఒకేసారి అరిచారు.

"ఏం జరిగిందే?" అంటూ గట్టుపైన వున్న కొందరు బావిలోకి తొంగి చూశారు.

"మాతంగి బాయిలో పడిపోయింది. అయ్యో దానికి ఈత రాదే"

"ఎవ్వరైనా దూకండే"

"కాపాడండే..."

గోలగోలగా గుండెలు బాదుకుంటున్నారు.

"దూకండి... కాపాడండీ!" అని ఎవరికి వారు అరుస్తున్నారే కానీ ఎవ్వరూ బావిలోకి దూకడం లేదు.

బావిలో మాతంగి ప్రాణ భయంతో మునిగి తేలుతోంది. చుక్కమ్మ తన పైటను లాగేసి ఒక కొసను పట్టుకొని, యింకొక కొసను బావిలోకి విసురుతూ... "పట్టుకో మాతా... పట్టుకో దొరువుకీడుస్తా పట్టుకోమ్మా" ఆందోళనగా అరుస్తూ దాన్ని పట్టుకుంటే కాపాడవచ్చని ప్రయత్నిస్తోంది.

అయినా దాన్ని అందుకోలేకపోతోంది మాతంగి. "కాళ్లూ సేతులు ఆడించు తల్లీ... సేతుల్తో కడుపు కిందికి నీళ్లు ఈడ్చుకోమ్మా... పైటందుతుందమ్మా" ఈత కొట్టే వైనం చెబుతూ సూచిస్తోంది మల్లమ్మ.

అవేవీ వినిపించుకునే స్థితిలో లేదు మాతంగి. బావిలో బాలికల అరుపులు!

గట్టున స్త్రీల కేకలు!

క్షణంలో అక్కడి వాతావరణం మారిపోయింది. ఆడంగుల అరుపులతో, ఆర్తనాదాలతో భయంకరంగా గగ్గోలైపోయింది.

గట్టుపైన అందరూ చూస్తూనే వున్నారు. అయినా ఎవరూ ఆమెను రక్షించలేకపోతున్నారు.

మాతంగి క్షణక్షణం చేష్టలుడిగి నీటిలోకి మునిగిపోతోంది. ఇంతలో ఉన్నట్టుండి ఆకాశం నుండి ఊడిపడినట్టు బావిలో ఎవరో దూకినట్లు గుబుళ్లున పెద్ద శబ్దం వినిపించింది. ఆ దూకిన వ్యక్తి ఎవరా అని చూస్తున్నారందరూ.

పైకి తేలకుండానే... నీటిలో మునిగే... వెనుకవైపునుండి వెళ్లి మాతంగిని పైకెత్తి పట్టుకొని పైకి తేలాడా వ్యక్తి

పైకి తేలిన ఆ వ్యక్తి శివదాసని గుర్తించి అందరూ ఆనందించారు.

బావి పూడెత్తడంలో గుత్తకు వప్పుకున్న వారిలో శివదాసు కూడా ఒకడు. అందరూ వెళ్లిన పిదప తట్టలు, సలంక పారలు, గునపం భద్రపరచి కొంచెం ఆలస్యంగా బయలుదేరాడతను. ఆ సమయానికే ఈ అఘాయిత్యం జరిగింది.

వారి అరుపులు విని అటువైపు రావడం... ఒక్క క్షణం ఆలస్యం చేసివున్నా మాతంగి దక్కేదికాదు.

బావిలో నుండి తన రెండు చేతులతో మాతంగిని గట్టుపైకి మోసుకు వచ్చి ఒక చోట వెల్లకిలా పడుకోబెట్టాడు శివదాసు.

ఆడవాళ్లు ఆతని చుట్టూ వలయాకారంగా మూగారు.

అచేతనంగా పడివున్న మాతంగి పొట్టపైన తన రెండు చేతులూ వేసి సుతారంగా నొక్కసాగాడు.

తాగిన నీళ్లు భళ్లున కక్కుకుంటోంది మాతంగి. స్పృహలోనే వుంది. కానీ భయపడి




నీళ్లు తాగి ఆయాసం వచ్చి వుండడంతో మాట్లాడే స్థితిలో మాత్రం లేదు.

ఆడవాళ్లంతా ఆత్రంగా చూస్తున్నారు.

"ఓయమ్మా... యింగేం ఫరవాలేదులే సావీ... దేవుడి మాదిరి వచ్చి కాపాడినాడు''

"వొగ్గెడియ యా మారినా మనకు దక్కేది కాదు బిడ్డె''

"నూరేండ్లు... సల్లంగ వుండు సావీ... మా అందరి ఆయుస్సు పోసుకో'

ఇలా రకరకాలుగా అనుకుంటూ శివదాసుకు కృతజ్ఞతలు, అభిమానాలు కురిపిస్తూ... వలయాకారంగా వారు చుట్టూ చేరారు.

నునుపైన ఆమె తొడలపైన తొలిగిపోయి వుంది చీర. ఆమె జాకెట్టు... ఉతుక్కుంటున్నప్పుడు ఎప్పుడో బావిలో జారిపోయింది.

నగ్నంగా, అందంగా నాజుగ్గా కనిపిస్తున్న ఆమె స్తన సౌష్టవం, మెడ, నడుం చూసేసరికి ఆతనికి మతిపోయినట్లనిపించింది. ఇంత అందాన్ని ఎలా దాచుకుని వుందో అనిపించిందతనికి.

ఆరోగ్యంగా వున్న ఆడదాని శరీరాన్ని, అందునా అందమైన పదహారేళ్ల కన్నెపిల్ల శరీరాన్ని అంత దగ్గరగా అంత నగ్నంగా అతను ఎప్పుడూ చూసి ఎరుగడు.

చామనఛాయతో నిగనిగలాడుతున్న ఆమె అందాల్ని చూసిన శివదాసు 'ఇంత అందం క్షణంలో నీళ్లపాలై పోతా వుండెనే...' అనుకున్నాడు.

బావిలో దూకేటప్పుడు తన పంచెపైగుడ్డ గట్టున విసరివేసి, ఆమెను రక్షించాడు.

వాటిని తీసుకు వచ్చి ఇచ్చింది ఆతని చెల్లెలు చుక్కమ్మ. అప్పుడుగానీ అతను ఇహంలోకి రాలేదు.

తన పంచెగుడ్డను ఆమె గుండెలపైన కప్పి తొలిగిపోయి వున్న ఆమె చీరను సరిచేసి తలగుడ్డతో ఆమె ముఖంపైన, తలపైన తేమను తుడవసాగాడు.

కొంతసేపటికి తేరుకున్న మాతంగి అందరివైపు ఒక్కసారి చూసి లేచి కూర్చోడానికి ప్రయత్నించింది. దాంతో ఆమె ఎదపైనవున్న తలగుడ్డ జారికింద పడింది. అంతలోనే సిగ్గుతో గబాలున దాన్ని తిరిగి గుండెలపైకి లాక్కుంది.

రాజమ్మ, చుక్కమ్మ చెరొక వైపు చేతులు పట్టుకొని సహాయం చేస్తూ కూర్చోబెట్టారు.

ఎదురుగా తడిసిన డ్రాయరుతో వున్న శివదాసుని చూసి పరిస్థితిని అర్థం చేసుకుని కృతజ్ఞతతోను, సిగ్గుతోను తలవంచుకుంది మాతంగి. అంత మాత్రానికే శివదాసు పొంగిపోయాడు.



ఊర్లో నివశిస్తున్న కులాలను బట్టీ, సమీపంలో వుండే అగ్రకులాల వారినిబట్టి యింకా అనేక రకాలుగా కొన్ని పల్లెలకు పేర్లు వస్తుంటాయి.

కూలి చేసుకుని బతికేవారేవున్న ఆ పల్లెకు 'కూలిపేట' అనీ, అగ్రకులాల వారు నివశిస్తున్న జమిలిగడ్డకు సమీపంలో వుంది గనుక 'జమిలిగడ్డ గూడెం' అని ఆ పల్లెకు పేరు.

గూడెంలో అన్నీ పూరి గుడిసెలే. ప్రతి పూరిగుడిసె పక్కనా రాళ్ల గోడతోను, చొప్ప లేదా చిరిగిపోయిన చాపలు, గోనె సంచులు వంటి వాటితోను కప్పిన పందుల గుడిసె

వుంది.

పెద్ద గుడిసెల్లో మనుషులు నివసిస్తే చిన్న గుడిసెల్లో వారు మేపుకునే పందులు నివసిస్తుంటాయి.

ఆ గూడెంలో ఒకే కులానికి చెందిన సుమారు యాభై కుటుంబాల కూలీజనం జీవిస్తున్నారు.

పందులు మేపుకుంటూ మట్టి పనులు, బావుల పనులు చేసుకోవడమే వారి కుల వృత్తి.

గూడెం మధ్యలో సన్నని ఎగుడు దిగుడు వీధిబాట, ఉత్తర దక్షిణంగా వ్యాపించి, ఉత్తరాన అర ఫర్లాంగు దూరంలో వున్న జమిలిగడ్డకు, దక్షిణాన అంతే దూరంలో వున్న మాతమ్మ గుడికి చేరుకుంటుంది. ఆ గుడికి అతి సమీపంలో ఊరికి చివర మాతమ్మల కోసం నిర్మించిన ఓ పాతకాలంనాటి పాడుబడిన గుడిసె వుంది.

మాతమ్మ గుడికి, గూడానికి మధ్యలో తూర్పు పడమరలగా పోయే మరో కాలిబాట పడమటివైపు ఫర్లాంగు దూరంలో వున్న మేకలవారిపల్లెకు, తూర్పున ఫర్లాంగు దూరంలో వున్న బచ్చనకుంటకు చేరుకుంటుంది.

ఈ రెండు పల్లెలు రెండు చెరువులమధ్య, చుట్టూ వలయాకారంగా పెట్టని కోటలా వున్న కొండలతో ఆధునిక నాగరికతకు దూరంగా విసిరేసినట్లుంటాయి.

మాతమ్మ గుడి పక్కగా వెళ్లే ఆ కాలిబాట గుండానే పశువులు, మేకలు మేపుకునే వారు, కట్టెలు కొట్టుకునే వారు వెళ్లి వస్తుంటారు. అది కల్లూరు అడవికి వెళ్లేదారి.

గూడెం చివర ఉత్తర దిక్కున ఒక చింతచెట్టు, దానికింద ఒక రచ్చబండ, ఆ రచ్చబండ మధ్యన మూడడుగుల సత్తిరాయి వుంటుంది.

అది ఆ ఊరి గ్రామదేవత!

రాత్రిపూట విరామ సమయంలో ఆ ఊరి మగవాళ్లు ఆ రచ్చబండ పైనే కూర్చొని కబుర్లు చెప్పుకుంటూ వుంటారు.

ఆ రచ్చబండ పైనే ఆ ఊరికి సంబంధించిన అనేక న్యాయాలు, తీర్పులు జరుగుతుంటాయి.

ఆ రచ్చబండ దగ్గరే రాత్రిపూట పూనకాలు వచ్చేవారు, డప్పులుకొట్టి ఆడుకునేవారు చిందులు తొక్కుతుంటారు.

ఆ రచ్చబండ పక్కగానే ఒక సన్నని కాలిదారి తూర్పుకు సాగి, అల్లంత దూరంలో వున్న వరదయ్య సేద్యపు బావి దగ్గరకు వెళుతుంది.

ఆ గూడానికి నీటి వసతి లేదు. ఎన్నో ఏళ్లుగా వారు ఆ బావినుండే నీళ్లు తెచ్చుకుంటున్నారు.

ఒకరోజు ఉదయం పదిగంటల వేళ... వరదయ్య బావి దగ్గర కొందరు ఆడవాళ్లు దోరగా వున్న టొమాటో కాయల్ని కోసి తట్టలకు వేస్తూ నిండిన తట్టల్ని వరదయ్య ఇంటికి చేరుస్తున్నారు.

ఆ టొమాటోలు సంతలు జరిగే కుప్పం, విజలాపురం వంటి దగ్గరి టవున్లకి తోలుకొని వెళ్లి అమ్ముకొని వస్తుంటారు వరదయ్య జీతగాళ్లు. టొమాటాలు కోస్తున్న కూలీలందరికీ పెద్దబోయసాని రంగమ్మ నాయకత్వం వహిస్తోంది.

రంగమ్మ ఒక రంగసాని.

దొరసాని, గౌడసాని, రెడ్డిసానిలాగా రంగసాని గౌరవ సూచకం అంటుంది రంగమ్మ. రంగమ్మకు సుమారు ముప్పయియిదు సంవత్సరాలుండవచ్చు. కనుముక్కు తీరు చక్కగా ఉండడంతో అందంగా పాతికేళ్ల ప్రౌఢలా కనిపిస్తుంది.

"సంతేల మీరిపోతుందే నా సవుతుల్లారా బిన్నేకానీ'' కూలీలను హెచ్చరిస్తూ తొందర చేస్తోంది రంగసాని.




ఆమె జమిలిగడ్డ గూడానికి చెందిన పెద్ద బోయసాని. రాయలసీమలోని ఈ కులంలో ఎన్నెన్నో వింత ఆచారాలున్నాయి. నమ్మకా లున్నాయి.

కొన్ని కుటుంబాలలో తరతరాలుగా ఒక ఆడపిల్లను బసివిగా మార్చే ఆచారం వుంది.

తొలి సంతానమైన ఆడపిల్లను యుక్త వయస్సు రాగానే దేవునికిచ్చి పెళ్లి చేసి, గూడెం చివర గుడిసె వేసి సమాజపరం చేస్తారు. ఆమె బిక్షమెత్తి జీవించాల్సిందే.

అలాగే మరో ప్రత్యేకమైన ఆచారం 'పెద్ద బోయసాని'

ఈ కులంలో స్త్రీలకు పెద్దగా కట్టు బాట్లుండవు. స్త్రీకి ఎక్కువ స్వేచ్ఛా ఇస్తారు.

ఎవతైనా సరే నచ్చిన వాడితో ఇష్టం వచ్చినన్ని రోజులు కాపురం చేయవచ్చు. నచ్చకపోతే మరొక పురుషున్ని పెళ్లి చేసుకోవచ్చు ఇలా ఎందర్నయినా మార్చవచ్చు. ఒకవేళ బిడ్డలు పుడితే వాళ్లు ఎవరికి పుట్టారో... ఆ మగవాడికే చెందుతారు. ఈ విషయంలో వావివరుసలు కూడా పెద్దగా పాటించరు.

అలా పన్నెండు మంది మగవాళ్లతో కాపురం చేసిన స్త్రీకి ఒక ఉన్నత స్థానాన్నిచ్చి పట్టం కట్టి ఆ గూడానికి నాయకురాల్ని చేస్తారు. కాబట్టే ఆమెను పట్టంబోయసాని, పెద్దబోయసాని అంటారు. ఆమెతోవున్న మగవాన్ని పెద్దబోయడు అంటారు.

పెద్ద బోయసానికి కొన్ని ప్రత్యేక సౌకర్యాలున్నాయి.

పండుగలకు, పబ్బాలకు ఏ యాట తెగినా దాని కాళ్లు, తలకాయ, ఒక భాగం మాంసం ఆమెదే. ప్రత్యేకించి తాంబూలంలో కూడా ఉచితభాగమే.

అలాగే ఆ ఊరిలో ఎవరైనా సరే మట్టి పనులు ఒప్పుకుంటే వచ్చిన లాభంలో పనికి వచ్చినా, రాకపోయినా ఆమెకు భాగం ఇవ్వాల్సిందే.

దీన్నే 'బోయసాని భాగం' అని అంటారు. ఆమె ఏమి చేసినా ఎవరూ ఎదిరించకూడదు. ప్రశ్నించకూడదు. అలాచేస్తే కులానికి చేటని వారు నమ్ముతారు.

ఈ ఆచారాన్ని బట్టే 'నీకు పట్టం కట్టిచ్చినా రా' అన్న సామెత పుట్టుకొచ్చింది.

ఆ ఊరి పట్టం బోయసాని, రంగసానికి వారి కులదేవత మాతమ్మ కూడా ఆవహిస్తుంది. ఆ సమయంలో ఆమె ఏది చెబితే అది వేదంలా వారు భావిస్తారు.

ఈ రంగసాని రంగమ్మ పన్నెండు సంవత్సరాల వయసులోనే పెళ్ళి చేసుకుని అత్తగారింటికెళ్ళింది. కొద్దిరోజుల్లోనే భర్తతో ఆమెకు కుదరక అత్తమామలు హింసించడంతో ఒక శుభముహూర్తాన పక్కింటి అతన్ని లేవదీసుకొని మరొక ఊరికెళ్ళిపోయింది. అతనికి ఆమెపైన మోజుతీరిన తర్వాత ఆమెను వదిలేస్తే మరొకతన్ని చూసుకుంది.

అలా కట్టుకున్న ప్రతివాడు కొద్దిరోజులుంచుకొని వదిలేయడం, బతుకు తెరువు కోసం ఆమె మరొక తోడును వెతుక్కోవడంలో పదమూడు మంది మగాళ్ళను మార్చేసింది.

పదమూడవవాడు వీరన్న.

ఈమధ్యనే అతను చనిపోతే అప్పటి నుండి వరదయ్యతో అక్రమ సంబంధం పెట్టుకోవడమేగాకుండా అవసరమైనప్పుడు అతనికి అమ్మాయిల్ని తార్పుతుంటుంది. ప్రతిఫలంగా ఆమెకు వరదయ్య కొత్తబట్టలు, డబ్బులు ఇస్తుంటాడు.

ఆరోజు వరదయ్య నీళ్లతొట్టిపైన కూర్చుని సిగరెట్టు తాగుతూ, వయ్యారంగా వంగి టొమాటాలు కోస్తున్న రంగసాని సోయగాల్ని చూస్తున్నాడు.

"దీనెబ్బుడాలు ఇంత వయసైనా ఓ యబ్బయంత సొగసుగా వుంటుంది.. ఆ నడుము, ఆ మెడ దీనెవ్వ చూస్తానే పాణం కొటకొటలాడిపోతుంది"

ఆమె అందాల్ని కళ్ళతోనే తాగేస్తూ అను కుంటున్నాడు. ఇంతలో బావిలో చప్పుడ యింది.

తలతిప్పి చూశాడు.

షెడ్డుకు వెలుపల బావిగట్టున ఆ తొట్టి వుంది. మిషన్ వదిల్తే వచ్చే నీళ్లు పైపు ద్వారా ఆ తొట్టిలోనే పడతాయి. కాబట్టి దానిపైన కూర్చుని బావిలోకి చూస్తే... బావి లోకి వెళ్ళే మెటకలు, బావిలోని వాళ్లు స్పష్టంగా కనిపిస్తారు. అందుకే అలా చూశా డు.

అప్పటికే నీటికుండను నెత్తిన పెట్టుకొని అపర శకుంతలలా వయ్యారంగా అడుగులు వేసుకుంటూ ఒక చేత్తో కడవను, మరోచేత్తో కాళ్ళకు తగులుకుంటున్న పావడా కుచ్చిళ్ళ ను పైకెత్తి పట్టుకొని వస్తున్న నాగమ్మ కనిపించింది.

పైకెత్తి వున్న చీర కుచ్చిళ్ళకింద కనిపిస్తు న్న మోకాళ్ళు, రవిక సందులోనుండి కని పిస్తున్న ఎత్తుపల్లాలు అతనికి మతిపోగొ ట్టాయి.

తమకంతో ఆమెవైపు చూస్తున్నాడు. అత నిలోని కోరిక పాములా బుసలు కొట్టింది. ఇంతలో టమాటో తట్టను అక్కడికి మోసుకొ చ్చి దించిపెట్టింది రంగసాని. రొప్పుకుంటూ నీళ్ళకడవను మోసుకొని గూడెంవైపుకు వె డుతోంది నాగమ్మ.

"రంగీ! ఎవరాయమ్మి?" అటువైపే చూ స్తూ ప్రశ్నించాడు.

"ఏం? సూప్పడిందా?" తన కుడిచేతి తర్జనిని గడ్డంపైన వుంచుకుని వయ్యారంగా మూతి తిప్పుతూ అంది రంగసాని.

"అంత సోగసైన ఆడదాన్ని సూస్తావుంటే ఎవురికి మాత్రం మొనుసుంటుంది''

"ఆ యమ్మి ఉప్పుతోళ్ళ రామన్న కూతు రు నాగమ్మగదా! ఇంకా పెండ్లికాలా''

అతనికున్న పెద్ద బలహీనతల్లో అదీ ఒకటి, అందుకే... "ముందు నేనే శోభనం జరిపించేస్తా'' అన్నాడు.

"అబ్బో! నువ్వంత మొనగోడివేలే. ఇప్పుడేం చేయమంటావ్?" వెటకారంగా అంది.

"రేపు ఈయాలకు ఈ సెడ్డుకు రప్పించెయ్. నీ రుణం ఉంచుకోను''

జేబులోనుండి రెండు పది రూపాయల నోట్లందిస్తూ అన్నాడు.

"హుఁ... సరే తప్పుతుందా అంతగా ఒప్పుకోకపోతే ఉండనే ఉందిగదా మాత మ్మ, పసుపు చీర"

బొడ్లో వుండే వక్కాకు తిత్తిలో దోపు కుంటూ అంది. పైట చెరగునే చేత్తో చుట్టగా చుట్టి నెత్తిన పెట్టుకోని "ఒకచేత్తో అట్ట ఎత్తు. బిన్నే ఇంటికి పొయ్యొస్తా'' ద్వంద్వార్థం వచ్చేటట్టుగా పలికింది.

అలా మాట్లాడ్డం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య.

"నీ సొగుసే కాదే నీ యబ్బడాలా... నీమాట కూడా మొగోన్ని నిలువునా రెచ్చగొ ట్టేస్తుందే''

వరదయ్య తమకంతో ఆమె బుగ్గపైన చిటికవేసి తట్టెత్తుకోవడానికి ఒకచేత్తో సాయం చేశాడు.

"ఎంతవారలైన కాంతా దాసులే అని ఊరికే అన్లేదే. ఎవరికీ వంగని నేను నీకాడ వంగాను. తట్టా ఎత్తాను'' అన్నాడు ఆమె ఎత్తుపల్లాల్ని చూస్తూ.

"నిజం పలికినావులే వస్తా..." అని రంగ సాని జమిలిగడ్డవైపు దారితీసింది.

"పన్నెండుకంతా అయిపోవాల బిన్నే కా నీండి'' కూలోల్లను హెచ్చరిస్తూ ఉండిపోయా డు వరదయ్య.

★ ★ ★

రాత్రి తొమ్మిగంటలప్పుడు చింతచెట్టు కింద రచ్చబండ దగ్గర 'డుబ్బూచుకు డు




బ్బూచుకు' అని డుముకుల శబ్దం విని పిస్తోంది.

అప్పుడప్పుడు గూడెం యువకులు డు ముకులనబడే మట్టి కుండలతో చేసిన చర్మపు వాయిద్యాలు వాయిస్తూ నృత్యాలు చేస్తూ పాటలు పాడి ఆనందిస్తుంటారు.

కష్టజీవుల గుండె దండోరాలా విని పిస్తోంది ఆ శబ్దం. గూడానికి అన్ని వినోద కార్యక్రమాలకి రంగస్థలమైన ఆ రచ్చబండ దగ్గర అప్పుడే చాలామంది చేరిపోయి వున్నారు.

ఆడవాళ్లు నేలపైన కూర్చొని తమ పిల్ల ల్ని తొడలపైన పరుండబెట్టుకొని చూస్తున్నా రు.

చింపిరి తలలతో గోచీపాతలు కూడా లేని చాలామంది చిన్నపిల్లలు డుముకుల శబ్దాని కనుగుణంగా అడుగులు వేస్తున్నారు. కొంద రు యువకులు కూడా నర్తిస్తున్నారు.

డుముకులపైన చేతివేళ్ళ దెబ్బలు వే గంగా పడుతున్నాయి.

నర్తించే వారి అడుగులు అదే వేగాన్ని పుంజుకుంటూ లయబద్ధంగా కదుల్తు న్నాయి.

అదే ధృతగతిలో పాట అందుకున్నారు. బీళ్ళకాలంలో చేలలో వున్న ఎలుకల్ని పట్టే వృత్తాంతాన్నే వారు పాట రూపంలో పాడు కుంటున్నారు.

ఆనందంగా పాట సాగిపోతోంది.

ఇంతలో... వీధిలో... చివర పీకలదాకా సారాతాగి తమ ఇండ్లముందు కూర్చొని వున్న నాగన్న, తిమ్మడు కొట్లాటకు దిగారు.

ఈ గూడెంలో ప్రధానంగా రెండు తెగలు న్నాయి. బావులు తవ్వడం, మట్టిగోడలు, చేలగెనాలు కట్టడం, ఇటుకలు కోయడం వంటి మట్టిపనులు చేసి బతికేవాళ్లు మట్టి తెగకు చెందినవారు.

అడవిలోని చింతకాయ, తేనె మొదలైనవి సేకరించి, గాడిదలపైన ఉప్పుమూటలు వే సుకొని వాటిని 'ఉప్పమ్మో ఉప్పో ఉప్పు' అని అరుస్తూ చుట్టుపక్కల ఊర్లలో తిరిగి అమ్ముకొని బతికేవాళ్లు ఉప్పుతెగకు చెందిన వాళ్లు. ఈ రెండు తెగలకులం వక్కరే అయినా ఉప్పుతెగవాళ్ళను, మట్టితెగవారు చాలా హీనంగా చూస్తారు. ఉప్పు తెగకు చెందినవాళ్ళతో వివాహ సంబంధాలు పెట్టు కోరు. కనీసం వాళ్ళ ఇండ్లలో భోజనాలు కూడా చేయరు.

ఈ రెండు తెగలకు పందులు మేపడం, ఎలకలు పట్టడం వంటి వృత్తులు సమా నంగా వున్నాయి.

వీరిలో వీరు ఏవిధంగా వున్నా అగ్రకులా లవారు మాత్రం ఇద్దరినీ ఒకేవిధంగా ఇంచు మించు అంటరానివారిని చూసినట్లు చూస్తా రు.

ఈ కులంలో సారా కాచడం, సారా తాగడం తెలియనివారు అరుదు.

మట్టితెగకు చెందిన నాగన్నకు, ఉప్పుతె గకు చెందిన తిమ్మడికీ మధ్య రేగిన కొట్లాట చాలా విచిత్రంగా ప్రారంభమైంది.

"నా యాండ్లకు ఇంగేం పన్లేదబ్బా. నిద్దర లేకుండా సంపతా వుండారు'' అన్నాడు తిమ్మడు.

"ముండనాకొడుకులు అసలు ఉప్పునా కొడుకులంతా అట్టాటోళ్లే... దొంగనాకొడుకు లు'' అన్నాడు నాగన్న. డుముకులు వాయి స్తున్న ఉప్పుతెగకు చెందిన యువకుల్ని ఉద్దేశించి,

తన తెగవారిని దొంగలన్నందుకు పక్క నేవున్న తిమ్మడికి వళ్లు మండింది.

"మీ వోళ్లేరా దొంగలు. ఈళ్లు డంకులోయి స్తావుంటే మీ వోళ్లు గొమ్మునుండగూడదా... ఎగిరిసస్తా వుండారు. నిద్దరపొద్దున... ఎభి సారి నా కొడుకులు'' విరుచుకుపడ్డాడు తిమ్మడు.

"వరే దొంగనా కొడకా ఎవురు దొంగ



లైందీ ఎవరు యభిసార్లు అయిందీ ఈ జగతికి తెలుసురా... అసలు నీకు... దొంగతనాలు సేసేగదరా దొంగతిమ్మడని బిరుదొచ్చింది. సిగ్గులేని లంజాకొడకా... ఇంకా సూడు సినాయనా అని బొక్క తెరస్తా వుండావే'

మాటలతోనే ఎదురు దెబ్బతీశాడు నాగన్న. తనను ఎవరైనా దొంగతిమ్మడంటే భరించలేని తిమ్మడు ఆ మాటలతో మరీ పేట్రేగిపోయి నోటికి వొచ్చినట్లు మట్టితెగకు చెందిన వాళ్లను తిట్టసాగాడు.

అది విన్న మట్టితెగకు చెందిన యువకులు కొందరు తిమ్మడిపైబడి చేయి చేసుకున్నారు.

దాంతో తిమ్మడి తరపున ఉప్పుతెగకు చెందిన వాళ్ళంతా ఏకమై వాళ్ళపైన పడ్డారు.

క్షణంలో అక్కడి వాతావరణం భయంకరంగా మారిపోయింది. డుముకులు వాయిస్తున్నవారు, నర్తిస్తున్నవారు కూడా దాన్నాపి ఆ దొమ్మిలో చేరిపోయారు.

ఆడవాళ్లు, పిల్లలు అందరూ ఒకర్నొకరు విపరీతంగా దూషించుకుంటూ కొట్లాడు కుంటున్నారు.

కర్రలు గాలిలో లేస్తున్నాయి.

తలలు చిట్లిపోతున్నాయి.

రక్తబిందువులు నేలకు రాలుతున్నాయి.

అంతా గందరగోళం!

అంతా ఒకటే గలాటా!

ఆ సంఘటన ఏ ఇల్లాలికంట్లో కన్నీరొలి కిస్తోందో... ఏ పసి హృదయాలపైన ఎలాంటి రాక్షసముద్రను వేస్తోందో ఎవరూ గమనించడంలేదు.

బయట పనిచూసుకుని ఇంటికొచ్చి భోంచేస్తున్న శివదాసుకు అతని చెల్లెలు చుక్కమ్మ వీధిలోనుండి పరుగెత్తుకు వచ్చి ఆత్రంగా చెప్పింది.

"అన్నా! ఈదిలో సారాయి తాగేసి అందరూ కొట్టుకుంటా వుండారు''

తింటున్న సంగటిని అలాగే వదిలేసి చెంబుతో బయటికి వచ్చి చేయి కడుక్కుని, చుక్కమ్మకు చెంబు అందించి పరుగెత్తు కుంటూ, వీధిలో కొచ్చాడు శివదాసు.

అప్పటికే ఉప్పుతెగకు చెందిన రెడ్డప్ప వారిని విడదీయడానికి ప్రయత్నిస్తున్నాడు.

శివదాసు కూడా ఆ దొమ్మీలో దూరి ఆ రగడను ఆపడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆ ఇద్దరి ప్రయత్నంతో క్రమంగా ఆ రగడ తగ్గిపోయింది.

తగిలిన దెబ్బలకు చాలామందికి సారా మత్తు దిగిపోయింది.

అయినా ఆడవాళ్లు తమ ఇండ్లముందు నిలబడి ఒకర్నొకరు తీవ్రంగా తిట్టుకుంటూనే వున్నారు.

"ఒరే! మన కులం పీకటా ముడ్డి పీకటా ఒకటేనంటారు. ఇందుకేరా ముండనాకొడుకుల్లారా పీకల్దాకా తాగేసి దినొమ్ము ఇట్టా కొట్టుకోని సస్తావుంటే ఏమొస్తుందిరా మీకు. మేకలోల్ల పల్లిలో వాళ్లను, జమిలిగడ్డ రైతుల్ని సూసి నేర్చుకోండ్రా. మాట మాట్లాడితే సాలు కొట్టుకోవడాలు. మీ బాధకు మా యట్టా పిల్లకాయలంతా తలొంచుకోవాల్సొస్తావుంది. తుపుః" నేలకు ఉమ్మి తన తెగవాళ్లను మందలిస్తూ అన్నాడు శివదాసు.

"ఒరే! ఆడయాడన్నా తాగి సావండి. మా యబ్బగంటు యాడా పోలా. తాగేసి మాత్రం తలకాయలు పగలకొట్టుకోకుండా వుండండి. ఇట్ల తక్కువ పన్లు సేసిగదా మనమంటే అందరికీ చులకనైపోయి గూడంకన్నా మెత్తగైపోయిందేది''

తన ఉప్పుతెగవాళ్లను చివాట్లు పెడుతూ అన్నాడు రెడ్డన్న.

అందరి తలలు అవమానంతో వంగిపోయాయి. ఒక్కొక్కరే తమ ఇండ్లకు వెళ్లిపోయారు.

★ ★ ★

వరదయ్య బావికవతల వరదయ్య మామిడితోట వుంది. మామిడి తోటంటే... అది పెద్దమామిడి తోటేం కాదు. ఓ ఇరవై మామిడి చెట్లు. అందులో ఓ అయిదు చింతమానులు, రెండు నేరేడుచెట్లు గుబురుగా వుంటాయి. దాని మధ్యలో ఒక సపారి వంచి వుంది. అది ఎండిన చెరుకాకుతో కప్పబడిన ఆరంకణాల సపారి. ఆ సపారిలో అప్పుడప్పుడు విందుభోజనాలు వంటివి చేస్తూ వుంటారు వరదయ్య, అతని స్నేహితులు. అది వరదయ్యకు అతని అథితులకు ఒక విలాస మందిరంగా ఉపయోగపడుతుంటుంది.

దాని ముందర ఒక పెద్ద బాదంచెట్టు. దాని కవతల మరో జామచెట్టు. దాని పక్కనే రెండు దానిమ్మ చెట్లు వుంటాయి. ఆ చెట్లలో కాసే కమ్మని కాయలకోసం ఎప్పుడూ రామ చిలకలు, కాకులు అక్కడ చేరి రొదచేస్తుంటాయి.

ఇలా చుట్టూ ఎత్తయిన చెరుకు తోటలతో




పచ్చని వరి పొలాలతో, పక్షుల కిలకిలారావాలతో నట్టనడి సముద్రంలో ఉన్న జీలిగడ్డలా రమ్యంగా, ప్రశాంతంగా ఉంటుందక్కడి వాతావరణం.

ఆ తోటకి వెనక రెండు మడికయ్యలి కవతల ఓ కాలిబాట. అది బచ్చన్న కుంటకు వెళ్లే దారిలో కలిసిపోతుంది.

ఆరోజు సాయంత్రంవేళ... ఆ దారిపక్కన వున్న ఒక చిన్న గుండుపైన కూర్చొని చిన్ననాటి స్నేహితురాళ్ల కోసం ఎదురుచూస్తోంది త్రిపురసుందరి, పదేపదే అసహనంగా ఆ దారివైపు చూస్తూ.

"ఈ నా సవుతులు త్వరగా రారే... వంటిగా ఈడ ఎంతసేపని కూసుండేదబ్బా'' అని మాటిమాటికి అనుకుంటోంది.

అలా కొన్ని క్షణాలు గడిచిన తర్వాత ఒక గొర్రెపిల్లను చంకన బెట్టుకుని, చద్దినీళ్ల చెంబును ఒక చేత్తో పట్టుకోని అటువైపుగా వచ్చింది మేకలోళ్ళపల్లె మంగమ్మ.

ఆమెను చూడగానే "ఏమే... మంగీ... ఎంతసేపని సూసేది మీ కోసరం... ఆం మాతంగింకారాలా... ఛ... ఛ" అని విసుక్కుంది త్రిపురసుందరి.

"ఏదో పనుంటుందిలేవే. ఏమి రమ్మంటివంట సెప్పు" అంది.

ఆ గుండుపైనే గొర్రెపిల్లను దించి కూచుంటూ అంది మంగమ్మ.

"మనం మాట్లాడుకోని వారంరోజులైపాయ. ఇంట్లో నాకేమీ పొద్దుపోలా'' అంది సుందరి.

"మీకేమే... మారాజులు... మీకు తిని ఊరికే ఉండేదానికి పొద్దుపోదు. మాకు కడుపులోకి కాసింత తినేదానికే టైముండదు'' అని నిష్టూరపోయింది మంగమ్మ.

మంగమ్మ మేకలోళ్లపల్లెలో వుండే మేజారి సిద్దప్ప కూతురు.

పదేళ్లక్రితం జమిలిగడ్డలో కొత్తగా ఎలిమెంటరీ స్కూలు ప్రారంభమైనప్పుడు ఆ మూడు పల్లెలకు సంబంధించిన పిల్లలూ ఆ స్కూల్లో చేరారు. తగినంతమంది లేనందువల్ల ఆ గ్రామంలో ఉండే పిల్లలంతా బలవంతంగా ఆ స్కూల్లో చేర్చబడ్డారు.

ఆ విధంగా ఆ ముగ్గురు కలిసి మూడేండ్లపాటు ఆ స్కూల్లో చదువుకున్నారు.

అప్పుడు వారిమధ్య ఏర్పడిన స్నేహం ఇంకా చెక్కుచెదరలేదు.

త్రిపురసుందరి ధనవంతుల బిడ్డ కాబట్టి ఏ పొలాల దగ్గరో లేదా ఊరి ముందరున్న మాతమ్మ గుడి దగ్గరో ఎక్కువగా మాతంగీ, మంగమ్మ ఆమెను కలుసుకుంటూ ఉండేవాళ్లు. ఆవిధంగా కలుసుకోవడానికి ఆరోజు వాళ్లిద్దరినీ అక్కడికి రమ్మంది త్రిపురసుందరి.

"ఈ గొర్రెపిల్ల బలేవుందే. ఎక్కడికి తీసుకుపోతున్నావ్?" గొర్రెపిల్లను వడిలోకి తీసుకుని అక్కున చేర్చుకొని ముద్దుపెడుతూ అంది త్రిపురసుందరి.

"మాయప్ప... ఈ సమీపంలో బచ్చనకుంట్లో గొర్రెలు తోలుకోనుంటానన్నాడు. ఈ గొర్రెపిల్ల చిన్నదికదా. గొర్రెలెనకంటీ పోలేందే. అందుకని పొద్దన్నే ఇంటికి తెచ్చుకోని సాయంత్రం దానెమ్మ దెగ్గర వదిలేస్తా. దానికోసరమెత్తకపోతాండా!"

వివరంగా చెప్పింది మంగమ్మ. ఆమె మాటల్ని ఆసక్తిగా వింటూ "ఈ చెంబులో ఏందే..." అని అడిగింది.

"మా యప్పకు సద్దినీళ్లు, పొద్దన్న అన్నం చేసిన సట్టిగోకుడుండ్లా అదీ పిసరు. దాంట్లోకి అంత పెరుగు అంత ఉప్పేసి కలిపింది. భలే రుచిగా వుంటుంది. తాగితే నువ్వు కూడా వదలవు''

"ఏదే ఓ గుక్కెడు తాగనీ చూద్దాం"

"నీకెందుకే ఇది. మారాజుల బిడ్డవి. ఇది పేదోళ్లు దాగే పరమాన్నం"

"ఆ మాటే వద్దనేది. మనిషికి రుచులు

కాదే ముఖ్యం. ప్రేమ, అభిమానం... ఇంతకీ ఇస్తావా ఇవ్వవా''

"ఓ... దానికేమంత బాగ్గెం... ఇంద తాగిసూడు'' చెంబు అందించి గొర్రెపిల్లను చేతిలోకి తీసుకుంది. ఆ చెంబును మూతి దగ్గర పెట్టుకొని ముందు వాసన చూసింది.

కమ్మని వాసన ఆమె నాసికను గిలిగింతలు పెట్టింది. ఒక్కగుక్క నోట్లో పోసుకుంది.

కమ్మటి రుచి జిహ్వాగ్రానికి తగిలి ఆ వెంటనే ఆమె ప్రమేయం లేనట్లే... నోరు పనిచేయడం ప్రారంభించింది. ఆ పెరుగులో వున్న పిసరు పంటి కిందపడి కమ్మదనం మరింత కమ్మగా తెలిసింది. ఆ గుక్కని మింగేసి...

"అబ్బా! నిజ్జంగా ఎంత కమ్మగా వుందే'' అంటూ మళ్ళీ ఒక గుక్కెడు నోట్లో పోసుకుని తాగి "ఇంక సాల్లే ఇందా..." అంటూ ఇచ్చివేసింది.

ఇంతలో ఒక తట్టను చంకన పెట్టుకొని "ఏమే నా సవతుల్లారా అప్పుడే వచ్చేసినారా?" అంటూ అక్కడికి వచ్చింది మాతంగి.

"మేం ముందు రావడంగాదే... నువ్వే ఆలస్సెంగా వచ్చినావే..."

"సరే సరే... మాతా ఏం తట్ట సంకన పెట్టుకొని పోతుండావ్' అంది త్రిపుర సుందరి.

"మా నాయన బచ్చునకుంట కట్టున ఏదో ఎండు మొక్క ఉండాదని గొడ్డలి తీసుకొని పోయినాడు. ఈ మేరకు పేడులు నరికేసుంటాడు. నేను బొయ్యి యింక తెచ్చుకోవాల" వచ్చిన పని గురించి చెప్పింది మాతంగి.

"నేనూ ఆడికే లేయే... వస్తానుగానీ'' మంగమ్మ తోడు దొరికినందుకు ఆనందిస్తూ అంది.

"సరే... ఇంత చక్కనమ్మవి.. వొంటిగే బోతే నిన్ను ఏ రాజా మొనగాడయినా ఎత్తుకొనిబోతే ఏం చేస్తావ్' ఉడికిస్తూ అంది త్రిపురసుందరి.

"ఆమెను వరించే రాజా మొనగాడు ఎవురోగాదే... శివుడే'' మంగమ్మంది.

ఆ మాటల్తో సిగ్గు మొగ్గయిపోయింది మాతంగి.

"ఆయనన్న మాట అసలు హీరో... ఎంతయినా ప్రాణదాత కదా... మొనుసు సినిమాలో మాదిరిగా పారేసుకునింది మహారాణి'

త్రిపురసుందరి ఎద్దేవా చేస్తూ అంది.

"అబ్బా! పోండె..." అంటూ ఎరుపెక్కిన బుగ్గల్ని రెండు చేతుల్తో కప్పుకుంది.

ఇలా ముగ్గురు చాలాసేపు కబుర్లు ఆడుకున్నారు. వాళ్ల కబుర్లలో సినిమాలు, రాజకీయాలు అన్నీ దొర్లాయి.

అలా కబుర్లాడుకున్న తర్వాత కొంత సేపటికి త్రిపురసుందరి ఇంటినుంచి పిలుపు రావడంతో త్రిపురసుందరి ఇంటికి, మంగమ్మ, మాతంగి బచ్చునకుంటకు బయలుదేరి వెళ్లిపోయారు.

★ ★ ★

ఒకనాటి ఉదయం...

తూర్పున సూర్యుడు మండుతున్న అగ్ని గోళంలా ప్రవేశిస్తున్నాడు. అప్పుడే మేకలోల్లపల్లి పాపయ్య జమిలిగడ్డ వీధిలో అడుగుపెట్టాడు.

అక్కడ బండ్ల మిద్దెలు, గూడ మిద్దెలు, సిమెంట్‌తో కట్టిన మిద్దెలు ముస్తాబైన ఆడపిల్లల్లా కనిపిస్తున్నాయి. వాటిమధ్యలో అక్కడక్కడా కనిపిస్తున్న పూరి గుడిసెలు. ఆ వీధిలో కొందరు ఆడవాళ్లు వీధి చివరగల బోరింగు దగ్గర నిలబడి తమ బిందెల్లోకి నీళ్లు తోడుకుంటున్నారు. మరికొందరు నిండిన బిందెల్ని మోసుకుపోతున్నారు.

ఒక యింటి ముందు కూర్చొని బాలికలు గచ్చకాయలు ఆడుకుంటున్నారు.




వీధిలో కొందరు బాలురు, జిల్లంగోడి, గోళీలు, బొంగరాలు ఆడుతూ కనిపిస్తున్నారు.

రైతుల యిండ్లలో పనిచేస్తున్న జీతగాళ్లు కొరముట్లు ఎత్తుకొని పొలాలకు ఎద్దుల్ని తోలుకొని పోతున్నారు

వారందర్నీ చూసుకుంటూ వెళ్లిన పాపయ్య వరదయ్య యింటి ముందు ఆగాడు.

ఇంతలో హఠాత్తుగా ఆ యింటిలో నుండి ఒక కోడిపుంజు, ఒక చిన్న కోడి పెట్టను తరుముకుంటూ వచ్చి ఆతని కాళ్ల దగ్గర పడి లేచి తిగిరి కో... కో.. అంటూ దాని వెంటపడింది.

ఆ యింటి ముందు గేటుకు ఒక వైపున ఒక ముసలి ఎద్దు నిలబడి వుంది. దాని వీపు మీదున్న గాయాన్ని పొడుచుకు తింటున్న కాకులు నడుస్తున్న రాజకీయాలకు ఉదాహరణలుగా ఉన్నాయి.

గేటు తెరుచుకొని లోపలికి అడుగు పెట్టగానే ఒక పిల్లి ఎలుకను నోట కరుచుకొని యింటి లోపలినుండి పరుగెత్తుకుంటూ వచ్చి పెరట్లోకి వెళ్లిపోయింది.

ఆ యిల్లు ద్వారకలో కృష్ణమందిరంలా, బాగా నునుపు చేయబడి నిలువుగా నిలబెట్టి వున్న పోలీస్ లాటీలాగా నిటారుగా హుందాగా కనిపిస్తోంది.

దాని వరండాలో ఒక ఫేము కుర్చీ, దాని కిరువైపులా రెండు చెక్క బెంచీలు వేయబడి వున్నాయి. సాధారణంగా వరదయ్య కుర్చీలో కూర్చుంటే అతిథులు బెంచీలపైన కూర్చుంటారు.

అక్కడ... అప్పటికే సాంబయ్య, మునిరాజు కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు.

"అరె! పాపయ్య వచ్చేసినాడే.. రా రా పాపయ్య రా కూసో' ఆహ్వానించాడు మునిరాజు.

"ఏవి... సాంబయ్యా ఈ మద్దెన నల్లపూసై పూడిస్తివే' బెంచీపైన కూర్చుంటూ పలకరించాడు పాపయ్య.

"యాడబ్బా తీరుబాటు... రోడ్డు పని సేపిస్తావుండా'' సమాధానంగా అన్నాడు సాంబయ్య.

ఆ గ్రామానికి మకుటం లేని మహారాజు వరదయ్య. ఆ మూడు పల్లెల్లోను అతను చెప్పిందే వేదం. ఆతని మాట అక్కడ శాసనంలా చెలామణి అవుతుంది.

తరతరాల నుండి అనధికారికంగా ఆ ఊరిని పాలించే వంశం వారిది. అక్కడ... తమ ఆధిక్యత కోసం ప్రాణాలైనా యిచ్చే రకం.

ఈమధ్య రాజకీయాల్లో కూడా దిగాలని ఆలోచిస్తున్నాడు. దానికి తగిన పలుకుబడి కూడా వుంది.

ఆ గ్రామంలో అతి పేదవాడి నుంచీ పెద్ద ధనవంతుడి వరకూ తమ అవసరాలకోసం ఆతన్నే ఆశ్రయిస్తుంటారు.

తన పరువు ప్రతిష్ఠలు ఏ ఆవగింజంత తగ్గినా... విధివశాత్తు రాజ్యం పోగొట్టుకుని వీధిలో భిక్షమెత్తుకుంటున్న మహారాజులా బాధ పడిపోతాడు వరదయ్య.

ఇక ఆ గ్రామంలో పెద్ద రైతులుగా వున్న సాంబయ్య, పాపయ్యలాంటివారు ఆతనింట్లో తాగి తందనాలాడుతూ అతని రాజకీయాలకు పునాదులు పరుస్తూ తమ పబ్బం గడుపుకుంటూ వుంటారు.

వారిని కాదని ఎదిరించిన వారిని మూడు చెరువుల నీళ్లు తాపించి, ఆరు చెరువుల్లో స్నానం చేయించి, వేరు సెనక్కాయల్లా వేయించి కాల్చుకు తింటుంటారు.

ఆ గ్రామంలో ఏ చిన్న నిర్ణయం తీసుకోవాలన్నా వీరి ప్రమేయం వుండాల్సిందే.

వాళ్లకు కిరీటాలు లేవుగానీ వరదయ్య రాజుగాను, మునిరాజు, సాంబయ్య, పాపయ్యలు మంత్రుల్లాగాను ప్రవర్తిస్తుంటారు.

చొక్కా గుండీలు వేసుకుంటూ, సిగరెట్టు పొగ వదుల్తూ ఫ్రెష్‌గా వచ్చి పేం కుర్చీలో కూర్చున్నాడు వరదయ్య.

"ఏమబ్బా ముగ్గురూ వగేసారి వచ్చేసినారు. ఎవుడి కొంపంటుకుందేం?" వారితో తొలిపలుకు పలికాడు.

"ఎవుడి కొంపా అంటుకోలేదు కానీ.. నీతో పనుండే వచ్చినా అన్నా!" ప్రారంభించాడు సాంబయ్య.

"నీకు అడ్డమేవుంది సాంబయ్యా! నీకేం గావాలన్నా నే జేస్తాన్లే. ఎన్నున్నా మనం మనం వొగిటేగదా''

ఆఖరి దమ్ములాగి ఆ సిగరెట్టు ముక్కను దూరంగా యింటి ముందర పడేటట్టు వేలితో తోసి నోటిలోని పొగను ముక్కుల గుండా వదుల్తూ పాపయ్య వైపు చూశాడు.

"నా సేను పక్కన సేను మేజారి సిద్దప్పది. రాళ్లు పెరికేసి పతీ సారీ ఎగదున్నేస్తా వుండాడు. అంతేగాకుండా నా మడికి వాని సేనికి మద్దెన రెండెకరాల పొరంబోకి నేలుండాది. దాన్ని పట్టా సేయించాల. నా బాయిలో నీళ్లు దానికీ పారతాయి. అందుకని మడి నాటేసుకుందామని. మొనుప ఈడికొచ్చిండే మండలాఫీసరు మీ వోడేనంట"

దేవుడి ముందు భక్తుడిలా సవినయంగా అన్నాడు పాపయ్య.

"వోడు డబ్బుల్దినే మనిషి... దుడ్డు కరిపించంది ఏం జెయ్యడు పాపయ్యా''

"అట్లే అన్నా నేను కాదన్లేదుగదా!"

"ఓర్నీయమ్మ జిగుడా! నువ్వు కాదంటావని గాదు. సెప్పాలిగదా!"

"అన్నెట్టు... వొగ మాటన్నా?"

"సెప్పు"

"మొన్న మా ఊర్లో సిద్దప్ప గొర్లు సేన్లో పడుంటే పెద్ద పొట్టేల్ని యింటి కాడ కట్టేసుకున్నే. నష్టానికి అయిదొందలు కట్టిస్తేగానీ వదల్నని సెప్పినా... కానీ వోని కొడుకు నారాయడుండాడే వోడు బలవంతంగా అమ్మను, అక్కను... బలే గబ్బు కూతలని బలవంతంగా తోలుకోని పోయినాడు.

వోన్ని ఏం చేయాలన్నా మీ యంత దుడ్డు, మనిషి బలం నాకు లేదు గదన్నా... ఏం జేయాల్నానీ''

తన అక్కసంతా వెళ్లగక్కుకున్నాడు పాపయ్య.

అక్కడున్న వారికంటే ఆర్థికంగాను, ఇతరత్రా కూడా చాల చిన్న రైతు పాపయ్య. అయితే మేకలోల్లపల్లిలో మాత్రం ఆతనికి మించిన వారులేరు. అందుకే వారితో పొత్తు కలిపాడు.

"మనకంటే పేదోళ్లకు, కూటికి లేనోళ్లకు అలుసియ్యరాదు. ఈ యిసయంలో మనమంతా వొకటే..." అన్నాడు సాంబయ్య.

"సత్తెం... బలికినావన్నా..." మెచ్చుకోలుగా అన్నాడు మునిరాజు.

"నేనో పంజెప్తానబ్బా! అట్లజేస్తే బావుణ్ణు!" సాంబయ్య అన్నాడు.

"సెప్పు ఏందో'... సాలోచనగా అన్నాడు వరదయ్య.

"పాపయ్యా! వోడికెన్ని గొర్రెలుండాయి?"

"వొగ నూరు జీవాలుండొచ్చు!"

"మందలో వుండాయా? ఇంటి కాడుండాయా?"

"ఊర్లోనే దొడ్లో'

"సరే గూడెమోళ్లను పిలిపించి వరదయ్య సెప్పినాడని ఆ పొట్టేళ్లను దొంగతనం జేయిస్తే సరీ!"

ఎలాగైనా వరదయ్యను అనేక అక్రమ కార్యాల్లో యిరికించి గ్రామంలో చెడ్డపేరు తెప్పించాలని సాంబయ్య ఎత్తు.

ఎందుకంటే ఈసారి వచ్చే మండల స్థాయి ఎలక్షన్లలో అతనితోనే పోటీ చేయాలన్న ఉద్దేశం ఆతని అంతరంగంలో వుంది.







ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

## డిసెంబర్ 'చతుర' నవల మట్టిబతుకులు

సమీక్షకుని పేరు : ..............................................................

చిరునామా : ..............................................................

..............................................................

..............................................................

..............................................................

దీంతో మేకలోళ్లపల్లె వాళ్లకి వరదయ్యకు విరోధం పెంచవచ్చని ఆతని ఆలోచన.

"అబ్బా నీది బలే బుర్రబ్బా సాంబయ్యన్నా'' మెచ్చుకోలుగా అన్నాడు మునిరాజు.

"ఇది శానా బాగుందన్న..." సిద్ధప్పకు దెబ్బకొట్టే మార్గం దొరికినందుకు సంతోషపడిపోతూ అన్నాడు పాపయ్య.

"ఈ సాంబయ్యగోడు నన్ను దెబ్బ తీయాలని యోచన సెయ్యలేదు గదా'' తనలో తనే అనుకున్నాడు వరదయ్య.

"వోడెమ్మ జిగుడు. వోడేం జేసుకుంటాడు. తుంగా తుసుకా'' అని అనుకొని పైకి వేరొక విధంగా అన్నాడు.

"మన సేతికి మన్నంటికోగూడదు'' సాలోచనగా అన్నాడు వరదయ్య.

"వొగ్గేళవాళ్లు దొరికిపొయ్యి మనమే ఆ దొంగతనం సేయించినట్లుగా సెప్పేస్తే'' అనుమానం వ్యక్తం చేశాడు పాపయ్య.

"అదీ నిజమే... అదొగ సిక్కుంది గదా'' మునిరాజు అన్నాడు.

"ఏం కొంపలు మునగవు. ఆడ పెద్దమ దుసులుగా పొయ్యేది మనమే... ఏదో మల్లిని యెల్లి, యెల్లిని మల్లి జేసి, మసిబూసి మారేడు కాయ సేసెయ్యొచ్చు. ఇట్టాంటివి యెన్ని జేయించలా. వాళ్లంతా మనల్ను పొడసి రాయేందీ?"

గతంలో చేసిన ఘనకార్యాల్ని గుర్తుకు తెచ్చుకుంటూ అన్నాడు సాంబయ్య.

"అంతే గదా మల్లా!" వత్తాసుగా అన్నాడు మునిరాజు.

పాపయ్య లోపల్నే ఆనంద పడిపోతున్నాడు.

"సరే పాపిగా నువ్వు పొయ్యి... కూలిపేట్లో దొంగ తిమ్మణ్ణి, ఉప్పుతోళ్ల రామున్ని మావిటేల ఈడికి పిల్సుకోనిరా, అంతానే జరిపిస్తా'' ముక్తసరిగా చెప్పాడు వరదయ్య.

"అట్లే అన్నా!" ఒప్పేసుకున్నాడు పాపయ్య.

"తునకలు దిని కూడా శానా దినాలై పూడిశ" నాలుక చప్పరించాడు మునిరాజు.

"అవునుగదా'' వత్తాసు పలికాడు సాంబయ్య.

"సరే తునకలు వస్తాయిగానీ, ముందు మందు. మునిరాజు పంపించాలా'' సారా విషయం గుర్తు చేశాడు పాపయ్య.

"తప్పుతుందా అట్టేకానీ''

నవ్వుతూ అన్నాడు మునిరాజు. ఆతని నవ్వుకు అందరూ శ్రుతి కలిపారు.



ఆ రోజు ఉగాది.

చెరువు ముందర పల్లెనుండి రత్తయ్య యింట్లో బంధువులు దిగారు. ప్రతి ఉగాదినాడూ తమ ఇలవేల్పు అయిన మాతమ్మ గుడివద్ద కోడిపుంజును కోయడంవారి ఆచారం. పైగా తన కూతురైన మాతంగికి కులాచారాల నధిగమించి త్వరగా పెళ్లి చేయాలనుకుంటున్నాడు. అందుకే ఆ కోడి పుంజును తీసుకెళ్లి ఆ గుడివద్ద కోసుకు రమ్మని మాతంగిని పురమాయించాడు రత్తయ్య.

ఒక చిన్న కంచు చెంబుతో నీళ్లు, కుంకుమ, పసుపు, కర్పూరం, కొబ్బరికాయ, ముగ్గుపిండి, చురకత్తి అన్నీ ఒక చిన్న వెదురు బుట్టలో పెట్టుకొని వెళ్లి మాతమ్మ విగ్రహం దగ్గర కూర్చుంది మాతంగి.

తనను బావిలో నుండి కాపాడినప్పటి నుంచీ శివదాసునే ప్రేమిస్తోంది మాతంగి. ఆతనంటే తన ప్రాణదాతగా కృతజ్ఞతను పెంచుకుంది. అదే రానురాను ప్రేమగా మారిపోయింది. ఇప్పుడామెకతనంటే ప్రాణం.

శివదాసు కూడా ఆమెనే పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడు.

అయితే ఆ యిద్దరిమధ్య తెగల అంతరం ఇనుప తెరలా అడ్డువుంది.

ఉప్పు తెగకు చెందిన ఆడపడచు మాతంగి. మట్టి తెగకు చెందిన వాడు శివదాసు.

ఈ రెండు తెగల మధ్య ఒకే కులమైనా ఇచ్చిపుచ్చుకోవడాలు లేవు. మట్టి తెగ వాళ్లు ఉప్పు తెగ వాళ్లను నీచంగా చూస్తూంటారు. అదే ఆలోచిస్తూంది అక్కడ కూర్చొని వున్న మాతంగి.

"అసలు మా పెళ్లి జరుగుతుందో లేదో' ఇదే ఆమెను వేధిస్తున్న సంగతి. మాతంగికి పెళ్లి ఒక ముడి వీడని మిస్టరీలా తోస్తోంది.

ఈ విషయం మాట్లాడ్డానికే శివదాసును ఇక్కడ కల్సుకోమన్నది. అయినా అతనింకా రాలేదు.

అసహనంగానే మరొక్కసారి దారివైపు చూసి ఆ తర్వాత మాతమ్మ విగ్రహంవైపు చూసింది.

అక్కడ మూడడుగుల ఎత్తుగల ఓ నల్లని బండ రాతిపైన తలలేని ఒక స్త్రీ శరీరం నగ్నంగా చెక్కబడి వుంది.

ఎత్తైన వక్షోజాలు, సన్నని నడుం, బాగా బలిసిన తొడలు అన్నీ జీవం వుట్టిపడేటట్లు సుమారు మూడున్నర అడుగుల పొడవుతో ఉందా తలలేని విగ్రహం.

అదే తల కూడా వుండివుంటే ఒక నల్లని నగ్న సుందరి సజీవంగా పడుకొని వున్నట్లే అనిపిస్తుంది. దాని మెడవైపున్న ఒక పెద్ద చంద్ర చెట్టు ఆ విగ్రహానికి పందిరిలాగా నీడనిస్తోంది.

ఆ గూడెంలో చాలామందికి అది ఇలవేలుపు. అందుకే జాతర దినాలలో ఆ చెట్టునే పందిరిగా చేసుకుని పూజలు జరుపుతుంటారు. అంతేగాకుండా ప్రతి మంగళవారం అక్కడ పూజలు జరుపుతారు. వచ్చినవారు కూర్చోవడానికి ఆ ప్రదేశంలో దాని చుట్టూ రెండు చిగర చెట్లు, కానగ చెట్లు అక్కడ నీడనిస్తున్నాయి. వాటికింద వున్న రాళ్లపైన కూర్చొని విశ్రాంతి తీసుకుందామా అన్నట్లు ఎంతో చల్లగా వుంటుంది ఆ ప్రదేశం.

చింతాకుల్లాంటి ఆకులతోను, రేగు ముండ్లవంటి చిన్నచిన్న ముండ్లతోను దట్టంగా పెరిగివున్న ఆ చంద్ర చెట్లో, కొమ్మలకు తగులుకొని శిథిలావస్థలో వున్న కోళ్ల తల పుర్రెలు, కొన్ని చిన్నచిన్న ఎముకలు కనిపిస్తున్నాయి.

కోళ్లు కోసిన భక్తులు తమ కోరికలు నెరవేరుతాయో లేదో అని తెలుసుకోవడానికి ఆ చెట్లోకి ఎగురవేసిన కుక్కుట కంకాళాలు అవి.

అసహనంగానే తిరిగి ఆ దారివైపు చూసింది మాతంగి.

అల్లంత దూరంలో వస్తున్న శివదాసును చూసి "ఇప్పటికైనా ఏగొచ్చినాడు'' అని చిరుకోపాన్ని తెచ్చుకుంది.

"అబ్బ ఎంతసేపు సూసేది... కండ్లు కాయలై పోయనే' ఆమెను సమీపించిన అతనితో నిష్టూరాలాడింది.

"ఏంజేసేది పందుల్ని సెర్లోకి యెల్లోలి... వోటి దగ్గర మా సుబ్బరమణిగోన్ని పెట్టేసి వచ్చేసుందికి యింత పొద్దైపూడిశ..."

సంజాయిషీ యిచ్చుకున్నట్లు చెప్పాడు శివదాసు.

"యిద్దో! దీన్నట్ట పట్టుకో' అని పైకిలేచి రెండు కాళ్లు కట్టివేయబడి, చేత పట్టుకొని వున్న కోడి పుంజును ఆతనికిచ్చి వస్తూ దారిలో తెచ్చిన పచ్చిపేడను తీసుకొని ఎడమ చేత్తో నీళ్లు పోసుకుంటూ, కుడిచేత్తో




విగ్రహ పీఠంపైన కాళ్ల దగ్గర జానెడు వ్యాసార్థంతో గుండ్రంగా అలకసాగింది.

"ఏందిదంతా.. బిన్నేకానీ... నాకవతల పనుండేది'' తొందర చేశాడు.

"అయిపోతా వుండ్లే''

"ఏమైపోతావుందో... ఎవుర్రైనా సూస్తే బాగుండదు''

"ఓయబ్బ! భలే బయవబ్బా మొగోనికి.. సూస్నీలె' వారకంటితో అతన్ని చూస్తూ అంది.

"ధైర్యం లేక్కాదే పిల్లా..."

వంగి అలుకుతున్న ఆమె పిరుదులపైన ఒక దెబ్బ కొట్టాడు.

"అబ్బా! బలే పెగ్గి, గొమ్మునుండవా... పనైపోయిందాకా'' గోముగా వంగే అంది.

"సరేకానీ లేబ్బా!"

పక్కనేవున్న రాతిపైన కూర్చొని ఆమె అందాల్ని చూడసాగాడు.

తిరిగి మాతంగి ప్రారంభించింది.

"ఈ దేవతుంది సూడో! ఈయమ్మ మా యిల్లెలప (ఇలవేల్పు) దేవత. ముందెప్పుడో మా తాతముత్తాల కాలంలో మా వంశానికి బిడ్డలు లేకుండా పోతే ఈ యమ్మకాడికొచ్చి మొక్కుకున్నేరంట. అప్పుడు ఒక దినం ఊళ్లో ఎవరికో వళ్లు మీందికొచ్చి (పూనకం) మీ పతి తరంలోను వొగ ఆడ బిడ్డెను నా పేరుతో నిత్తె కన్నెగా వదిలై సంతునిస్తానన్నిందంట. అందుకు సరేనని మా వంశపోళ్ల ప్రతి తరంలోను పెద్దాడబిడ్డెను గానీ లేదా ఎవుర్నో ఒకర్ని ఆయమ్మ పేరుతో వదిలేవోళ్లంట. అట్లా... మా నాయన మేనత్త మొన్నటిదాంకా వుండి సెరువు ముందర పల్లెలో సచ్చిపోయిందంట.

ఈ తరంలో మాత్రం మా నాయన ఆ ఆచారాన్ని యిడిసిపెట్టేయాలని అనుకుంటా వుండాడు. అందునా యిప్పుడెవురు మాత్రం దానికొప్పుకుంటారు సెప్పు"

అలకడం పూర్తిచేసి తట్టలోనుంచీ.... చిప్పలో తెచ్చుకున్న ముగ్గు పిండిని తీసుకొని ముగ్గులేయడానికి ఉపక్రమించింది. మాతంగి.

శివదాసు ఆమె చెప్పిన వృత్తాంతాన్ని విని కొంతసేపు నిర్ఘాంతపోయి అలాగే నిలబడిపోయాడు. 'కొంపదీసి ఈ తరంలో మళ్లీ అట్టాటిది సెయ్యాలంటే పాపం మాతంగో లేకుంటే... వోళ్ళ సెల్లో ఈ అనాశారానికి బలైపోవాల్సిందేనా. ఛూ... దీనెమ్మ! ఏమన్నాగానీ నేను బతికుండంగా ఇంక ఈ ఊర్లో యిట్టాటివి జరగనీయను అంతే, అని మనసులోనే అనుకున్నాడు.

తిరిగి మొదలుపెట్టింది మాతంగి.

'ఈయమ్మ మహెత్తెం శానా సెప్తావుంటారు...'

"ఏం జెప్తారు?" ప్రశ్నించాడు తెలుసుకోవాలన్న కుతూహలంతో.

'ఎవుర్రైనా కోన్ని కోసి మొక్కుకోని దాని తలకాయ ఆ సెట్లోకి ఎగరవేస్తారు. వోళ్ళు మొక్కుకున్న కోరిక నెరవేరేటట్టుంటే... అది అక్కన్నే తగులుకుంటుందంట. లేకుంటే... అది కింద పడిపోతుందంట'

తాను కనుగొన్న సత్యాన్ని ప్రపంచానికి చాటిచెప్తున్న సైంటిస్టులా కళ్ళు పెద్దవి చేసి చెప్పింది మాతంగి.

ఆ చెట్టువైపు చూశాడు శివదాసు. ప్రతి కొమ్మలోను కోడి తల ఎముకలు తగులుకొని వున్నాయి.

"ఓహెూ... ఈ సెట్లో వుండే యముకలన్నీ ఆ మాదిరి ఏసినవేనా! నేను ఇన్ని రోజులూ గమనించనేలేదే''

చెట్లో వున్న కోడి తల ఎముకల్ని చూస్తూ అన్నాడు.

"ఈ గ్రామంలో ఎవురెవురో వచ్చి ఆ మాదిరి ఏసినవే అవి. దీన్ని కోసేసి మనమూ మన పెండ్లి అవుతుందో లేదో అని



మొక్కుకోని పలికించి... ఆ తల సెట్లో ఏస్తాం ఏమంటావ్?"

"అంత మహెత్తెముంటే... నేను మాత్రం కాదంటానా "

"అసలు ఈ యమ్మ ఎట్ల పుట్టిందో నీకు తెలుసునా?"

వంగి ముగ్గులేస్తున్నదల్లా... ఆపి పైకి లేచి అతన్ని ప్రశ్నించింది.

"తెలీదే" ఆమె కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

"నే సెప్తా యినుకో"

మళ్ళీ ముగ్గులేయడంలో మునిగిపోయింది.

"మా యవ్వ బతికున్నప్పుడు సెప్తా వుండింది. ముందెప్పుడో యమదగ్గిని (జమదగ్ని) అనే మునీస్రుడు (ముని) వుండేవోడంట. ఆ సామికి ఆయన పెండ్లాము దినామ్మ... ఏటికి పొయ్యి... సముద్రం వడ్డున యిసకతో కడవ సేసుకోని తన మహెత్తెంతో ఆ కడవతో నీళ్ళు దెచ్చి పూజ సేసేదంట.

"యిట్టుంటే... వోగదినం వోగ యిసిత్తరం జరిగిందంట

"మామూలు పెకారం ఆయమ్మ పెరట్లోకి పొయ్యి తానాలాడతా వుండేటప్పుడు ఎదురుగా రెండు కప్పలు వోగదాని కొకటి ఎక్కోని రతులాడుతా వున్నాయంట. వోట్ని జూసి ఆ యమ్మకు మొనుసు వోగ మాదిరిగా అయిపోయిందంట. అదే మాదిర్తో సవద్రం వడ్డున యిద్దరు ఆలుమగలు దేవతల్లో గంధర్వలో... సరసాలాడుకుంటూ కిందామీదాబడి జలకాలాడతా వుంటే ఆ యమ్మ ఘూసి మొనుసు బెదిరి ఆ మొగోన్ని మోయించిందంట. పతివర్తలు పరాయి మొగోన్ని సూసి కన్ను సెదిరి మొనుసుపడితే ఏమౌతుంది? ఆ పతివర్తతనం అంతా సెడిపోతుంది గదా. అట్ల ఆ యమ్మ సెడిపోయి... ఎంత సేసినా యిసకకుండ కాలేదంట. ఇంక ఉసూరుమంటూ వట్టిసేతుల్తో యింటికి తిరిగొచ్చినప్పుడు అ యమ్మను సూసి మునీస్రుడు యోగదృష్టితో అంతా తెలుసుకోని... ఓరి దీనెబ్బడాలు పరాయి మొగోన్ని నేనుండగానే మోయించింది కదా అనుకోని తన నూరు మంది కొడుకుల్ని కలిసి ఆ యమ్మను నరికేయమన్నాడంట.

అప్పుడు వోల్లెవురూ తల్లిని నరికేసేదానికి వప్పుకోకపోతే సిన్నోడు పరుశురాముడు మాత్రం తండ్రిమాట ప్రకారం ఆ యమ్మ తల నరికేసినాడంట. అప్పుడేమో తల బొయ్యి మాలపల్లెలోబడి రేణుకమ్మయిందంట. మొండెమేమొ మన గూడెంలోబడి మాతమ్మ అయిందంట. అప్పుడ్నుంచీ ఆ మొండెమే మన జాతి దేవతైపోయి నిలిసిందంట. మన కోరికలు తీరస్తావుందంట. సల్లని తల్లి"

కథతోబాటు ముగ్గువేయడమూ ముగించి, ఒక చిన్న కంచు తట్టను అలికిన ప్రదేశంలోపెట్టి అందులో పూజా ద్రవ్యాలుంచింది.

ఆమె చెప్పింది ఆశ్చర్యంగా విన్న శివదాసు, 'అమాయకంగా కనిపించే మాతంగి బుర్రలో ఎన్ని కథలు దాగుండాయో'నను కుంటూ ఆమె ముఖంలోకి చూశాడు.

ఆ చూపులకు సిగ్గుతో వారకళ్ళతో ఆతన్నే చూస్తూ ఆతను చేయవలసిన పనిని చెప్పింది.

"నేను కర్పూరం ముట్టిచ్చి మొక్కుతా. నువ్వు టెంకాయ కొట్టి కోన్ని కొయ్యి"

కంచు తట్టతో వున్న ఆకు, వక్కా, పూలు తీసుకెళ్ళి మాతమ్మ విగ్రహం కటి ప్రదేశంలో పెట్టింది. ఆ తర్వాత దాన్ని కళ్ళకద్దుకోని తట్టలోని కర్పూరం వెలిగించి కళ్ళు మూసుకొని భక్తితో చేతులు ముకుళించి నిలబడి మొక్కుకుంది.

"యింకేం స్వామీ! నువ్వు టెంకాయ కొట్టు"





అంతవరకూ తననే చూస్తున్న ఆతని చేతిలోని కోడిపుంజును తన చేతిలోకి తీసుకుంది.

వెంటనే శివదాసు గంపలోని కొబ్బరికాయను తీసుకొని వెలుగుతున్న కర్పూరంనుండి వస్తున్న పొగలో అటుఇటు తిప్పి, దాన్ని మాతమ్మ విగ్రహ పీఠం అంచుకేసి కొట్టి రెండొప్పలుగా చేశాడు.

కింది చిప్పకున్న జుట్టు పీకి ఆ రెండు వప్పుల్ని పక్కన పెట్టి చెంబులో నీళ్ళు కొద్దిగా అటుఇటు పోసి తానూ ఆ దేవికి మొక్కుకున్నాడు.

ఆ తర్వాత గంపలోని చురకత్తిని తీసి అతని చేతికిచ్చింది.

మాతంగి కోడిపుంజు కాళ్ళను కుడిచేతితో ఎడమ చేతితో దాని రెక్కలు పెడవిరచి... పట్టుకోగా శివదాసు తన ఎడమ చేతితో దాని తలను లాగి పట్టుకొని దాని కంఠంపై ఉన్న ఈకల్ని పీకి, ఆచోట కుడిచేతిలోని కత్తితో దాని గొంతుకోసి తలను వేరుచేసేశాడు. మాతంగి మొండాన్ని దూరంగా విసరివేయగా అది విలవిలలాడుతూ ఎగిరి పడుతోంది.

కోసిన తలను శివదాసు అలికినచోట పెట్టి, దానిపైన ఎడమచేతితో చెంబులోని నీళ్ళను కుడిచేతి వ్రేళ్ళమీదుగా పోస్తూ సామి తల్లీ... మాతమ్మ తల్లీ... సాలూమూలాసల్ల గుండాల... మా యిద్దరికీ పెండ్లి గావాల. పిల్లాజల్లా పుట్టి మా సంతు వెయ్యి సంతు గావాలి. అట్లుంటేనే పలుకు తల్లీ పలుకు... పలుకు... పలుకూ అని ఒక ఎత్తుగడలో అంటూ పలికిస్తున్నాడు.

ప్రాణంపోయేటప్పుడు ఆ తల మూతి కదిలిస్తే అది తమ కోరిక నెరవేరుస్తున్నట్టే. దేవత కరుణించినట్టేనని జనపదులు నమ్ముతారు. అదే చేస్తున్నాడు శివదాసు.

ఎంత పలికించినా అది పలుకలేదు. అప్పటికే అది చచ్చి ఊరుకుంది. దాంతో వారి హృదయాలలో తమ కోరిక నెరవేరదన్నట్లు భయం చోటుచేసుకుంది.

మాతంగి వెంటనే ఆ కోడి తలను చేతుల్లోకి తీసుకొని భక్తితో కళ్ళకద్దుకుంది.

"అమ్మ తల్లీ... సామి తల్లీ... మేం వొకర్నొకరం మొనుసు పడినాం... అట్టే మా యిద్దరికీ మనువు జరిగేట్టు సూడు తల్లీ. మమ్మల కరుణించు. నీ బిడ్డలం. నీ దొక్కన పెట్టుకోని కాపాడుకో. మా కోరిక నెరవేరేటట్లుంటే ఈ పెసాదాన్ని నీ చెట్లోనే పెట్టుకో. నీ సత్తెం సూపించు తల్లీ..." అని ఆ తలను చంద్రచెట్టులోకి ఎగురవేసింది.

ఆ చెట్టుకు చిన్నచిన్న ముండ్లు ఉండడంతోను కొమ్మలు దట్టంగా వుండడంతోను, అది రెండుకొమ్మల్ని తప్పించుకొని వచ్చి మధ్యలో అలాగే తగులుకుంది.

అంత మాత్రానికే వారిద్దరి ముఖాలు సంతోషంతో వెలిగిపోయి ఒకర్నొకరు పట్టుకొని కౌగలించుకున్నారు.

"అమ్మ కరుణించింది. యింగేం భయంలేదు. మన పంట పండింది. మనం కోరుకున్న కొండమీద వాన గురిసినట్లే''

సంతోషంతో అతన్ని తీవెలా పెనవేసుకుపోయింది మాతంగి.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలవేళ! పిల్లాజల్లా రచ్చబండ దగ్గర చేరిపోయారు. ఆ గుడానికి పిన పెద్ద నాగన్న ఉప్పుతోళ్ళ రాముడు, రత్తయ్యా మొదలైన పెద్దలంతా రచ్చబండ పైన కూర్చొని వున్నారు. మిగిలిన వారు కింద కూర్చొని వున్నారు. వెంకటస్వామి, వరదయ్య జీతగాడు మునెప్పలాంటివారు కూర్చున్నారు.

పెద్ద బోయసాని కూడా ఆహ్వానింపబడింది.

"ఇంగేమబ్బా! అందరూ వచ్చేసినారా''

"ఆ వచ్చేసినారు. వోగ శివదాసుగోడు

మాత్రం రావల్ల'' అని అక్కడ చేరినవారు చర్చించుకుంటున్న వేళ అక్కడికి చేరుకున్న శివదాసు

"నేనుగూడా వచ్చేసినాన్లే అన్నా'' అన్నాడు.

'ఇంగ సెప్పండబ్బా'' గంగన్న అన్నాడు.

చివర రెడ్డన్న కిష్టుడు మరికొందరు యువకులు శివదాసు పక్కనే నిలబడి వున్నారు.

"ఏవీ లేదబ్బా! మా వూరికి ఎన్నో ఏండ్ల నుంచీ పెద్ద దిక్కుగా వుండే వరదయ్య రేపు మిద్దెత్తాలంట. యింటికి వొగ మడిసి తెల్లారి పొద్దు పుట్టకముందే రావాల... బండలెత్తేది అయిపోయినాక ఆన్నే అందరికీ యిందు పెడతారు''

ముద్దాయికి విధించే శిక్షను చదివే జడ్జిలా చెప్పాడు నాగన్న.

"మొగాలు కూడా కడుక్కోవద్దులే... బండలు పట్నాకా ఆణ్ణే కడుక్కోవచ్చు..." చెప్పాడు రత్తయ్య.

"దీనికెవురికైనా ఆచ్చాపన (ఆక్షేపణ) వుంటే యిప్పుడే సెప్పండి'' అధికారికంగా అన్నాడు మునెప్ప.

"ఆ... అది గూడా సెప్పండబ్బా'' దొంగ తిమ్మడన్నాడు.

"రేపు మేకలోల్లపల్లెలో మడి గొయ్యను మాటసెప్పినా మావా నేనెల్లొచ్చేది... మాట బోతావుండ్లా'' తనకున్న యిబ్బంది చెప్పాడు వెంకటస్వామి.

"వరే యంగటా. మన బాధలు యెయ్యుండనీ, పొయ్యి తీరాల గదా! వోళ్ళు పెద్దోళ్ళు... మనం పేదోళ్ళం... కూలీ నాలీ చేసి బదికేటోళ్ళం. ఈ దినం పోలేదంటే మారాజులు కూలికి రానియ్యరు. పన్లు సెప్పరు. అప్పుడు తిండికి లేకుండా పస్తులుండి ఎండగాలేది మనమే''

ఉన్న బాధను విప్పి చెప్పాడు రత్తయ్య.

"అట్ల బాగా సెప్పు మావా?" మెచ్చుకోలుగా అన్నాడు మునెప్ప. బండ్లమిద్దె సిమెంట్ మౌల్డింగ్‌తో కట్టిన మిద్దెలకంటే గట్టి నిర్మాణం.

ఈ మిద్దెకు కూసాలపైన బండల్ని ఎత్తిపెట్టడం చాలా కష్టం. అది ఒకరిద్దరితో అయ్యే పనికాదు. చాలామంది అవసరం. పైగా ప్రమాదంతో కూడుకున్నది. ఎత్తేటప్పుడు బండ విరిగినా, జారిపోయినా, కాళ్ళు చేతులు, నడుము లాంటివి విరగడమే గాకుండా ఒక్కొక్కసారి ప్రాణాలు కూడా పోవచ్చు.

అందుకే శివదాసు అన్నాడు.

"రత్తయ్య మావా! నువ్వేమొ రమ్మని సెప్పుతా వుండావు. వోళ్ళే దో యిందు పెడతారనీ అందరూ శానా కుశాలగా మునాసగా వుండారు.

"మనం సేసే పని వోళ్ళు కూలీల్ని పెట్టుకోని సేసుకుంటే కనీసం వెయ్యి అయినా అవుతుంది. కానీ వోళ్ళు మనకు మాత్రంవొగ శౌరు పనికి రాని నూకలు వుడకేసి ఆ గంజి నీళ్ళల్లో అంత బెల్లం కొట్టి పరమాన్నం సేసి యిందు పేరుతో దాన్ని మనకు పోస్తే... గతిలేని మనం దాన్నే... మహాబాగ్గెంగా లొట్టలేసి తాగేసి వచ్చేస్తాం. యింకా మాట్లాడితే వొగ్గలాసు సారాయి తలాకొంచెం పోస్తే... దాన్నే అమృతం మాదిరి తాగేసి తూగుతా వచ్చేస్తాం. ఇట్ల ఎన్నోసార్లు జరిగింది. వోగసారి మీరూ యోచన చేయండి''

వరదయ్య చేస్తున్న దోపిడీని వివరించాడు శివదాసు.

అదివిన్న అందరూ క్షణం మౌనంగా వుండిపోయారు.

"వొరేబ్బా! అట్టానొద్దు ముందుట్నుంచీ పెద్దోళ్ళు రైతులు ఏది చెప్పినా ఊరకే సేస్తా వస్తానే వుండాం. యింక యిన్ని మాట్లాడి కాదంటే బతకలేం. సన్నాబన్నోళ్ళం. వోళ్ళతో పెట్టుకుంటే సెడిపోతాం"

తన యాభై ఏళ్ళ జీవితాన్ని నెమరువేసు





కుంటా చెప్పాడు నాగన్న.

"అంటే మన కష్టాల్ని ఎర్ర నయాపైసా పెట్టకుండా వోళ్ళు సొమ్ము జేసుకోవాల. మనం మాత్రం వట్టి సేతుల్తో యింటికొచ్చి యింక ఆ రోజుకు కూలీ లేకుండా పస్తు లుండాలి. అంతే 'గదా మీరు సెప్పేది'' ఆవేశాన్ని అణుచుకుంటూ అన్నాడు శివదాసు.

"వారే శివుడూ... మేవూ , వొకప్పుడట్టా అన్నోళ్ళమే. వోళ్ళు సెప్పినట్టు సేయకుంటే మనల్ని బతకనియ్యరు'' అన్నాడు నాగన్న.

"వోళ్ళేంది మనల్ని బతకనిచ్చేది. శివుడ నిందాంట్లో నిజముండాది'' శివదాసును సమర్థిస్తూ అన్నాడు రెడ్డన్న.

"సూడు పెద్దయ్యా! మీరు కావాల్సుంటే పోండి. నేను మాత్రం రాను'' తెగేసి చెప్పేశాడు శివదాసు.

ఎలాగైనా ఇలాంటి వెట్టిచాకిరీని చేయకుండా గూడెం వాళ్ళని ఆపాలని అతని ప్రయత్నం.

"ఓర్నాయనో ఈ పిల్ల పిల్లోల్లంతా జేరి మన పేటకేదో ఊనం తెచ్చేటట్టుగా వుండార్రో నాయనో ఇంటికో మడిసిని తీసకవస్తానని ఆయనకిచ్చిన మాటేంగావాల్రా సామీ''

తానిచ్చినమాట ఎక్కడ తప్పిపోతుందో నన్న భయంతో అన్నాడు రత్తయ్య.

"సూద్రా అబ్బోడా శివుడా! మనం ఎంత కాదన్నే వోళ్ళ కాళ్ళకాడికి పోవాల్సినోళ్ళం. నలుగురితోబాటు నారాయణ" అని తిమ్మడన్నాడు.

"వోడికి వాళ్ళంతా పొగురుబట్టి, కండ్లు నెత్తికెక్కి అట్టాంటా వుండాడు. మా పెద్దాయన తల్సుకుంటే మన ఊర్నే నాశనం సేసేస్తాడు. ఆం" ఆవేశంగా అన్నాడు వరదయ్య యింట్లో పాలేరుగా వున్న మునెప్ప.

"ఏందిరా ముండనాకొడకా బాగాలేంది? రాళ్ళు కొట్టేది మనం. గోడలు కట్టేది మనం. మిద్దెలకాన్నుంచీ పందుల గుడిసే దాకా అన్నీ మనమే కట్టాల. అయినా మన కుండేది మాత్రం ఈ గుడిసెలే. పోనీ మన కష్టం మనంబడి మంచి కొంపలైనా కట్టుకోని మంచి గుడ్డా గుసురూ, మంచి తిండీ తీర్థం ఏమైనా అమర్చుకుందామంటే ఎల్లకాలమూ ఆ రైతులకు ఊడిగెం సెయ్యనే సరిపాయ. అది సాలక వోళ్ళ యిండ్లల్లో మనోళ్ళు ఎందరు ఎట్టి సాకిరి పన్లు జేయడంలే.

ఇట్లెన్ని దినాలని బతుకుతాం. మనమూ మారదాం. మన కష్టానికి తగిన ఫలితమడుగుదాం. నేం జెప్పేది మనందరి కోసరమే గానీ, నావొక్కడి కోసరంగాదు''

కుండ బద్దలు కొట్టినట్లు చెప్పాడు శివదాసు.

'అవును! శివన్న సెప్పింది నిజమే... ఆ మాదిరి సేస్తేనే మన జాతికి మంచిదినాలు''

అంతవరకూ మౌనంగా వున్న కిష్టుడన్నాడు. "ఇంక నుంచీ మేము యిట్లా వెట్టి పనులు సెయ్యం'

నిక్కచ్చిగా చెప్పేసి శివుని భుజంపైన చేయి చరిచాడు రెడ్డన్న. కిష్టుడు, రెడ్డన్న తనను సమర్థించడంతో శివదాసుకు ఇంకొంచెం ధైర్యమొచ్చింది.

"మీ పెద్దోళ్ళు మీరు ఎట్లన్నా పోండి. కానీ మా పిలకాయలమంతా యిట్టా పన్లకు పోము. ఎవురో పొడిసేస్తారనీ, కుమ్మేస్తారనీ... భయానికో మొగమాటానికో పొయ్యి మేం పస్తులుండి యింట్లోవోళ్ళు పస్తులుంటే సూళ్ళేం. ఇంక నుంచీ మమ్మల్ని అట్టా పన్లకు పిలవద్దు. వరే రంర్రా పోదాం" .

అని ఆవేశంగా అక్కడినుండి పోతున్న శివదాసును రెడ్డన్న, కిష్టుడు, మరికొందరు యువకులు అనుసరించారు. ఈ సంఘటనకు కొందరు పెద్దలు లోలోపల సంతోషించినా వరదయ్యకు ఈ సంగతి తెలిస్తే ఏం రాద్ధాంతం చేస్తోడోనన్న భయం వ్యక్తం చేసారు.

మునెప్పకు కోపం కట్టలు తెంచుకొని



వచ్చినా ఏమీ చేయలేక మౌనంగా ఉండిపోయాడు.

"సరే వోళ్ళపాటికి వోళ్ళను వొదిలేయండి. ఆడ యాడన్నా పోనీ' ఇప్పుడు జరిగేపని సూడండి'' అంతవరకూ మౌనంగా వున్న రంగసాని అంది.

"అదెట్లా ఇంత మందుండంగా పంచాదాలోనుంచీ లేసిపోయింది గాక యింకా కొందర్ని లేపుకొని పొయ్యినాడే... అది తప్పు కదా!"

ఏదో దండన చేయాలన్న తలంపుతో అన్నాడు మునెప్ప దాంతో...

"ఉన్నింది మాట్లాడితే తప్పా?" అన్నారు కొందరు.

"పెద్దమదుసులు మాట్లాడతావుంటే పెద్దంతరం సిన్నంతరం లేకుండా వొగ పిల్లకాకి అట్టసెయ్యడం తప్పు కాదా?" అని మరికొందరన్నారు.

అలా కొంతసేపు అక్కడ రభస జరిగింది. కొందరు వాళ్ళను సమర్థిస్తే మరి కొందరు వ్యతిరేకించారు.

అయినా చాలామంది అనుకున్న ప్రకారం వరదయ్యకు మిద్దెత్తడానికి వెళ్ళేందుకే నిర్ణయించుకున్నారు.

★ ★ ★

అది బీళ్ళ కాలం.

మళ్లలో, చేలల్లో ఎలుకలు బొరియలు చేసుకుని వాటిలో వేరుశనక్కాయలు, వరిధాన్యాలు వంటివి సేకరించి వుంచుకొని, వాటిని తిని బాగా బలిసివుంటాయి.

మడిగెనాలలో వుండే ఎలుకలైతే వరి పంటను నాశనం చేస్తాయి. కాబట్టి రైతులు గూడెం వాళ్ళను పిలిపించి వాటిని పట్టించేస్తారు. ప్రతిఫలంగా వడ్లు, మిరపకాయలు, చింతపండు వంటివి యిస్తుంటారు.

మట్టితో చేసిన ఒక చట్టి అడుగుభాగాన చిన్న రంధ్రంచేసి, అందులో ఎండిన పిడకలు, చిన్న చిన్న కట్టెపుల్లలు వేసి ఊదరపెట్టి ఎలుకల్ని పట్టడంలో మంచి నేర్పరిలు గూడెంవాళ్లు.

ఆ ఊదర చట్టిని బొరియలకు బోర్లించి, ఊదగొట్టి, పొగూది బొరియల్ని తవ్వి పట్టిన ఎలుకల్ని వండుకుతింటారు.

ఆరోజు అందరూ వరదయ్య మిద్దెపనికి పోయారు. శివదాసు, కిష్టుడు, రెడ్డన్న వంటి కొందరు యువకులు పనిలేకపోవడంతో ఏమీ తోచక ఎలకల వేటకు బయలుదేరారు.

శివదాసు, కిష్టుడు నలుగురు పిల్లకాయల్ని వెంటబెట్టుకొని బచ్చనకుంట కవతల వున్న బీడుచేలల్లోకి బయలుదేరారు.

శివదాసు ఎలుకల అడుగుజాడల్ని చూసుకుంటూ చేలల్లోని ఎలుకల బొరియల్ని గుర్తుపడుతున్నాడు.

భుజాన వేసుకున్న సలకపారతో కిష్టుడు ఎలుకల బొరియల్ని తవ్వుతూ ఆ సమయంలో బయటపడిన ఎలుకల్ని పార తిరగేసి కొట్టిచంపి, పిల్లకాయలకిస్తుంటే, వారు వాటిని తమ చేతిసంచుల్లో వేసుకుంటున్నారు.

ఇద్దరు కుర్రాళ్లు రెండు పొడవాటి సన్నని కర్రల్ని పట్టుకొని బయటపడి తప్పించుకుపోయే ఎలుకల్ని తరిమికొట్టి చంపుతున్నారు. వారికి గోచీలు మాత్రమే వున్నాయి.

ఒక కుర్రాడు చంపిన ఎలుకల్ని సంచిలో వేసుకొని మోస్తూ... మరొకడు ఊదరచట్టి మోస్తూ వారి వెంటనే వున్నారు.

శివదాసు చేతిరుమాలు తలకు చుట్టుకొని మంచి లావుపాటి చింతబరికె చేతబట్టుకొని వున్నాడు.

కిష్టుడు వంగి బొరియల్ని ఉత్సాహంగా తవ్వుతుంటే, బయటపడిన ఎలుకలు దిక్కుతోచక నేలపైన పరుగెత్తుతున్నాయి.

శివదాసు వాటి వెంటబడి చంపి కుర్రాళ్ళ చేతికిస్తున్నాడు.

ఒకచోట లక్షాగృహంనుండి సొరంగం.





తవ్వుతున్న భీమునిలా... ఒక బొరియను తవ్వుతున్నాడు కిష్టుడు.

ఉన్నట్టుండి మూడు నాలుగు ఎలుకలు బయటకు వచ్చి ప్రాణభయంతో అతని కాళ్ల కింద దూరాయి.

ఒకదాన్ని అప్పటికప్పుడే పారతోనే కొట్టే శాడు కిష్టుడు. మిగిలినవి చేనుమీద పారిపో తున్నాయి.

కాచుకుని వున్న ఇద్దరు కుర్రాళ్లు వాటిని తిట్టుకుంటూ ఒక దానివెంట ఒకవైపుకు పరుగెత్తారు.

మరొక వైపుకు పారిపోతున్న రెండు ఎలు కల వెంట పరుగెత్తాడు శివదాసు.

అవి బీడునేలలో అతని దెబ్బల్ని తప్పించుకుంటూ పరుగెత్తుతున్నాయి.

ఎట్టకేలకు ఒకదాన్ని చంపి చేతబట్టుకొని ఇంకొక దాని వెంట అలాగే పరుగెత్తుతూ శత్రువుని తరుముకొని వెళుతున్న సైనికుడి లా దాన్ని వెంబడిస్తున్నాడు.

ఇంతలో ఒక పెద్ద కానగ చెట్ల గుంపులో దూరి ఆ ఎలుక కనిపించకుండాపోయింది.

'వరే! ఇంత ఆయాసపడీ వస్తే ఇందులో కొచ్చి తప్పించుకున్నే...' అనుకుంటూ ఆ చెట్ల మధ్యలో వెతుకున్నాడు.

అక్కడ చాలా చెట్లు గుబురుగా వున్నాయి. అక్కడి చెట్ల మొదళ్లను, రాతిని, పుట్టను, పొదను అతని కళ్లు తీక్షణంగా వెదుకుతున్నాయి.

ఉన్నట్టుండి అతని దృష్టి ఒకచోట ఆగిపో యింది. అక్కడ ఒక స్త్రీ కూర్చుని ఏడు స్తోంది.

ఆమె చుట్టూ గుబురుగా కానగచెట్ల కొ మ్మలు అడ్డుగా ఉండడంతో బయటి ప్రపంచా నికామె కనిపించడంలేదు.

సామాన్యంగా అక్కడికెవరూ రారు కూడా ను. అలా వచ్చే ప్రదేశం కూడా కాదది.

అలాంటి ఆ ప్రదేశంలో ఆ సమయంలో ఆమె ఎందుకేడుస్తోందో శివదాసుకర్థం కాలే దు.

శబ్దం చేయకుండా కొమ్మల్ని పక్కకు తప్పించి ఎవరా? అని చూశాడు. లంకలో అశోకవృక్షం కింద రామ విరహంతో... రాక్ష సపీడలో శోకిస్తున్న అలనాటి జానకిలా... ఒక రాతిపైన కూర్చుని వుంది నాగమ్మ.

ఆ పక్కనే ఎదురుగా ఒక రాతిపైన కూర్చొని ఆమెను ఓదార్చుతున్నాడు రెడ్డ న్న.

క్షణంసేపు శివదాసు ఆశ్చర్యపోయాడు.

'వీళ్ళిక్కడెందుకున్నారబ్బా' అనుకున్నా డు మనసులోనే. చెవులు రిక్కించి వారేం మాట్లాడుకుంటున్నారో వినసాగాడు.

"నా బతుకు బండల్జేసినాడు ఆ ముండనా బట్ట"

"నువ్వేం దిగులు పడొద్దమ్మీ... నేనుండా గదా. ఆ నాకొడుకును ఒకే దెబ్బకు పందినే సినట్టు యేసేస్తా." ఆవేశంగా అన్నాడు రెడ్డ న్న.

"అదుండే లంజ రంగసాని దాంతో సె ప్పినాడంట. మాంవా... నీళ్లకు బాయికి పోయినప్పుడు నన్ను సూసినాడంట. ఎట్లో ఒగట్ల నాకు పొందెయ్యాల అన్నాడంట. నాకేం తెలుసు? ఆ దొంగ నా సవితిట్ల సేస్తుందని.

"అమ్మణ్ణి నీళ్ళబాయి దెగ్గిర టమాటాల తట్ట ఎత్తుకోని రావాల తోడురా... అని సందేలబ్బుడు అడిగితే నిజంవేగదాని ఎని కింటికి పొయ్యినా. ఆడికి పోయినాక ఆ సెడ్లో లైటేసి లోపలుంటే తట్ట ఎత్తుకోన్రా. నాకు నడుమొంగదు. బయటుంటాను అనింది. సెడ్లోకి పొయ్యి లైటేసినా... అంతే మావా..." అంటూ దుఃఖంతో ఆమె గొంతు పూడుకుపో యింది.

దాంతో కరిగిపోయిన రెడ్డన్న ఆమె భు జంపైన చేయివేసి తడుతూ "ఏడొద్దమ్మీ

వోనికి తగిన శాస్తి నేcజేస్తా... ఊరికే వుండు'' అంటూ ఓదార్చాడు.

ఆమె కాస్త తేరుకుని "ఇంక నన్నెవరు సేసుకుంటారు మాcవా?" అంది.

అతని ఎదపైన తలవాల్చి ఈసారి గట్టిగానే ఏడ్చేసింది. పరిస్థితి ఏమిటో అర్థమైపోయింది శివదాసుకు.

"నాగీ! యాడొద్దు. నువ్వేడిస్తే నాకు దుక్కమొస్తాది. వోడు నిన్ను సెరిపేసినా నేను నిన్ను జేకుంటానమ్మీ. మలినమనేది ఈ వళ్లుకేగానీ మొనుసుక్కాదు. అది బాయిలో బురద మాదిరి కడిగేసుకుంటే పోతాది. అయినా ఇందులో నీ తప్పేముంది. నీ బతుకు నాశనం సేసిన ఆ నా కొడుకును'' రెచ్చిపోతూ ఊగిపోతున్న రెడ్డన్నను మధ్యలోనే ఆపింది. "అయ్యో వద్దు మాcవా వోడు బలమంతుడు. సావుకోరు. వోన్తో మనం తగల్లేము. నేనేమైనా పరవాలేదు. నువ్వేనా సుఖంగా వుంటే నాకంతే సాలు మాcవా... వోడి జోలికి పోవద్దు'' అతన్ని గట్టిగా పట్టుకొని వెక్కివెక్కి ఏడ్చింది.

"నాగీ!" నొప్పిగా అన్నాడు రెడ్డన్న.

"అవును మాcవా! వోళ్లు ఎంత పనైనా చేస్తారు. దుర్మార్గులు''

"నాగీ! నువ్వూరికే భయపడతావుండావు గానీ, మనం తాడూ బొంగరం లేనోళ్లం. మనం తిరగబడితే వోళ్లు మనల్నేమీ జేసుకోలేరు. మనకేముండాది. పూరిగుడిసి తప్ప. ఎల్లికల పడుకుంటే బొడ్డు... బోర్ల పడుకుంటే ముడ్డీ... ఇంక మనకు పోయేదేముండాది. విగ బానిసి బతుకు తప్ప''

కసిగా ఎరుపెక్కిన కళ్లతో అన్నాడు రెడ్డన్న "వద్దు మాcవా నా మాటిను. నీకేమైనా అయితే నే సచ్చిపోతా... వోన్జోలికి పోనని నాకు మాటియ్యి మాcవా..."

గుండెలో పొడిచినట్టు చేయిసాచి అడిగింది. "సరే! ఏది ఏమైనా నిన్ను పెద్దోళ్లు వప్పుకున్నా, వప్పుకోకపోయినా దెగ్గరిలోనే పెండ్లి చేసుకుంటా''

ఆమె చేతిలో చెయ్యేసి... ఆమె కళ్లనీళ్లు తుడిచి ప్రేమగా కౌగిట్లోకి తీసుకున్నాడు.

రెడ్డన్న మంచితనానికీ, ఔదార్యానికీ మనసులోనే జోహార్లు అర్పించాడు శివదాసు.

★ ★ ★

మాతంగి గుడిసె వెనక పెరట్లో బోకులు తోముకుంటోంది.

"అమ్మా! తల్లీ! మాతంగీ'' అన్న పిలుపు విని అలాగే వెనక్కి తలతిప్పి చూసింది.

గుడిసెముందర మేజారి సిద్దప్ప నిలబడి వున్నాడు.

"ఎప్పుడూ ఇలా రానివాడు ఇప్పుడెందు కొచ్చాడబ్బా'' అనుకుంటూ.

"ఏమన్నా?" అంది.

"మా మంగమ్మ నేమన్నా చూస్తివా తల్లీ'' ప్రశ్నించాడతను.

అతని ముఖంలో దిగులు, ఆందోళన, అలసట స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"రాలేదన్నా... ఏం... ఎక్కడబోయిందీ?"

తోముతున్న బోకిని అలాగే వదిలేసి పైకి లేచి ఆత్రంగా అడిగింది.

"నిన్న బచ్చనకుంట్లో... గొర్రెలు తోలుకోనుంటి. మావిటేల గొర్రెపిల్లను దెచ్చి సెంబు నిండా పాలు పిండుకోనిపోయింది. తిరిగి ఇంటికి రాలా. ఏమైందో తెలీదమ్మా! నువ్వు నేస్తురాలివిగదా. నీకేమైనా తెలుసునేమోనని వస్తిని."

ఆ మాట విన్న మాతంగి ఒక్కక్షణం అలాగే బొమ్మలా నిలబడిపోయి చివరికి.

"ఈడికి రాలేదన్నా. సుందరోళ్ళింట్లో అడిగితివా?" అని ప్రశ్నించింది.

"వోళ్లింటికి పోదమ్మా... అయినా అడిగినా ఆడికీ రాలేదంట. ఏమైపోయిందో బిడ్డ''

కళ్లనీళ్లు వత్తుకుంటూ తిరిగి వెళ్ళిపోయా




డు సిద్ధయ్య.

ఆరోజు మధ్యాహ్నం వేళకు మంగమ్మ ఆ ఊరి వెనకనున్న ఇట్లమోళ్ళ బాయిలో పడి చనిపోయిందన్న వార్త... దావానలంలా వ్యాపించింది.

గ్రామగ్రామమంతా క్షణాల్లో అక్కడికి చేరిపోయింది.

అందరితోబాటు మాతంగీ అక్కడికి చేరుకుంది. అప్పటికే శవాన్ని బావిగట్టున పెట్టారు.

ఆమె జాకెట్టు, లంగా అక్కడక్కడ చిరుగులు పడి ఉన్నాయి. చేతులు, కాళ్లు దోక్కుపోయివున్నాయి. బావిపక్కనే పాలచెంబు కూడా వుంది.

"ఎవురో సెరిపేసి, చంపేసి బాయిలో యేసేసినట్టుంది''

"ఆడపిల్లోళ్లను కంటే వోళ్లను వొగఅయ్య సేతిలో పెట్టేదాకా ఇంతే... ఏదో వోగబాధ"

"వోగరి జోలికి పోయ్యే బిడ్డకాదు... శానా మంచిది. పాపం గంగపాలైపాయె. ఏం జేత్తాం. రుణం ఆడికి తీరిపాయె''

"ఎన్నిదినాలు సాకితే అంత మాత్రం బిడ్డయ్యేది. నారూ నీరూ పోసినోల్లకు ఎంత యాతనో''

ఇలా తలో రకంగా అనుకోసాగారు. ఇంతలో త్రిపురసుందరి వచ్చి ఆ దృశ్యాన్ని చూసి కళ్ళనీళ్లు పెట్టుకుంది.

మరికాసేపటికి వరదయ్య, మునిరాజు కూడా హడావిడిగా వచ్చారు.

వాళ్ళను చూస్తూనే ఏడుస్తూ నేలక్కరుచుకుపోయాడు సిద్ధయ్య.

"అమ్మా! మంగమ్మా... ఎంత పని జేసివావే... నీకేదయినా బాధుంటే మాలో ఎవ్వరికో వొగరికి సెప్పిఉంటే తీర్చుదుంగదా. మీ నాయన సూడు. అమాయకుడు. నోరు లేనోడు. నేలగరుచుకపోయినాడు'' అంటూ కన్నీళ్లు పెట్టుకున్నాడు వరదయ్య.

"సిద్ధా! లే... లే... యాడొద్దు. నీ రుణం అంతవరకే'' ఓదార్చుతూ అన్నాడు మునిరాజు

"ఎంతసేపని బాయిగడ్డనే పీనిగిని పెట్టుకుంటార్రా. ఎత్తండి... పొద్దుపోతండ్లా... ఆ యమ్మను ముందు ఇంటికి చేర్చండి''

ఆ గుంపులోనుంచి ఓ ముసలాయన వేసిన కేకతో కొందరు ముందుకు వచ్చి శవాన్ని చేతులమీదుగా ఎత్తుకొని మేకలోళ్ల పల్లెకు బయలుదేరారు. అందరూ వారినను సరించారు.



"ఈ మాటిన్నావా?"

"ఏమాట?"

"అదే! ఆ శివదాసుగోడిమాట!

మనం వోళ్ళసేత ఉపరాగా పంజేయించుకుంటా వుండామంట. కూలి ఇస్తేగానీ మన పన్లకు రాడంట. ఆ రెడ్డిగోడు, కిష్టుడు వోన్తో కలిసిపోయినారంట. మనం వోళ్ళకు అన్నెయం సేస్తావుండామని ఇంకా ఏమేమో వాగినాడంట.

సూస్తావుంటే ఈడు బలే మిడిమేళంగా నడస్తావుండాడనిపిస్తా ఉండాది. వోనికి ఇప్పుడే బుద్ధిసెప్పకపోతే రానురాను మనంవంటే పూరా లెక్కా జంవలేకుండా అయిపోతుంది''

"ఆం దానికి ఏదో ఎత్తు ఏస్తాలే.

"అంతే అన్నా... ఎట్లో వగట్ల వోన్ని నువ్వే ఏదో సెయ్యాలన్నా..."

"అది నేజూసకుంటానుగానీ... ఇంకేవ న్నా వుంటే సెప్పండి..."

ఆ మరునాటి ఉదయం వరదయ్య ఇంటి వరండాలో సాగుతున్న సంభాషణ అది.

ఇంతలో క్రూరమృగాలున్న కీకారణ్యంలోకి వంటరిగా ప్రవేశిస్తున్న బాటసారిలా... మృగరాజు కాపురమున్న గుహకు దారితప్పి వస్తున్న మేకపోతులా గేటు తెరుచుకొని భయం భయంగా అక్కడికి ప్రవేశించాడు రత్తయ్య.

అతన్ని గేటులోనే చూసి కూడా చూడనట్లు నటించి, సమీపించగానే ఆప్యాయత ఉట్టిపడేటట్లు మాట్లాడాడు వరదయ్య.

"ఏమిరా రత్తిగా! ఇట్టొచ్చినావు పొద్దున్నే"

"నీ కోసరమే సాంమీ"

తలగుడ్డ చేతుల్తో నలుపుకుంటూ వినయంగా ఒక పక్కకు వదిగి నిలబడి అన్నాడు రత్తయ్య.

"ఓరి నీయమ్మ జిగుడా నాతో ఏంపంనా... నా కొండె!"

అతని మాటల్లో అవహేళన ధ్వనించింది

ఏంలేదు సామీ... మా యాడది నాలుగు పందిగున్నలు మేపుకుంటే అవి పది గున్నలవుతాయిగదా. వోట్నమ్ముకుంటే కరువు కాలానికి బత్తానికైనా వస్తాయిగదా అని అంటే... ఊర్లోనే రెండు గున్నలు పాలికి తోలుకున్నే. వోటి జతకు ఇంక రెండు గున్నలు పట్టుకుంటే మేపుకుండేదానికి బాగుంటుంది. ఎట్టాగూ మా యబ్బోడు ఊరికనే వుండాడు. వోటి కాడికి పోతాడు" నసుగుతూ చెప్పాడు రత్తయ్య.

"యిసయమేందో నేరుగా టెప్పరా... నీయమ్మ జిగుడా"

"అదే సాంమీ! గున్నలు కొనుక్కోవాలంటే దుడ్డుండాలగదా! తంవరు వొగ యిన్నూరు సాయం సేస్తే మాసూల్లో తీర్చేస్తా!" అసలు విషయం చెప్పాడు రత్తయ్య.

"అదేందిరా... మున్రాజు దెగ్గిర పంజేస్తావుండావు. ఆయన్ని అడగ్గూడదా?" మునిరాజువైపు చూస్తూ అన్నాడు.

"ఆయన కాడ యిబ్బుడే శానా బాకీ అయినాను. సాంమీ... ఇంకా అడిగేదానికి నోరు రాలా..."

"ఆ... నా దెగ్గిర శానా జేసున్నాడులే' ఎద్దేవా చేసినట్లుగా అన్నాడు మునిరాజు.

"సరే ఈ పాపన్న దగ్గిర బాండు రాయించుకోరా. నాలుగు రూపాయలొడ్డీ" వరదయ్య చెప్పాడు.

"అంతనా... రెంద్రూపాయలేగదా సాంమీ?" అంత వడ్డీకి ఆశ్చర్యపోతూ అడిగాడు రత్తయ్య.

"ఓర్నీయమ్మ జిగడా! టవున్లో అయితే నూటికి పదిరూపాయల్దాకా యిస్తారు. నువ్వు మంచోడివనీ... మాట పెకారం నడుచుకునే వోడివనీ నీకు తగ్గించి చెప్పినా..." అన్నాడు వరదయ్య.

"సరే సాంమీ... అట్టే రాసిస్తా!"

"వొరే వొగమాట... వోడు శిదాసుగోడు నెత్తిన కుడ్లు పెట్టుకున్నేడంటనే' కూపీ లాగాలన్న ఉద్దేశంతో అడిగాడు మునిరాజు.

"ఏ యిసయంలో సాంమీ?"

"అదే వరదన్న బండెత్తేదానికి అందరూ వచ్చినారుగదా! వోడు రాలే. ఇంకా ఏందేందో అన్నాడంట్నే తలగెరివి నా కొడుకు! నిజమేనా?" పాపయ్య అడిగాడు.

చెప్పాల్నా వద్దాని ఒక్కక్షణం మౌనంగా వున్నాడు రత్తయ్య. దాంతో... "వోన్నడిగితే ఏం చెప్తాడు లేవయ్యా. తెలిసీ అడగతా వుండావు?" అన్నాడు సాంబయ్య.

"ఏమిరా నిజమేనా?" వరదయ్య గద్దించి నట్టడిగాడు. ఇంక చెప్పకపోతే బాగుండదను




కున్నాడు.

"ఆ... నిజంవే"

"సరే! ఏదోరకంగా నీకు నేను సాయం జేస్తావుంటా. వోడు ఏమేమనేదీ నాకు సెప్తా వుండు"

ఇంతలో వరదయ్య పెద్దకూతురు త్రిపుర సుందరి అక్కడికొచ్చి...

"నాయనా! అమ్మ పిలస్తావుంది లోపల కంటరా..." అని చెప్పి వెళ్ళిపోయింది.

"కాయిదం రాసిచ్చి దుడ్డు తీసుకోని పోరా" అని యింటిలోపలికి వెళ్ళిపోయాడు వరదయ్య.

ఏదోరకంగా డబ్బు దొరుకుతున్నందుకు మనసు కుదుటపడగా... ఇంటిముఖం పట్టాడు రత్తయ్య బాండు కాగితం కోసం.

★ ★ ★

సాంబయ్య చేయిస్తున్న రోడ్డు పనికిపోయి వచ్చిన శివదాసు చుక్కమ్మ అందించిన చెంబుతో నీళ్లు తాగుతున్నాడు.

అదే సమయంలో పన్నెండేళ్ల సుబ్బరమణి ఏడుస్తూ... పందుల్ని తోలుకొచ్చాడు.

పందులన్నీ గుడిసెలోకి అలవాటు ప్రకారం వెడుతున్నాయి.

"ఏంవిరాబ్బా! అట్లా ఏడస్తావుండావు?" నీళ్లు తాగడం ఆపి అడిగాడు.

"పెద్ద పంది అడివిలో ఈనేసింది. దెగ్గరికి పోతే... రానీయ్యలే" వెక్కిళ్లు ఆపుకుంటూ చెప్పాడు సుబ్బరమణి.

పెద్దపంది ఈనిందని వినగానే శివదాసుకు ఆనందంతోబాటు ఆతృతా కలిగింది.

వెంటనే వెళ్లి ఆ పందిని వళ్ళోకి తీసుకొని ఆప్యాయంగా ముద్దాడాలనీ, ఎన్నిగున్న సలుగుల్ని పెట్టిందో చూడాలనీ, ముద్దులొలికే ఆ చిన్న గున్నల్ని ముఖానికి అద్దుకొని తన్మయత్వంతో మురిసిపోవాలని పిచ్చి ఆవేశం వచ్చిందతనికి, అయినా సంబాళించుకున్నాడు.

"పోరా పిచ్చిపుల్లయ్యా. దానికే ఏడస్తా వుండావా? నేందోలకొస్తాలే. ముందు పందుల్ని గూట్లోదోలు"

తమ్ముని తలను ఆప్యాయంగా చేత్తో తాకి పంపించాడు. చుక్కమ్మ కీవిషయం మరీ ఆనందాన్ని కలిగించింది.

పెద్ద పంది ఈనిందన్న వార్త ఆ ఇంట్లో అందర్నీ పండుగలా సంతోషపెట్టింది.

శివదాసుకు వెంటనే కర్తవ్యం గుర్తుకువచ్చింది. "రాతిరికి పందికి కావిలి పోకపోతే అడివిలో ఏ నక్కలో గున్నల్ని పొట్న బెట్టుకుంటాయి. అట్ట జరిగే దానికిలేదు. నా ఆస్తిపాస్తులు ఆ గున్నలే గదా! అయి పెద్దవైతే కనీసం వొగకటి ఇన్నూ రమ్ముతాయి. ఆ దుడ్డుతో సుక్కమ్మకు పెండ్లిసేసి, మా తంగిని పెండ్లి సేసుకోవచ్చు.

అప్పుడే అతని ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి. కాళ్లు చేతులూ కడుక్కొని ఇంట్లోకి అడుగుపెట్టిన అన్నకు అన్నం పెట్టింది చుక్కమ్మ.

పెద్దపందిపైనే అతని ఆలోచనలు.

ఈనేకాలం సమీపించగానే ఎంత దూరమైనాసరే వెళ్ళి ఏ పొదలోనో లేక ఏ గుహలోనో పిల్లల్ని కంటుంది పంది. అలాంటి పొదలు దొరకనప్పుడు చెరుకు తోటల్లోనో, పంట చేలల్లోనో గుబురుగా వున్న చోట అది ఈనుతుంది.

అలా ఈనిన పందులు ఎవ్వరినీ... రెండు మూడురోజులవరకు దగ్గరకు రానియ్యవు. అవి మొరటుమృగాలు. వాటిని సమీపించిన యజమానిని సైతం తమ బిడ్డల్ని ఎత్తుకొనిపోవడానికి వచ్చిన శత్రువుగానే భావిస్తాయి. తమ బిడ్డల్ని రక్షించుకోవడానికి అవి ప్రాణాలు పోయేంతవరకూ పోరాడుతాయి. అలా బిడ్డలకోసం ప్రాణాలర్పించే జంతువు ప్రకృతిలో మరొకటి లేదనిపిస్తుంది.

ఆ సమయంలో వాటిని అతి నేర్పుగా లొంగదీసుకుని పిల్లల్ని ఎత్తుకొని దొడ్డికి




తీసుకురావాల్సి ఉంటుంది.

పెద్దపంది గున్నల్ని తల్చుకుంటూ చుక్కమ్మ పెట్టిన అన్నాన్ని గబగబా మింగి, ఒక తట్టను, కొడవలిని, ఈటెను చేతబట్టుకొని అరిగిపోయి వున్న పాత చెప్పులు తొడుక్కున్నాడు. అప్పుడే భోంచేయడానికి వచ్చిన సుబ్బరమణిని "ఏరా! పంది ఈనిందేదీ'' అన్నాడు శివదాసు.

"మొండోని కనంనుంచి తూరపకల్లా దిగబడితే ఏంకొస్తుంది సూడు. ఊట్లోనొంక. దానికివతల వంటి తాటిమానుందిగదా. ఆ మాను కుడిపక్కన ఉండే పెద్ద తీంట్ర పొదలోనే ఈనిందేది'' వివరంగా చెప్పాడు సుబ్బరమణి.

"మేమందరం... ఎన్ని పిల్లలీనిందో సూతామని పోతే దెగ్గిరికే రానియ్యలే... తరుముకుంటావుండాది'' కండ్లు పెద్దవి చేసి చెప్పాడు సుబ్బరమణి.

"సరే తెల్లారేసందికి ఎట్లో వొగట్ల అగసాట్లు పడి వంగేసుకోని గున్న సలుగుల్ని తట్లో ఏసుకోనొస్తాగానీ... అక్కా, నువ్వు యింటికాడ భద్రంగా వుండండి. అమ్మ రాజమ్మోల్లింటికో ఏమో పోయినట్టుంది వస్తాదిలే'' అని కల్లూరు అడవికి బయలుదేరాడు శివదాసు.

పిండార బోసినట్లున్న ఆ వెన్నెట్లో సుబ్బరమణి చెప్పినతాటిచెట్టు కొంతదూరంలో తలవిరబోసుకుని నిలబడ్డ పిశాచంలా కనిపిస్తోంది. దానికవతల తీంట్రపొద నిలబడి వున్న గున్న ఏనుగులా కనిపిస్తోంది. అవన్నీ అతనికి అనుభవాలే. పగటిపూట ఆ ప్రదేశాన్ని ఎన్నోసార్లు చూశాడు.

"అబ్బ! వచ్చేసినాం. ఆ పొదలోనే అనుకుంటా ఆ దొంగముండ ఈనిందేది'' ముద్దుగా తిట్టాడు.

ఆ పొద కవతల 'బోడగుట్ట' నిప్పంటుకుని కాలిపోతుంటే ఆ మంట వలయాకారంగా అందమైన కన్నెపిల్ల కంఠాభరణంలా కనిపిస్తోంది.

ఆ పొదపైన ఒక చిన్న కృష్ణపక్షి అదేపనిగా విసుగూ విరామం లేకుండా అరుస్తోంది. దానికవతల గల బూరుగ చెట్లో ఒక పైడిగంట ఉండుండి అరుస్తోంది.

ఇంకొక్క అడుగు ముందుకేశాడు.

ఉహూ! ఆ పొదలో చీకటిగా వుంది. ఏమీ కనిపించడంలేదు. ఎన్ని గున్న సలుగుల్ని పెట్టిందో, అసలు పెద్ద పంది ఆ పొదలో ఉందో లేదో తెలుసుకోవాలనే ఆతృత, ఉత్సాహం ఆతనిలో ఎక్కువయ్యాయి.

ఈటెను జాగ్రత్తగా ఎడమ చేతిలోకి తీసుకుని నేలకు వంగి చేతిలోకి రెండు గులకరాళ్ళను తీసుకుని చిన్నగా ఆ పొదపైన వేశాడు. అంతే వెంటనే తీంట్ర పొద ఊగిపోయింది. గుర్ గుర్మన్న శబ్దం వినిపించింది.

క్షణంలో ఒక పెద్ద ఖడ్గమృగంలా... తెల్లటి కోరలు చాచుకొని నోరు తెరచి భయంకరంగా అపరకాళిలా పెద్ద పంది అతనిపైనబడింది. దాని తాకిడికి శివదాసు కింద పడిపోయాడు.

అది విజృంభించి అతనిమీదపడి తన వాడి కోరలతో అతన్ని చీల్చివేయడానికి ప్రయత్నిస్తూ మోరతో కొడుతోంది. ఆ దెబ్బల్ని తప్పించుకుంటూనే అతినేర్పుగా ఈటెతో దాని డొక్కలో పొడిచాడు శివదాసు.

అంతే... ఆ దెబ్బతో రొప్పుతూ అది తిరిగి తీంట్ర పొదలోకి దూరిపోయింది.

పైకి లేచాడు శివదాసు.

శరీరం అక్కడక్కడ గీరుకుపోయి నొప్పిపెడుతుంటే శరీరానికంటిన దుమ్ము దులుపుకున్నాడు.

కట్టుకున్న పంచె అక్కడక్కడా చిరుగులు పడి వుంది. వేసుకున్న చొక్కా వెనుకవైపు జానెడు పొడవు నిలువుగా చిరిగిపోయి అతని వీపు కనిపిస్తోంది. ఆ చిరుగులు అతని శరీరానికి తగిలిన గాయాలను సూచిస్తు

న్నాయి.

"దీనెబ్బడాలు. రాయేసినానో లేదో... దడక్కన దూకేసింది. సినాలి ముండ, దీన్ని నక్కలకియ్య, ఇప్పుడెట్లా?"

చుట్టూ చూస్తూ క్షణంసేపు ఆలోచించాడు. అతని వుర్రెలో ఒక ఆలోచన మెరిసింది. "అగ్గంటే ప్రతి జంతువుకూ భయమే. అట్లే పంది క్కూడా. కాలే కొరివి తీసుకొని బెదిరిస్తే... లొంగి... పోతుందేమొ" అనుకున్నాడు.

అయితే ఆ చీకట్లో ఆ కొండకు వెళ్ళడం కష్టం. పాములు, తేళ్ళూ తిరుగాడుతూ ఉండవచ్చు. పైగా కొండ మంటల వేడి ఎక్కువ. ఆ మంటల్లోకి వెళ్ళి మండుతున్న కొరివి తీసుకోవడం అంత సులభం కాదు. అందుకే యిప్పుడేం జేయాల?' అనుకుంటూ మరోసారి చూశాడు.

అక్కడ కొంతదూరంలో ఊట్లోనొంక కవతల వెదో వెలుగు కనిపిస్తోంది. అంత చిన్న మంటలు అక్కడ వుండడానికి వీల్లేదు. అయితే గొర్రెల మంద కాస్తున్న గొర్రెల కావిలోళ్ళు నక్కలు, తోడేండ్లు రాకుండా మంటేసుకుంటారు లేదా దొంగ సారాయి కాసే వోళ్ళయినా ఉండాల. ఆడికి పొయ్యి అగ్గి తెచ్చుకోవాల" అనుకున్నాడు.

అక్కడినుండి ముందుకు కదిలాడు శివదాసు. అప్పటికే పాలపుంత పడమటి దిక్కుకు వాలిపోయి వుంది.

ఇంక ఆలస్యం చేస్తే ప్రమాదం. ఏ నక్కో, తోడేలో గున్న సలుగుల్ని తినేసేయొచ్చు. ఆ మాదిరి జరక్కముందే ఎట్లో వొగట్ల పందిని మచ్చిక సేసుకోని గున్నల్ని తట్లో పెట్టుకోని తెల్లారేసందికి యిల్లు సేరాల"

అనుకుంటూ కింద పెట్టిన తట్టను, కొడవలిని చేతబట్టుకొని ఈటెను ఊత పొడుచుకుంటూ అటువైపుకు నడుస్తున్నాడు శివదాసు.

అక్కడ ఊట్లోనొంకలో ఒకచోట ఇసకలో ఎడారిలో నిశ్చింతంగా నిలబడి వున్న ఎడారి ఓడలా... ఏకాంతంగా కూర్చొని ఊసులాడుకుంటున్న ప్రేమికుల్లా... ఆ వెన్నెట్లో ఎంతో అందంగా కనిపిస్తున్నాయి, రెండు కలబంద చెట్లు.

వాటిని చూసేసరికి మరొక ఆలోచన తట్టింది. పందులు కలబంద గడ్డను యిష్టంగా తింటాయి. ఈనినప్పుడు బలహీనంగా వుండే పందులు త్వరగా కోలుకోని ఎక్కువ పాలివ్వడానికి, చింతగింజలు కలిపిన వరి తవుడు పెడుతుంటారు. అవి దొరకనప్పుడు కలబందగడ్డ తవ్వుకొచ్చి పెడతారు. ఇవి పందులకు బలవర్ధకమైన ఆహారం.

ఆ కలబంద చెట్లను కొట్టి, కలబంద గడ్డను తీసి పెద్ద పందికి వేసి మచ్చిక చేసుకోవాలనుకున్నాడు.

వెంటనే తట్ట, కొడవలి కింద పెట్టి వంకలోని ఇసకను రెండుచేతుల్లోకి తీసికొని ఆ చెట్టుపైన ఐదారుసార్లు చల్లాడు. అలా చల్లితే వాటినాశ్రయించివుండే విష జంతువులు పారిపోతాయని అతని నమ్మకం. ఆ తర్వాత.

ఈటెతో కలబంద పట్టల్ని అదిమి పట్టుకుంటూ ముండ్లు గుచ్చుకోకుండా కొడవలితో వాటిని మొదలంటా నరికి వేస్తూ పది నిముషాల్లో పట్టలన్నీ తీసేశాడు.

చివర తెల్లగా శంఖంలా నిగనిగలాడుతూ సుడి కనిపించింది. ఎడమ చేతితో సుడిని వంచికుడి చేతితో ఒకే వ్రేటుకు మొదలంటా నరికేశాడు. మిగిలివున్న సుడి భాగాన్ని మెల్లగా కొడవలితో వలిచి లాఘవంగా పైకి తోడేశాడు.

తైల సంస్కారం లేక చిందర వందరగా వుండి గొరిగివేయబడ్డ పిచ్చిదాని తలలాగా... అందులోని గడ్డ మెరుస్తూ కనిపించింది. అతి నేర్పుగా గబగబా తీసి మంచుముద్దలా తెల్లగా వున్న గడ్డను తట్టలో వేసుకున్నాడు.




ఒక ముక్కను తీసి కాస్త నోట్లో వేసుకు న్నాడు. అంతే దాని ఘాటుకు నోరు నసనస గా అయి పొరబోయింది. అయినా తీపిగా ఎంతో రుచిగా వుంది.

ఆ తర్వాత ఆ తట్ట దగ్గరే కొడవలిని ఈసెను ఉంచి కనిపించిన ఆ మంట దగ్గ రకు చేరుకున్నాడు.

అతనూహించినట్టు అక్కడున్న మంట గొర్రెల కాపర్లది కాదు. అది మునిరాజు దొంగతనంగా కాయిస్తున్న సారా బట్టీ. రత్త య్య, తిమ్మడు, గంగన్న, ఉప్పుతోళ్ళ రామ న్న అక్కడ కూర్చొని సారా కాచుతున్నారు.

మునిరాజు, పాపయ్య పక్కగా కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు.

శివదాసు రాకను ఎవ్వరూ గమనించలే దు.

ఒక చెట్టుచాటునుండి అక్కడి దృశ్యాన్ని మౌనంగా చూడసాగాడు శివదాసు.

అక్కడ మధ్యలో ఒక బండరాయిపైన మాంసం కుప్పగా వేయబడి వుంది.

మాంసం మరి కొంత బట్టీ పొయ్యమీద కుతకుత ఉడుకుతోంది. ఆ వాసన ముక్కు పుటాల్ని బద్దలుచేస్తోంది.

మసాలాలన్నీ అక్కడికే తెప్పించుకొని వండుతున్నారు. రత్తయ్య కొన్ని కండరాల ను నిప్పులపైన పెట్టి కాల్చి మునిరాజుకు, పాపయ్యకు అందిస్తుంటే... వాళ్ళు ఆప్యా యంగా తింటున్నారు.

శివదాసు ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఏమబ్బా! నా కొండె దొంగ తిమ్మడు పొట్టేల్ని భలే లగువుగా తెచ్చేసినాడు గదా!"

"వోని పేరే దొంగ తిమ్మడు గదా!"

"అవురా! వోడు మేజారి సిద్దుగోడు భలే జాగర్త మడిసి గదా! వోని దోడ్లోనుంచీ ఎట్టెత్తకొచ్చినావురా''

"ఏముండాది. వోని తమ్ముడు కల్లూరబ్బ వుండ్లే... వోడు మొద్దు నా కొడుకు. దొడ్డి దెగ్గిర గురక పెడతా నిద్రపోతా వున్నేడు. అలికిడి గాకుండా తడికి తీసి లోపలికి పొయ్యి పొట్టేల్ని భుజానేసుకోని... మళ్ళీ సద్దు జేయకుండా తడికేసేసి బయటికొచ్చే సినా''

తన గొప్పతనాన్ని చెప్పాడు తిమ్మడు.

"సరే గానీ... మునెప్ప ఎత్తుకోని పోయిండే తునకలు సాంబయ్యకూడా యిచ్చింటాడా. వరదయ్యకి మాత్రమే యిచ్చి మిగిల్నివి వోడే తినేసుంటాడా?"

మునెప్ప చేత వరదయ్యకు సాంబ య్యకు యిచ్చి పంపిన మాంసాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ అన్నాడు రత్తయ్య.

"ఇయ్యకపోతే వోడు వరదయ్య యింట్లో వుండద్దు! మనకు మోసం జేసి ఊర్లో బతకతా డా మళ్ళ''

"అది సరే! రేపుట్నుంచీ అయ్యా! మా పొట్టేలి మీ గొర్రెల్లో వచ్చిందా? అయ్యో మా పొట్టేలి అయో పొట్టేలి'' అని ఇల్లిల్లు దిరిగి అడుక్కోని సావాల సిద్దుగోడు'' సిద్దప్పను అభినయిస్తూ చెప్పాడు పాపయ్య.

దాంతో అందరూ పగలబడి నవ్వారు.

అలా మాట్లాడుకుంటున్న వారి మాటల్ని బట్టి అసలు విషయం శివదాసుకు అర్థమైపో యింది.

తాను వచ్చినట్లు చిన్నగా దగ్గాడు.

దాంతో మేకలోళ్ళ పల్లోల్లు వచ్చేసినారే మోనన్న భయంతో వారి మాటల్తోబాటు వారి నోళ్ళు ఉన్నట్టుండి ఆగిపోయాయి.

చెట్టు చాటునుండి వారి ముందుకొచ్చాడు శివదాసు.

అతన్ని చూసి అందరూ ఒక్కక్షణం షాక్ తిన్నారు. అంతవరకూ తమ గుట్టు ఎవరికీ తెలియదనుకున్న అక్కడివారంతా ఆ సమ యంలో శివదాసును చూచి చంపేయాల న్నంత కోపం వచ్చింది.

"ఏందిరో శివుడూ! యింత రేతిరి పూట

యిట్టచ్చినావు. ఎంత సేపయిందొచ్చి. మేక పోతు గాంభీర్యాన్ని నటిస్తూ అడిగాడు మునిరాజు.

"గిప్పుడే"

"మేం మాట్లాడింది యిన్నేవా ఏందీ?"

నిజం తెలిస్తే తన కులంవారే తనను తంతారన్న భయం కలిగిందతనికి.

"నేను యిండ్లే" అన్నాడు.

"ఓయమ్మా..." అని గాలి పీల్చుకున్నారు అందరూ.

"ఏమీలేదు. దొంగ తిమ్మడు వోళ్ళు... వస్తా వస్తా అడివి గొర్రెను కొట్టకొస్తే దాన్ని కోసి వండతావుండాము"

నిజాన్ని కప్పిపుచ్చుతూ అన్నాడు మునిరాజు.

అడవి గొర్రె చాలా హుషారైన జంతువు. అది అచ్చం పెంపుడు గొర్రెలాగే వుంటుంది. అది తుపాకీతో కాల్చడానిక్కూడా అవకాశమివ్వనంత వేగంగా పరిగెత్తుతుంది. అంత సులభంగా శత్రువు చేతికి చిక్కని అడవిగొర్రె రాత్రివేళ అసలు సంచరించదు. ఏ గుళ్ళమాటునో లేక ఏ క్రూరమృగాలు జొరపడని పొదలమధ్యనో దాగి వుంటుంది. అందుకే వారు చెబుతున్నది అబద్ధమని తెలుస్తూనే వుంది శివదాసుకు.

ఒక చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. అంతకుమించి అర్ధరాత్రి, నట్టడవిలో వారితో వాదించడం మంచిది కాదనుకొని వారు ఏది చెప్పినా మౌనంగానే వింటున్నాడు.

ఆవేళ... అతనికి తెగ మర్యాద చేశారు వారు. మునిరాజు ఒక సత్తు గ్లాసుతో శివదాసుకూ సారా అందించాడు. మిగిలినవారూ తాగమని బలవంతం చేశారు.

చాలారోజుల తర్వాత మళ్ళీ ఆవేళ సారా రుచి చూశాడు శివదాసు. తిమ్మడు కాల్చి యిచ్చిన కరకుట్లు నమిలాడు.

ఉడికిన మాంసం దించబడింది. ఆ మాంసపు ముక్కల్నే అందరూ ఆనందంగా తిన్నారు.

తమతోబాటు శివదాసు కూడా పాలు పంచుకున్నందుకు వాళ్ళు ధైర్యం వహించారు.

శివదాసు తాను వచ్చిన పని వారికి చెప్పి అక్కడే వున్న ఒక పాత గోనెసంచిని చీల్చి ఒక కట్టెకు చుట్టి మునిరాజు అనుమతితో దాన్ని సారాతో తడిపి కాగడాలాగా వెలిగించుకొని తిరిగి అక్కడి నుండి బయలుదేరాడు.

ఊట్లోని వంక యిసకలో కాగడా పట్టుకొని వస్తున్న శివదాసుకు వారు ఊడగొట్టి పారవేసిన పొట్టేలు కొమ్ములు రెండు కనిపించాయి. అతని మెదడులో ఆలోచన తట్టింది. వెంటనే వాటిని చేతిలోకి తీసుకొని అక్కడ ఇదివరకే కలబంద గడ్డ వుంచిన తట్టలో వుంచుకొని కొడవలిని ఈటెను కాగడాను ఎలాగో మోసుకుంటూ వాటిని తీండ్ర పొద కల్లంత దూరంలో ఉంచాడు.

కలబంద గడ్డ ముక్క నొకదాన్ని ఈటెకు గుచ్చి దాన్ని ఎడమచేతితోను, కాగడాను కుడిచేతితోను పట్టుకొని జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ తీండ్ర పొదను సమీపించాడు.

సమీపించేకొద్దీ కాగడా వెలుగులు తీండ్ర పొదలోకి చొచ్చుకొని పోసాగాయి.

మరి రెండడుగులు ముందుకు వేశాడో లేదో... అంతే... మరుక్షణం పెద్ద పంది పొదలోనుండి మోరపైకెత్తి చూసి... ఒక్క ఉదుటున అతని పైకి దూకింది. అది గమనించిన శివదాసు లాఘవంగా తప్పించుకొని ఏమాత్రం ఆలస్యం చేయకుండా... కొరవితో తెరచి వున్న దాని నోటి మీద కొట్టాడు. అంతే మూతి కాలిందేమో పాపం పెద్ద పంది "ఘీ... ఘీ...ఘీ" అని పెద్ద శబ్దం చేస్తూ మళ్ళీ పొదలోకి దూరింది.

"దొంగలంజా... భయపడిందే... ఇంక




ఫరవాలేదు లేబ్బా'' అనుకుంటూ గిరకవే స్తూ... దా... దా... గూచీ... దా... దా... ద... గూచి గూచ్' అంటూ లాలనగా పిలుస్తూ కాగడాను ముందుకు చూపి ఒక్కొక్క అడుగే వేసుకుంటూ పంది వస్తూ పోతూ ఏర్పాటు చేసుకున్న దారి గుండా పొద లోపలికి వెళ్ళిపోయాడు. ఈమధ్య కాలంలో పంది ఎన్నోసార్లు అమాంతం అతనిపైబడి చీల్చి చెండాడాలని ప్రయత్నించి ఆ మంట ను చూసి అక్కడక్కడే తిరుగుతూ ఆ పొదను అల్లకల్లోలం చేసింది.

ఆ పొదలో కాగడా వెలుగులో పెద్ద పంది భయంకరంగా నోరు తెరచి మోర ఎత్తి కోరలు సాచి గున్న సలుగుల చుట్టూ తిరుగు తోంది. అది అతన్ని చూసి 'ఫీ' పెడుతుంటే దాని తెల్లని కోరలు మెరిసిపోతున్నాయి. దాని తాకిడికి పెనుమంటల్లో చిక్కుకుని అక్కడక్కడే తిరుగుతున్న పక్షుల్లా తిరుగు తూ 'కీసు కీసు'మని అరుస్తున్న గున్న సలుగుల్ని చూసేసరికి ఆనందంతో అతని కళ్ళు మెరిసిపోయాయి.

పెద్ద పంది అతనిపైకి దూకడానికి ప్రయత్నిస్తూ మంటను చూసి వెనక్కి వెడుతోంది నోరు తెరుచుకొని...

ఈటెకు గుచ్చివున్న కలబంద గడ్డను దాని నోట్లో పెట్టాడు. అది పుటుక్కున దాన్ని నమిలి మింగేయాలని చూసింది.

వెంటనే ఈటెను బయటకు తీసివేశాడు. దాని రుచి కమ్మగా తోచేసరికి దాన్ని అలాగే చప్పరించి మింగేసింది. తర్వాతగానీ ఆ పెద్ద పందికి వచ్చింది తన యజమానని తెలిసింది కాదు. దాంతో అది తన రౌద్రరూపాన్ని కాస్త తగ్గించడంతో శివదాసు తిరిగి వచ్చి కలబందగడ్డ తట్టను అక్కడికి తెచ్చు కుని... కూర్చొని మెల్లమెల్లగా దాన్ని కాగ డాతో బెదిరిస్తూనే 'దా... దా... ద... గూచీ... ద... గూచ్' అంటూ కలబంద గడ్డ ముక్కల్ని కొడవలితో చెక్కివేస్తుంటే... ఆవురావురుమని తినసాగింది పెద్ద పంది.

శివదాసుకు ముద్దులొలుకుతున్న గున్న సలుగుల్ని చూస్తూంటే వాటిని తాకి ముద్దు పెట్టుకోవాలనీ ఆతృత కలిగింది. కానీ... ఎంత మచ్చికైనా పంది చాలా క్రూరమైంది. ఒకవేళ వాటిని తాకితే తన చెయ్యినీ కల బందగడ్డలా చప్పరించి వేయవచ్చని క్షణంసేపు భయపడి నోటితో గిరకవేస్తూ... కాగడా ముందుకుంచుకోని... జాగ్రత్తగా గున్న సలుగుల్ని తాకాడు.

ఆశ్చర్యం... పెద్ద పంది ఈసారి అతన్ని ఏమీ అనలేదు. ఒక్కసారి ఉరిమిచూసి కసక సమని గడ్డనములుతూ చూస్తూ ఊరుకుంది.

దాంతో శివదాసుకు ధైర్యం వచ్చేసింది.

"ఇంతసేపటికి దోవ కొచ్చినావా... దొంగ ముండా'' అనుకుంటూ మండుతున్న కొర విని మంట తాకనివిధంగా పొదలో చెక్కాడు.

అది రాణివాసపు గదిలో సన్నగా వెలుగుతున్న రాచ కాగడాలా ఆ పొదనంతా వెలుగులతో నింపుతోంది. దానికి చుట్టివున్న సంచి పట్ట ఇంకా సేపట్లో ఆరిపోయే విధంగా వెలుగుతోంది. అది ఆరిపోయే లోపల సలుగుల్ని తట్టలో పెట్టుకోని... పందిని వెంట తీసుకుని తెల్లారే లోపల యింటికి వెళ్ళాలని శివదాసు అభిప్రాయం.

అందుకే... మచ్చికచేస్తూ... ఒక చేత్తో కలబంద గడ్డను తినిపిస్తూ... మరో చేత్తో దాని వీపు నిమిరాడు.

దాంతో అతనిపైన పూర్తిగా నమ్మకమేర్పడింది పందికి. కడపటి సారికి గున్న సలుగుల్ని తాకుతూ ఒకటి, రెండు అని లెక్క వేస్తూ అక్కడున్న పదమూడు సలుగుల్ని లెక్కపెట్టాడు. ఎన్నో ఏళ్ళనుండి శ్రమించగా దొరికిన గుప్తనిధిని చూసి పొంగిపోయే వ్యక్తిలా ఆనందపడి పోయాడు శివదాసు.

దివిటీ వెలుగు క్రమంగా తగ్గిపోతుంటే యింకా ఆలస్యం చేయడం మంచిది కాదను కొని పొద వెలుపలకొచ్చి, నారవాకులు



తీంఁడ్రాకులు కోసి తెచ్చి, తట్ట అడుగుభాగం గుచ్చుకోకుండా వాటిని పరచి గున్న సలుగుల్ని తట్టలో పెట్టాడు. పంచె తీసి తలగుడ్డలాగా చుట్టి తలగుడ్డను మొలకు బిగించి, ఆ తట్టను నెత్తిన పెట్టుకొని ఒక చేత్తో దాన్ని, మరొక చేత్తో ఈటెను కొడవలిని పట్టుకొని పందిని పిలుస్తూ... బయలుదేరాడు. కొంచెంసేపు సతాయించినా అలా ఇలా 'గుర్‌గర్' మని తిరుగుతూ అతన్ని అనుసరించసాగింది పెద్దపంది.

అక్కడక్కడా దించి గున్న సలుగులకు

పాలు తాపించుకొని మళ్ళీ వాటిని తట్టలో పెట్టుకుంటూ 'దా...దా... దామ్మా... గూచ్... గూచ్' అని పిలుచుకుంటూ ఆ మసక చీకట్లో గూడెం వైపుకు బయలుదేరాడు శివదాసు.



ఉదయం పదిగంటల సమయం. మాతంగి... నీళ్ళ బిందెచేత బట్టుకొని వరదయ్య బావికి బయలుదేరింది.

ఆ సమయంలో ఆ బావిదగ్గర ఎవ్వరూ లేరు. మునెప్ప మాత్రం దూరంగా వున్న

చివరి బీడుకయ్యలో ఏదో పని చేసుకుంటు న్నాడు. త్రిపుర సుందరి నీళ్ళ తొట్టిపైన మునెప్పనే చూస్తూ కూర్చొని వుంది.

"ఏం సుందరీ! ఒక దానివే వుండావ్!" పలుకరించింది మాతంగి.

ఆ మాటకు ఉలిక్కిపడి అటు చూసి చిరునవ్వుతో, "ఏం లేదు... ఇంట్లో పొద్దుపో లా... ఇట్టొస్తి... నీళ్ళకొచ్చినావా?" అంది.

"ఆ... వస్తి... మాకు ఈ నీళ్ళ బాధ ఎప్పుడు తప్పుతుందో ఏమో!" అని ఈ బాధ తీరేది కాదన్నట్టుగా అంది మాతంగి.

"నేను పుట్టినప్పటిన్నుంచీ సూస్తా వుండా.. ఇట్టా బయటినుంచే నీళ్లు తీస్కపో తావుండారే మీరు... మీరంతా కలిసి ఒక బావి తవ్వుకుంటే ఏమి?"

"తవ్వుకోవచ్చు... అందరూ కూటికి చా లని వాళ్లే. రోజంతా పంజేస్తేగానీ... పూట గడవని వాళ్లే... బాయి తవ్వాలంటే వేలు గావాల... యాడతెస్తారు?"

"పోనీ ఒక బోరింగయినా యేసుకోకూడ దా''

"బోరింగు వుంది. దాంట్లో నీళ్లులేవు''

ఇలా కొంతసేపు మాట్లాడుకున్న తర్వాత వారి సంభాషణ మంగమ్మ మరణం మీదికి పోయింది.

"అవునే మాతా! మంగి ఎందుకు బా యిలో పడిందటనే'' అంది త్రిపురసుందరి.

"ఏందో రకరకాలుగా సెప్పుకుంటారు''

"ఏం సెప్పుకుంటారే?" ఆసక్తిగా అడి గింది.

"మనూరి పెద్దోళ్లే... ఆయమ్మని సెడిసే సినారంట. ఆ బాధతో బాయిలో దూకి సచ్చిందని చెప్పుకుంటా వుండారు'' అని ఆమె ముఖంలోకి చూస్తూ అంది మాతంగి.

"పెద్దాళ్లంటే ఎవ్వరంట?" అనుమా నంగా అడిగింది త్రిపురసుందరి.

"ఆఁ... అయన్నీ మనకెందుకులే... ఇంక నేనొస్తా?" ఆ విషయం చెప్పడానికి ఇష్టం లేనట్లు వెళ్లడానికి సిద్ధపడింది.

"వసే మాతా.. జలే పొయ్యావుగానీ ముందు సెప్పిమ్మీ. మనం ముగ్గురం అక్కా చెల్లెల్ల మాదిరిగా ఉంటిమి... ఆయమ్మి పోయేసందికి నా సొంత చెల్లే పూడిసినట్లుందే అందుకే సెప్పే... ఏం జరిగిందంట?" స్నే హితురాలి మరణానికి బాధపడిపోతూ అంది.

"చెబితే నన్నేమన్నా అంటావేమోనని''

"ఎందుకంటానే''

"ఏమో... మీరంతా వున్నోళ్లుగదా''

"వసే నా సవుతి... ఎందుకే నన్న ట్టంటావు.. నేనెప్పుడయినా అట్టా మసిల్నా నా... ఇంతేనా నువ్వు నన్నర్థం చేసుకునింది. తూఁ... నేస్తాల కోసం ప్రాణాలర్పించేదాన్నే నేను'' ఆమె కళ్లు చెమ్మగిల్లాయి.

ఆమె కళ్లలో నీరు చూసేసరికి కరిగిపో యింది మాతంగి.

"అయ్యొయ్యో... ఏందే ఇది... పొరబా టైపోయిందే... నువ్విట్ల బాధపడతావని తె లిస్తే నేనా మాటననే... ఆ మాట చెబితే నువ్వింకా బాధపడతావని చెప్పలేదే'' అను నయిస్తూ అంది మాతంగి.

"అయినా సరే.. మన మద్దెన దాపరికం ఏందే మళ్లీ... అందుకే చెప్పు"

"సరే... విని నన్నేమనకూడదు సరేనా''

"సరే... చెప్పు"

"ఏం లేదే... మంగి మధ్యాహ్నం పూట గొర్రెపిల్లకు పాలు దాపుకొని వస్తావుంటే మీ తోపులోనే ముద్రాజువాళ్లు ఆయమ్మిని బల వంతం జేసి నాశనం చేసేసినారంట. అట్ట బతుకు పాడైపోయినంక ఊళ్లో ముఖం చూ పించలేక, బాధ భరించలేక ఇట్లా నీళ్ల బాయి లోపడి సచ్చిపోయిందంట. ఊరంతా సెవు లు కొరుక్కుంటా ఉండారు''

మాతంగి నోట ఆ మాట వినేసరికి అలాగే నిశ్చేష్టురాలైపోయింది త్రిపురసుందరి.

ఆ స్థితిలో ఆపైన ఆమెతో మాట్లాడడం ఇష్టంలేక మాతంగి నీటి తొట్టిలోనే బిందెతో నీళ్లు ముంచుకొని వెళ్లిపోయింది.



**ఆ** మరునాడు సాయంత్రం... కాలగర్భంలో మరొక రోజు విలీనమవుతున్న వేళ...

జమిలిగడ్డలోని వరదయ్య యింట్లో పెద్దలందరూ ఆసీనులై వున్నారు. రాజును సేవించే భృత్యుల్లా గూడెంవాళ్లు, మేకలోల్లపల్లె వాళ్లు కింద కూర్చొని వున్నారు.

శివదాసు, రెడ్డన్న, నారాయుడు వంటి యువకులు వెనుక నిలబడి చూస్తున్నారు.

దొంగ తిమ్మడు, గంగడు, రత్తయ్య చేతులు కట్టుకొని భయంభయంగా ఓ పక్కన వదిగి నిలబడి వున్నారు.

"ఆ యింగేమబ్బా.. సిద్దప్ప... నువ్వింత మందిని కూడేసిన కారణమేందీ''

సంభాషణ మొదలు పెట్టాడు బెంచీపైన కూర్చున్న సాంబయ్య.

"మంచి నెల్లూరు తెల్ల పొట్టేలిని గొర్రలపై కని మేపుకుంటా వుంటాన్నా.. అది నిన్నట్నుంచీ కనబల్లా. అందుకనీ అన్ని చోట్లు తిరిగినా... గొర్లోళ్లందర్నీ తలకు నోరు కట్టుకోని అడిగినా... ఆనబాలే దొరకలా. ముందుట్నుంచీ మనూరి గూడెంవాళ్లే మా గొర్రెల్ని ఎత్తుకోని పోతా వుండ్రి. కాబట్టి దీన్ని ఎత్తుకోని పొయ్యి తినేసినారేమోనని అనుమానంతో ఆనవాలు కోసరం గూడెం యెనకాతల తిరగతా వుంటి. యింతలో శివదాసు గోడు అడవినుంచీ పందిపిల్లల్ని ఎత్తుకోని పోతా కనిపించి.. నీ పొట్టేలిని సారాయిగాచేవోళ్లు తినేసినారు. యిద్దో దాని కొమ్ములు అని మా పొట్టేలి కొమ్ములిచ్చాడు. యిద్దో ఆ కొమ్ములు సూడండి''

అంతవరకూ తలగుడ్డల దాచుకొనివున్న ఆ కొమ్ములు తీసి వారి ముందరపెట్టి తిరిగి అన్నాడు.

"సామీ దేవరా! ఇన్ని దినాలు బిడ్డెను సాకినట్లు సాకినా. ఎట్లయినా నాకు నాయం సేయండి''

చెప్పడం ముగించి పక్కకు వచ్చి నిలబడ్డాడు సిద్దప్ప.

వాటిని అందరితోబాటు మునిరాజు, పాపయ్య, వరదయ్య కూడా చూశారు. వరదయ్య తప్ప మిగిలిన వారందరూ తమ గుట్టు ఎక్కడ బయటపడిపోతుందోనని భయపడిపోతున్నారు. గంగడు, తిమ్మడు, రత్తయ్యలయితే సరేసరి.

వరదయ్య వాటిని పరిశీలనగా చూశాడు. దాని మాంసం తిన్న వరదయ్యకీ అవి సిద్దప్ప పొట్టేలివేనని తెలుసు. అయినా తెలియనట్టే ప్రవర్తించాడు.

"ఇవి నీ పొట్టేలివేనని ఋజువెట్లరా సిద్దంగా'' తాపీగా ప్రశ్నించాడు వరదయ్య.

"నే చెబుతాను'' అని ముందుకు వచ్చి తాను అడవిలో చూసింది, విన్నది... అంతా చెప్పాడు శివదాసు.

"ఆ పొట్టేలి తునకల్లో మీక్కూడా భాగ మందిండాలే!" వెటకారంగా అన్నాడు.

దాంతో అక్కడ కలకలం బయలుదేరింది.

. వరదయ్య అహం మొదటిసారిగా దెబ్బ తినింది. పాపయ్య, మునిరాజుల గుండెల్లో బాంబు పేలినట్లయింది.

శివదాసు యిలా ప్రవర్తిస్తాడని కలలో కూడా వారెన్నడూ ఊహించలేదు.

"వరదయ్యను యింకా బాగా తగులుకుంటే బలే వుండును'' అనుకున్నాడు సాంబయ్య మనసులోనే. తన ఆధిక్యతను గుర్తించని ఆతన్ని మేకలోల్లపల్లె వాళ్లు కొడితే బాగుండునని కూడా అనుకున్నాడు.

గూడెంవాళ్లు అవమానంతో తలలు వంచుకున్నారు. తమలో ఒకడైన శివదాసే తమను దొంగలుగా నిరూపించినందుకు ఆతని పైన కసిని, పగను పెంచుకోసాగారు.

"అయితే దొంగతనం రుజువైనట్టేగదా!" లోలోపల సంతోషపడిపోతూ అన్నాడు సాంబయ్య.

"సాంబయ్యా! కొంతసేపు ఊరికే వుంటావా లేదా?" కోపంగా సాంబయ్యని అని తిరిగి "శివదాసో ఏమైనా పెద్దోళ్లమీంద యిట్ల అపనిందలు యెయ్యడం బాగాలేదు. మేమేందీ దొంగతునకల కాశించేదేందీ?" కోపాన్నణుచుకుంటూ శివదాసుతో అన్నాడు వరదయ్య.

"నేననిందాంట్లో తప్పేముండాదీ. వోళ్లు మాట్లాడుకునిందే నేc జెప్పినా. మీ మునెప్ప దెగ్గిరంట గదా మీకు తునకలు బంపించింది'' ధైర్యంగా అన్నాడు శివదాసు.

"ఆహా... ఏం వరదయ్య! దీనికి సమాధానం ఏమి సెప్తావబ్బా..." నిలదీసినట్లు అడిగాడు సాంబయ్య.

అందులో నీక్కూడా ఒగ భాగం అందిండాల గదా సాంబన్నా... నువ్వు కూడా బలే పెద్ద మడిసిమాదిరి మాట్లాడతా వుండావే?"

సాంబయ్యకూ వడ్డించాడు. గతుక్కుమన్నాడతను.

"అదీ.. అది నాకు తెలీదు. నేను... నేను నిన్న యింట్లో లేను'' నీళ్లు నమిలాడు సాంబయ్య.

"శిలాభారం తలా కొంచెమనీ... ఏందయ్యా! పెద్ద మడుసులందరిపైనా సెప్తా వుండావు. మేమంతా ఊరికేనే ఉండామనా..." చుర్రుమన్నాడు మునిరాజు.

"పెద్దంతరం సిన్నంతరం లేకుండా మాట్లాడతా వుండారబ్బా ఈ కాలం పిలకాయలు. అన్నెకారి కాలం ఆ మాదిరైపూడిసింది'' అంతకుమించి ఏమీ అనలేకపోయాడు పాపయ్య.

"అవున్లే.. మీరంతా పెద్ద మడుసులు... ఎవురికి వాళ్లే... ఏదైనా వస్తే మళ్లీ అందురూ వొగటే... మీ సావుకార్లందరూ వొగటే.. మద్దెలో మాయట్లా కూటికి లేనోళ్లే సస్తా వుండేది'' నిష్టూరంగా అన్నాడు నారాయుడు.

ఇలా ఎవరికి వారు మాట్లాడేస్తున్నారు.

ఈ పరిణామానికి వరదయ్య పేరు ప్రతిష్టలు దిగజారిపోతాయని లోలోపల సంతోషపడిపోతున్నాడు సాంబయ్య.

ఆ విషయం తెలిసే వరదయ్య ఆచితూచి మాట్లాడుతున్నాడు.

ఇలాంటి పరిస్థితిని ఎలా ఎదుర్కోవాలో వరదయ్యకు బాగా తెలుసు. అయినా ఒకవిధంగా యిలా జరగడం ఆతనికీ యిష్టమే.

ఎందుకంటే... తనను వ్యతిరేకించి తననే ధిక్కరించిన శివదాసుపైన ఈ దెబ్బతో గూడెం వారంతా విరోధం పెంచుకుంటారు. ఆపైన జీవితాంతం వాడికి వారే శత్రువులవుతారు. ఈ అవకాశాన్ని వదులుకోదల్చుకోలేదు వరదయ్య.

అతను లేచాడు.

దాంతో ఎక్కడి వారక్కడ నిశ్శబ్దంగా అయిపోయారు.

 

"ఈ నాయం సరిగా తెగాలంటే గూడెంవోళ్లు, సిద్దప్ప ఐదొందలు, ఐదొందలు చొప్పున డిపాజిట్లు కట్టి అగ్రిమెంటు రాసుకోవాల. వొగేల పెద్ద మడుసులు సెప్పే నాయం వొప్పుకోకుండా వున్నా లేదా దాన్ని లెక్కసేయకున్నా వోళ్లకు డిపాజిట్లు యియ్యము. సాంబయ్యా... పత్రాలు రాయి'' అందర్నీ చూస్తూ తాపీగా అన్నాడు వరదయ్య.

అన్నీ సిద్ధమయ్యాయి. సిద్దప్ప, తిమ్మడు, గంగడు డబ్బులిచ్చి పత్రాలపైన వేలిముద్రలు వేశారు. ఆ తర్వాత న్యాయం చెప్పాడు వరదయ్య.

"అడవిలో శివదాసు చూసింది, విన్నదీ నిజమే''

వరదయ్య తమకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నాడని, ఇక తమని రక్షించే నాధుడే లేడని గంగడు, తిమ్మడు, రత్తయ్య వంటి వాళ్లు అనుకున్నారు.

"దాని కొమ్ములు తెచ్చి సిద్దుగోనికిచ్చినాడు. నిజమే''

గూడెం వారి గుండెల వేగం యింకా ఎక్కువైంది. అందరూ ఆతృతగా వింటున్నారు.

ఇక్కడికొచ్చి సూసింది సూసినట్టు సాచ్చికం గూడ సెప్పేసినాడు. అదీ నిజమే... గూడెపోళ్లు పొట్టేల్ని కోసుకోని తినేసినారని గూడ రుజువై పూడిసిండేది గూడా నిజవే''

వరదయ్యపైన వున్న తమ నమ్మకం పూర్తిగా తొలిగిపోయింది. గూడెం వాళ్లా ఏంది వరదయ్య యిలా చేశాడే అనుకున్నారు.

మునిరాజు, పాపయ్యలు కూడా భయపడిపోయారు. మేకలోల్లపల్లె వాళ్లు ఇంక తమని బతకనియ్యరనుకున్నారు.

అందరూ శ్వాస బిగపట్టి ఆఖరి మాట కోసం ఎదురు చూస్తున్నారు.

"అయితే.. ఆ కొమ్ములు సిద్దుగోని పొట్టేలివేనని తెలిసేదెట్లా? అందులో అవి కాలిపోయి ఉండాయి. శివదాసుగోడు పొట్టేల్ని ఎత్తకొచ్చినప్పుడు సూడలా, కాబట్టి ఎవురైనా పోట్న్ని గుర్తుపట్టి అవి ఫలానా పొట్టేలివేనని సెప్పుండబ్బా'' అని ఒక్క నిమిషం మౌనం వహించాడు వరదయ్య.

తమపైన ప్రేలడానికి సిద్ధంగావున్న బాంబును హఠాత్తుగా ఏదో వచ్చి అడ్డుకొన్నట్టయింది గూడెం వాళ్లకి.

సిద్దప్ప వారి అనుచరులు మాత్రం ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. వరదయ్య ఎత్తుగడ పారింది.

ఊడిపోయిన కొమ్ముల్ని గుర్తించడం ఎవరి వల్లాకాదు.

గూడెంవాళ్లు, పాపయ్య, మునిరాజు గాలి పీల్చుకున్నారు.

"ఎవురూ ఆ కొమ్ములు సిద్దూగోని పొట్టేలివేనని సాచ్చం సెప్పలా. కాబట్టి అయి ఆ పొట్టేలి కొమ్ములు కాదని ఋజువైనట్లే'' అని చెప్పేశాడు వరదయ్య.

నెత్తిన పడబోయిన పిడుగును తప్పుదారి పట్టించిన పార్థునిలా ఆ సమస్యనుండి గూడెంవాళ్లను రక్షించినందుకు మనసులోనే జోహార్లర్పించారు సాంబయ్య, తదితరులు.

ఇంతచేసీ తన శ్రమంతా సముద్రంలో పడిన చినుకులా వృధా అవడమేగాకుండా తాను తంటాలమారి వానిగా నిరూపించడానికి వరదయ్య ఏదో ఎత్తుగడ వేస్తున్నాడని శివదాసుకు అర్థమైపోయింది.

చివరిసారిగా చెప్పాడు వరదయ్య.... "ముందుట్నుంచీ గూడెపోళ్లలో ఉప్పుతోలోళ్లకు మట్టి తెగోళ్లకు యిరోధాలుండాయి. ఏదో వొగయారవెత్తుకోని... ఒకర్నొకరు పచ్చిగా తిట్టుకుంటూ కొట్టుకుంటూ వుంటారు.

మట్టి తెగకు చెందిన శివదాసు పాతకసి మొనుసులో పెట్టుకోని ఉప్పుతోలోల్లపైన పగ సాధించుకోవాలనీ ఈ ఎత్తుగడ ఏసినా

డు.

ఏవో కొమ్ములు తెచ్చి... మన్ను పిసుక్కొని బతుక్కునే తిమ్మనిపైన... గంగని పైనా ఈ దొంగతనం పెట్టాడు.

ఇట్టి తప్పుడు సాచ్చికం సెప్పిందానికి శివదాసుగోనికి ఇన్నూరూ రూపాయలు అపరాధమేసి, సొత్తు పోగొట్టుకున్నా వోని మాటిని పంచాయిదా పెట్టి పెద్ద మడుసుల్ని ఎట్లంటె అట్ల మాట్లాడే దానికి సందిచ్చిందానికి దండిస్తా... ఈసారికి సిద్దన్ని వదిలేస్తా వుండాం"

ఈ తీర్పు విని.. వరదయ్యపైన ఉగ్రుడై పోయాడు శివదాసు.

"ఏమయ్యో! ఏందయ్య నీవు నాయం సెప్పింది. సూసింది సెప్పిందానికి నాకే తప్పేస్తావు? తిన్నోళ్లు మీరంతా పెద్ద మనుషులే... నేనేనా యదవైంది... ఏమయ్యో! ఈ అన్నేయవు.. ఈ దవుర్జన్యవు ఎల్లకాలవు సాగదయ్యా. నీకు పన్లకు రాలేదని... మా ఎక్తక్కువలు సూసుకోని మాలో మాకు యిరోధాలు ఎక్కువ సేసినావు. అందుకు ఈ అపరాధం నేను గట్టను. యోవ్ ఏమయ్యా.. నీవల్ల అయింది సేసుకోపో పోయ్యా"

పైగుడ్డ విదిలించి భుజాన వేసుకుని అక్కడి నుండి విసురుగా వచ్చేశాడు శివదాసు.

తన ఆజ్ఞను ఇష్టం లేకపోయినా ఆచరిస్తాడనుకున్నాడు. కానీ శివదాసు యిలా తిరగబడతాడని అతను కలలో కూడా అనుకోలేదు.

మరోసారి ఆతని అహం దెబ్బతింది.

ఏ న్యాయమైతే గూడెంవాళ్లను, గొర్లకాపర్లను తన చెప్పుచేతుల్లో ఉంచుతుందని ఆశించాడో ఆ న్యాయం తిప్పి కొట్టింది.

తెగ బాధపడిపోయాడు వరదయ్య.

"సామీ నేను సొత్తును పోగొట్టుకున్నోన్ని... ఈ కొమ్ములు సత్తె పెమాణకంగా నా జివ్వానివే. నన్నన్నేయం సేయొద్దు" రెండు కొమ్ములూ చేతిలోకి తీసుకొని ఏడుస్తూ అర్థించాడు సిద్దప్ప.

అంతవరకూ మౌనంగావున్న నారాయుడు తండ్రి దీనావస్థను చూసి ఉక్రోషంతో ఊగిపోతూ... ముందుకు వచ్చాడు.

"వొరే అయ్యా! ఏందిరా యింకా అడుక్కుంటూ వుండావు. ఈ రెండూర్లు కలిసుంటే... వోళ్ల ఆటలు సాగవని ఏసిన ఎత్తురా యిది. ఈ డిపాజిట్లు, ఆ అపరాధాలు తిరిగిచ్చే దానిక్కాదురా. వోళ్ల జేబీలు భర్తీ సేసుకునేదానికి... తెలీలా? ఇక్కడ న్యాయం జరుగుతుందా? నేను ముందే జెప్పినా... ఈల్లు మడుసులు కాదు రాచ్చసులు అని. మనట్టావోళ్లకు న్యాయం సెయ్యరని. అయినా నువ్వింఢ్లా! ఇప్పుడు తెలిసిందా... యింక లెయ్యిపోదాం!" ఆతని రెక్క పుచ్చుకుని లేపి తీసికొని వెళ్లిపోయాడు నారాయుడు.

పంచాయితీ దెబ్బ తినడంతో ఎక్కడివారు అక్కడ వెళ్లిపోయారు.

అవమానంతో అక్కడినుండి వెళ్లిపోయారు దుష్ట చతుష్టయం.

తన చేనిలో పడ్డ... తన ప్రత్యర్థి పొట్టేలు సర్వనాశనమైనందుకు లోలోపలే సంతోషించాడు పాపయ్య.

★ ★ ★

లోకం పైన పగబట్టి అగ్ని శిఖలు వెదజల్లుతున్నట్లు సూర్యుడు మండిపోతున్నాడు.

బచ్చనకుంట్లో పందులు తోలుకొని ఆ కట్టపైనున్న కానగచెట్ల నీడలో ఒంటరిగా కూర్చొని వుంది మాతంగి.

పందులు నీటి చివర బురదలో పొర్లాడుతున్నాయి. ఆ ఎండలో గసపోసుకుంటూ మునెప్ప, వరదయ్య వ్యవసాయం పనులు చూడడానికి వెళుతున్నాడు.

మునెప్పకు నా అన్నవారు ఎవ్వరూ




లేరు. ఉప్పు తెగకు చెందిన ఆతని తండ్రి వరదయ్యా యింట్లో పాలేరుగా పనిచేస్తూ చనిపోతే ఆ స్థానంలో జీతగాడుగా చిన్నప్పుడే కుదిరిపోయాడు. అప్పుడతని వయసు వరదయ్యా పెద్ద కూతురు త్రిపురసుందరి వయసంత.

ఆ వయసులోనే అతను పాలేరైనందుకు బాధపడలేదు.

పైగా వరదయ్యా పాలేరునని గర్వంతో ఎవరినీ లెక్కచేసేవాడు కాదు. వరదయ్యంటే... వాడికి దేవుడు! అతను నిప్పుల్లో దూకమన్నా దూకేస్తాడు. వరదయ్యా మాటంటే వేదవాక్కు.

అతను మాతంగిని ఎంతగానో ప్రేమించాడు. పెళ్ళికూడా చేసుకోవాలనుకున్నాడు. కాని ఆమె శివదాసుపైన మనసు పడ్డది. అదే సహించలేడు మునెప్ప. తన తెగకు చెందిన మాతంగి మట్టితెగకు చెందిన శివదాసును ఎలా మనువాడుతుందో అదీ చూద్దాం అన్న పట్టుదలతో వున్నాడు.

ఆమె మనసును తనవైపుకు ఆకర్షించాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. అవి అన్నీ విఫలమైపోయాయి. శివదాసుపైన ద్వేషాన్ని పెంచుకున్నాడు. ఎప్పుడైనా వంటరిగా ఆమె దొరికినప్పుడు ఆమె శీలాన్ని దోచేస్తే చచ్చినట్టు తననే పెళ్ళాడుతుందని కూడా ఆలోచించాడు. అదొకటే మార్గంగా తోచిందతనికి.

ఇప్పుడు ఆ అవకాశం దొరికిందనుకున్నాడు. వనలక్ష్మిలా అక్కడ కూర్చొని వున్న మాతంగిని చూసి అతని మనసు ఆనందంతో కేరింతలు కొట్టింది.

అదేదీ గమనించని పరధ్యానంలో మునిగివుంది మాతంగి. బురదలో పొర్లాడుతున్న పందుల్లో ఒక పోతుపంది మరో పందిమీద పడుతుంటే... అది ఛీ పెడుతూ దాన్నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తోంది.

తన భుజంపైన ఏదో స్పర్శ కావడంతో వెనక్కి తిరిగి చూసింది మాతంగి.

ఎదురుగా కామం నిండిన కళ్ళతో ఆర్తిగా ఆమె కళ్ళలోకే చూస్తూ... వికారంగా పళ్ళు యికిలించి నవ్వుతూ కనిపించాడు మునెప్ప.

"నాకంటే... శివదాసుగోడెందులో గొప్పే నీ యబ్బుడాలా! నాకంటే మొనగోడా ఏందీ? వరదయ్యా పెద్ద పాలేరుని. ఆయన కాడ నాకెంతో పేరుండాది. వోడికేముండాదే నా బూసడా! నేనెంత సెప్పినా మిడిసిపడతా వుండావే బూసడేకే యిప్పుడెవురొస్తారో చూస్తానే''

వడిసి పట్టుకోబోయాడు.

పక్కకురికింది ఆమె! సహాయంకోసం చుట్టూ చూసింది.

కనుచూపుమేరలో ఎక్కడా మనిషి జాడే కనిపించలేదు. ఇంక ఈడి సేతిలో తప్పించుకునేదెట్లా? అనుకుంటూ పులిని చూసిన లేడిలా వణికిపోయింది.

అయినా లేని ధైర్యాన్ని తెచ్చుకుంది. "ముండనా బట్ట! అరగాసు నాబట్ట! నా జోలికి వచ్చినావంటే... పొరకతో కొట్టేస్తా."

మునెప్ప రెచ్చిపోయాడు. ఆమె తప్పించుకుని పరుగెత్తబోయింది. కానీ అంతలోనే ఆమె పైటను పట్టుకొని తనవైపుకు లాక్కున్నాడు.

సాలెగూడులో చిక్కుకున్న ఈగలా... అతని కౌగిలిలో నలిగిపోతూ గింజుకుంటోంది.

రానురాను బలిష్టమైన అతని కబంధ హస్తాలు బిగుసుకుంటున్నాయి. ఆమెకు ఏడుపొచ్చేసింది.

శరీరంలోని ఎముకలు పటపటలాడాయి!

ఎక్కడలేని నిస్సత్తువ!

"నీకు దండంపెడతా! నన్నొదిలెయ్యి. నీకాళ్ళు పట్టుకుంటా... నన్ను నాశనం సెయ్యొద్దు''

చేతులెత్తి ప్రార్థించింది.

అతని గుండె కరగలేదు.

అతని చేతులు తమకంతో ఆమె శరీరంలోని ఎత్తుపల్లాల్ని స్పృశిస్తున్నాయి. గోర్లతో రక్కుతూ, చేతుల్తో అతని చాతీపై కొడుతూ... అతని నుండి తప్పించుకోవడానికి శతవిధాలా ప్రయత్నిస్తోంది.

కొంతసేపటికి ఆమె ఏమీ చేయలేని స్థితిలో పడిపోయింది. ఏడుస్తూ క్రమంగా నేలకు వరిగిపోతోంది.

సరిగ్గా అదే సమయంలో ఏదో పనిమీద అటువైపు వెడుతున్న శివదాసు ఆ దృశ్యం చూసి నుండిపోయాడు.

ఒక్క ఉదుటున అతనిపైబడి రెండు తన్ని మాతంగిని విడిపించాడు. ఆమె దూరంగా వెళ్ళి నిల్చుంది.

పచ్చి బూతులతో ఒకర్నొకరు నిందించుకుంటూ గుద్దుకుంటూ కొట్లాటకు దిగారు.

కొంతసేపు యిద్దరికీ దొమ్మీ జరిగిన తర్వాత మునెప్ప 'నీ అంతం చూస్తాన'ని అక్కడినుండి పారిపోయాడు.

"నువ్వు రాకుండా వుంటే... ఆ కొవ్వు నాబట్ట నా బతుకు బండల్జేసివుండు శివుడూ! ఎల్లకాలవూ నువ్వే నాకు అండగా వుండు!"

పరుగెత్తుకుంటూ వచ్చి వెక్కివెక్కి ఏడుస్తూ అతన్ని పెనవేసుకుపోయి అంది మాతంగి.

★ ★ ★

పాపయ్య శనగచేను చూడముచ్చటగా వుంది. ఇంక పది పదిహేను రోజుల్లో పంట చేతికందే సమయం. ఆ చేను సిద్దప్ప చేను పక్కనే వుంది. దాన్ని దాటితే మునిరాజు చేను. అన్నీ పక్కపక్కనే.

సాయంత్రం ఆరుగంటలవేళ... పాపయ్య, మునిరాజు తమచేన్లు చూడడానికి అటువైపుగా వచ్చారు.





అక్కడి దృశ్యం చూసి కోపంతో ఊగిపోయారు. అక్కడ ఒక పంది చేను గూరాడేస్తూంది. మోరను నేలలో దూర్చి దున్నుకుంటూ వేరుశనక్కాయల్ని తినివేస్తూ... చెట్లను తిప్పేస్తోంది.

అది మొదట సిద్దప్ప చేన్లో మొదలుపెట్టి మునిరాజు చేన్లో సుమారు రెండు బారల దూరం పంట నష్టం చేసి అలాగే ఆ ప్రక్కనే వున్న పాపయ్య చేన్లో జొరబడి ఒక కొంద్ర మొత్తం చెనిక్కాయలు నమిలి చప్పరించేసింది.

"వొరే... పాపిగా! మేమీడనే వుంటాం. పరిగెత్తా పొయ్యి బరిసె తీసుకోనొచ్చి దీన్ని పొడిసెయ్... మల్లుంటే సూసుకుందాం.

లేకపోతే ఈ పందల్నాకొడుకులు మన ఫలసాయాలు మనకు దక్కనీరు'' ఆవేశంగా అన్నాడు వరదయ్య.

ఆ మాటతో కూతవేటుదూరంలో కనిపిస్తున్న తన పల్లెకు పోయి ఐదు నిముషాల్లో బరిసెతో తిరిగొచ్చాడు పాపయ్య.

"వొగే వేటుకు దేవుడు కనిపించాల" ప్రోత్సహించాడు మునిరాజు.

"వొరే నీయమ్మ జిగుడా! నీ ప్రతాపం సూపించు'' అని ఎప్పుడైతే వరదయ్య కూడా అన్నాడో ఇక అతనిచేత వదిలిన బాణంలా ప్రవర్తించాడు పాపయ్య.

వెంటనే అలికిడి కాకుండా పాపయ్య కంచె మాటుగా చేనులో వున్న పందిని సమీపించాడు.

అది యిదేమీ గమనించడం లేదు. పద్మవ్యూహంలో జొరబడ్డ అభిమన్యుడిలా... నేలను అదేపనిగా దున్నేస్తోంది పంది.

గురి చూసి బరిసెను వదిలాడు పాపయ్య. అది... దాని డొక్కలో దూరి ఈవైపు నుండి ఆవైపు కొచ్చేసింది.

మరుక్షణంలోనే పెద్దశబ్దం చేసుకుంటూ మొదలు నరికిన చెట్టులా పంది నేలకు వొరిగిపోయింది.

వరదయ్య, మునిరాజు అతనివైపు మె

చ్చుకోలుగా చూశారు.

"గూడెం వోళ్ళు సూస్తే ఊరికే వదల్రు ఇబ్బుడేం జేయాల" అన్న అయోమయంలో పడ్డాడు పాపయ్య.

శత్రువును దెబ్బకొట్టడానికి ప్రతి అవకాశాన్ని ఉపయోగించుకుంటాడు వరదయ్య. అందుకే దీన్ని కూడా ఊరికే వదిలేయాలనుకోలేదు.

"ఇద్దో పాపిగా! ఆ బరిసె తీసేసి ఆ పందిని సిద్దుగోని సేన్లో ఏసేయండి.

మరో ఆర్డరేసేశాడు.

"ఎందుకు ఆడ యాడన్నా సేన్లోనో, సెట్లోనో పూడిసేస్తే పోలా?" అభ్యంతరం చెప్పాడు మునిరాజు.

"నీ యెర్రి బుర్రమోయ! సిద్దుగోనికీ పాపిగోనికీ పడదు గదా! పైగా వోని కొడుకు నారాయుడు మిడిమేళంగా నడస్తా, మనల్ను అగుమానంగా మాట్లాడినాడు గదా. పోతే ఈ దెబ్బతో గూడెపోళ్ళు, మేకలోల్ల పల్లోళ్ళు కొట్టుకోని మల్లా మన దెగ్గిరికే న్యాయానికొస్తారు. అప్పుడు మనం చెప్పినట్లు వింటారు'

"ఆ... ఏమి యోశనన్నా నీది''

అతని మాటల ఆంతర్యాన్ని గ్రహించి అన్నాడు మునిరాజు.

సిద్దప్పను మరో దెబ్బ కొట్టబోతున్నందుకు పాపయ్య మాత్రం తెగ ఆనందపడిపోయాడు. అక్కడినుండి వెళ్ళిపోయారు ఆ ముగ్గురు.

★ ★ ★

సాయంత్రం... చీకట్లు పడేసరికి ఉప్పుతోళ్ళ రాముని పందిని మేకలోల్ల పల్లోళ్ళు చంపేశారన్న వార్త గూడెంలో దావానలంలా వ్యాపించింది.

అప్పటికే ఉప్పుతోళ్ళ రాముడు పంది శవాన్ని రచ్చబండ దగ్గర చేర్చి పచ్చి బూతులు తిడుతున్నాడు.

గూడెం ప్రజలంతా క్షణంలో అక్కడ చేరిపోయారు.

పొట్టేలిని తినేశారన్న కసితో ఆ సిద్దప్పే పందిని చంపివేశాడని అందరూ అనుకున్నారు.

అసలు పొట్టేలి పోలేదని కావాలనే పాత కక్షలు మనసులో పెట్టుకొని సిద్దప్పే ఆ దొంగతనం తమపైన వేశాడని గంగడు, తిమ్మడు గూడెం వాళ్ళను నమ్మించారు. ఆ విషయంలో వరదయ్య చెప్పినట్లు వారు తూచ తప్పకుండా గూడెం వాళ్ళను రెచ్చగొడుతున్నారు.

దాంతో గూడెం యువకులంతా కోపంతో ఊగిపోయారు.

ఉప్పుతోళ్ళ రాముడు చచ్చిన పందిదగ్గర తల పట్టుకొని ఏడుస్తూ కూర్చొన్నాడు.

"వొరే ముండనాకొడుకుల్లారా! ఇంకా ఊరికే సూస్తావుండారంట్రా! మీకు సీమూ నెత్తురు లేదూ? మీకు రోసం పాసం లేదూ? మీరసలు ఉప్పు పులుపూ తినడంలేదా? బంగారట్ల పందిని సంపేసినా వోర్సుకోనుండారు! ఈ రోజు ఈ జివ్వమైందీ! రేపు అందరి జివ్వాలు యిట్లే సస్తాయి'' అంటూ ఆవేశంగా తిట్టసాగాడు గంగడు.

"వొరే! ఏవో తప్పొయ్యి సేన్లో బడింది. జివ్వమన్నాకా పడకుండా వుంటుందా? పడింది గదా! నలుగురికీ సూపించి నాయం సేసుకోరాదా? నట్టపరేరం కట్టచ్చుకోరాదా?

వోళ్ళ మేకలు, గొర్రెలు రైతుల సేన్లలో ఎన్ని దినాలు బడలా... వోళ్ళంతా యిట్లే పొడిసేసిరాఏమీ? వొరే! దీన్నిట్లే వదిలేస్తే రేపు మనల్ను కూడా సంపేస్తారా... వరదయ్యలాంటోళ్ళు మనకు అండగా వుండారు. భయమెందుకు? లెయ్యండ్రా! వోళ్ళంతు సూత్తాం"

మాటల్తోనే గూడెం వాళ్ళ రక్తంలో ప్రతీకారాన్ని నూరిపోస్తున్నాడు తిమ్మడు.

"వొరే!... బిడ్నే సాకినట్లు సాకిన్నాన్రా



దీన్ని! చింతగింజలు తవుడు, కొనక్కొచ్చి పెట్టినా. అట్టా దాన్ని సంపేసినారు గదరా! రండ్రా! నాకు న్యాయం సేయండ్రా''

పైకి లేచి పంది శవాన్ని భుజాన పెట్టుకొని ఏడుస్తూ... అడుక్కున్నాడు రాముడు.

దాంతో పగా ద్వేషం వారిలో రగులుకుంది. ఆడా, మగా, పిల్లా జల్లా అందరూ అరుచుకుంటూ మేకలోల్ల పల్లెవైపు కదిలారు.

ఉప్పుతోళ్ళ రాముడు చచ్చిన పందిని సిద్దప్ప ఇంటి ముందరవేసి తిట్టసాగాడు.

"వొరే నా కొడుకుల్లారా! ఈ పందిని మీరే పెట్టుకోండి. మాకు జివ్వం రేటు కట్టియ్యండి లేదా మీ అంతుసూత్తాం" పిచ్చిగా అరిచాడు రాముడు.

"ఊరికనే పొట్టేలి పోయిందని పంచాయిదా సేసి మమ్మల్ని దొంగల్ని సేసింది సాలక, మా పందిని సంపేస్తారండ్రా. ఇంక మీ గొర్రెలు, పొట్టేళ్ళు పోకుండా సూసుకోండి''

ఛాలెంజ్ చేస్తున్నట్లు అన్నాడు తిమ్మడు. మిగిలిన గూడెం వాళ్ళు అందరూ వారికి వంతపాడసాగారు.

ఆ ఊరి ప్రజలు క్షణంలో అక్కడ చేరిపోయారు. కొందరు పెద్దలు గూడెం వారికి సర్దిచెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. పంచాయితీ చేసి న్యాయం చేసుకోమన్నారు.

అయినా గూడెం వాళ్ళు వినలేదు. ఇంకా రెచ్చిపోయారు.

ఇంతలో నారాయుడు ఇంట్లోనుండి బయటకు వచ్చాడు. అతన్ని చూడగానే గూడెం ప్రజలు పేట్రేగిపోయారు.

గూడెం యువకులు గోచీలు బిగించారు. వారి ఆడవాళ్ళు తిడుతూ అతని మూతి పొడుస్తున్నారు చేతులు తిప్పుతూ.

"ఏం పోయే కాలమొచ్చిందిరా! ఇది మీరు సేయాల్సిన పనండ్రా?" నిలదీసినట్లడిగాడు తిమ్మడు.

అంతవరకూ ఓర్చుకొని వున్న నారాయుడు ఇక ఆపుకోలేకపోయాడు.

"వొరే దొంగ తిమ్మా! ఏందిరా కూసినావు? నీకు నేను కొడుకునా? దొంగలకు పుట్టినోన్నా? నీవేరా దొంగనాకొడుకువి!" ఆవేశంతో రొప్పుతూ మాటకు మాట అనసాగాడు.

"వరే! కన్నోడికి (అనామకుడకి) పుట్టిన్నా కొడకా... నువ్వేరా దొంగలకు సొచ్చంగా పుట్నోడివి. దొంగసాటుగా పందిని యేసిసినోడు దొంగగాక సంసారవుతాడా?" ఎగబడ్డాడు తిమ్మడు.

"ఎవురు దొంగలైందీ ఈ జగతికి తెలుసురా నా కొడకా''

"మళ్ళా అదే మాటంటావురా, దొంగ వెధవా''

గోచీ బిగించి కొట్టాటకు కవ్వించాడు తిమ్మడు. ఆ మాటతో ఒక్క ఉదుటున తిమ్మనిపై కురికి గబగబ రెండు దెబ్బలు వేసేశాడు.

అంతే గూడెం వాళ్ళు నారాయుడిని చుట్టుముట్టారు. తమ ఊరికొచ్చి తమ వ్యక్తినే అలా నిర్దాక్షిణ్యంగా కొట్టడంతో ఆ ఊరి ప్రజలు సహించలేకపోయారు.

తత్ఫలితంగా అక్కడ గూడెం వాళ్ళకు ఆ ఊరి ప్రజలకు రణరంగం జరిగింది.

తలలు పగిలాయి! నెత్తురు చిమ్మింది. కేకలు మిన్ను ముట్టాయి!!

ఆ ఊరి ప్రజలు మూకుమ్మడిగా మీదబడి చితకదన్నడంతో భయపడి పోయిన గూడెం ప్రజలు రక్తం కారుతున్న శరీరాలతో తమ తమ ఇళ్ళకు పారిపోయారు.

★ ★ ★

ఆనాటి సాయంత్రం అన్నాలు తినే సమయంలో "ఈరోజు ఊరిమద్దిస్తం పంచాయిదా (పంచాయితీ) ఉండాది. వొగ్గెడివు (ఒక ఘడియ) అందురూ అట్ట వచ్చి పోవాల్సిందో




చ్చ..." అన్న కూత వినిపించింది.

గూడెం పెద్దలు ఊరివిషయం ఉమ్మడిగా మాట్లాడడానికి ఆ కూత వేయించారు.

ఆ కూత వేసిన కొద్దిక్షణాల్లోనే రచ్చబండ దగ్గర అందరూ చేరిపోయారు.

చింత చెట్టుకింద రచ్చబండపైన గూడెం పినపెద్దనాగన్న, ఉప్పుతోళ్ళ రాముడు, క్రరోడు వంటి పెద్దలు, రచ్చబండ కెదురుగా నేలపైన ఊసాలగాడు, తిమ్మడు, రత్తయ్య, మరికొందరు ఊరిజనాలు కూర్చొని ఉన్నారు.

శివదాసు, రెడ్డన్న, కిష్టుడు వంటియువకులు, నేలపైన కూర్చున్నవారి వెనక వలయాకారంగా నిలబడివున్నారు. లారిలోనే వరదయ్య జీతగాడు మునెప్పా ఒకదుడ్డు క్రర చేతబట్టుకొని నిలబడివున్నాడు.

"ఏమిరా తిమ్మడూ! అందరూ వచ్చినారా?" అడిగాడు నాగన్న.

నేలపైన కూర్చొని వున్న తిమ్మడు "రంగసాని తప్ప అందరూ వచ్చినట్లే అన్నా" అన్నాడు.

"ఆయమ్మ ఆరితీరి వచ్చేటప్పటికి పెట్టకోడి కూతేసేట్టుగా వుండాదిగానీ... యింగ మొదులు పెట్టండబ్బా!" అసహనంగా అన్నాడు ఉప్పుతోళ్ళ రాముడు.

"ఓc... అట్టనొద్దబ్బా రాcవుడూ! ఆశారం ఆశారమే. అయినా ఆయమ్మి ఈడికొచ్చి కూర్చొని పచ్చిగడ్డపారలు (గునపాలు) ఏమీ వంచేదిలేదుగానీ పట్టం కట్టుకున్న బోయసానిగదా. ఉండితీరాల్సిందే" నిక్కచ్చిగా అన్నాడు నాగన్న.

"అద్దో! ఆడొస్తావుంది సూడబ్బా మిటుకులాడి... నీయబ్బడాలా! బిన్నే రాయే రాణీ!" అంటూ నవ్వుతూ ఆహ్వానించాడు క్రరోడు.

"ఆc... నీదంతా బలే బడాయి మాcవా... వచ్చేసినాగదా! ఇంకగానీ" అంటూ వెళ్ళి అతని పక్కన కూర్చుంది రంగసాని రంగమ్మ.

"యింగేమన్నా... యీడ అందర్నీ సేర్పిన కారణవేందో సెప్పండనా" అందర్నీ తిలకిస్తూ అన్నాడు రాముడు.

"అందరికీ తెలిసిందేగదా! ఎవరో వొగరు ముందు అట్టనండబ్బా. ఆనేక (ఆ తర్వాత) అందరూ మాట్లాతారుగానీ బండి కదిలించండీ"

మిగిలిన పెద్దల్ని ఉద్దేశించి అన్నాడు నాగన్న.

"సరే! ఎవురు సెప్తే ఏముండాదిగానీ... నేను సెప్తాలేబ్బా!" అని అందర్నీ మరోసారి చూసి "అందరూ బాగా యినండబ్బా! యిని గ్యేcవనానికి (జ్ఞాపకానికి) పెట్టుకోండి. వచ్చే మంగళోరం మన కులదేవత మాతమ్మకు జాతర జరపాలని అందరూ అనుకోనీ అందర్నీ రప్పించిండేది. పెతి సంవత్సరము ఆడిమాసంలో అమ్మోరుకు యాటలు కొట్టి జాతర జరపడం మన కులాశారంగదా... నాగన్నా! యింగ మాట్లాడబ్బా"

అది చెప్పడంవరకే తన బాధ్యతన్నట్లు ఆ మాటలతో మౌనం వహించాడు రాముడు.

"జాతర జరిపించాలంటే శానా ఖర్చవుతుందిగదా... కనీసం ఇంటికొక పందిగున్నన్న తెగాల. గంగమ్మ దెగ్గిర వొగపొట్టేలి, ఈ ఈధిలో సత్తెమ్మకు ఒక గొర్రెను కొట్టాల.

దీనికంతా యింటికింతా అని పంపకం (చందా) ఏసుకోవాల. ఆ పంపకం రేపాదారం సంతనాటికి అందరూ ఇచ్చేయాల" వివరించాడు నాగన్న.

"ఈ కరువుకాలంలో జాతరంటే... కష్టంగదా పెద్దమ్మ (పెదనాన్న). ఎవురికీ ఈడ సంబళాలు (జీతాలు) లేవు. వరుంబడి (ఆదాయం) అంతకన్నా లేదు" అడ్డుపుల్ల విరుస్తూ అన్నాడు శివదాసు.

"వారేబ్బా! నువ్వు పెదిదానికీ యిరుడ్డంగా (విరుద్ధంగా) మాటాడతావేందీ!" కసురుకున్నట్లన్నాడు నాగన్న.



"అదిగాదు పెద్దయ్యో! జాతరంటే ఇంటికో పందిగున్న... అది సాలకా మళ్ళా యాభయ్యో, అరవయ్యో పంపకం... యాడుండే బందుగులు ఊర్లోదిగి ఆ రెండుమూడు దినాలు... తెచ్చుకున్న తునకలు (మాంసం) అయిపోయిందాకా ఉండితినేసిపోతారు. పదిరోజుల బత్తెం... ఆ రెండు మూడు దినాలకే అయిపోతాయా? అన్ని దినాలూ పనీపాటూ బింద (ఆగిపోవడం). తిండిలేని కాలంలో మనకే ఎందుకు అంతఖర్చు''

జాతరవల్ల గూడానికి జరిగే నష్టాన్ని గురించి ఏకరువు పెట్టాడు శివదాసు.

శివదాసు ఏది చెప్పినా మునెప్పకు కంటగింపుగా ఉంటుంది. అందుకే నలుగురి ముందరా ఏమీ అనలేక నిప్పులమీద నిలబడినట్టు నిలబడి అసహనంగా చూడసాగాడు.

"వారే నాయనా! ఎన్నో యేండ్ల బట్టీ ఇది పెతి ఆడిమాసంలో తప్పించకుండా జరిపే యేడిక. దాన్నొదులుకుంటే యట్టరా సామీ?" అంతవరకూ నేలపైన మౌనంగా కూర్చుని వున్న తిమ్మడన్నాడు.

"నెన్న లేక మొన్న మన కండ్లముందర పుట్టిన పిల్లనాకొడుకులంతా ఇట్టాంటి వాటికి ముగసరు (ఇష్టపడరు)గానీ... జాతర జరిపితీరాల్సిందేనని మా మునాస (కోరిక, ఇష్టం)" వత్తాసుగా అన్నాడు ఊసాలగోడు.

దాంతో మునెప్పకు కాస్త ధైర్యం వచ్చింది. ఆపైన ఊరుకోలేకపోయాడు.

"ఎవురెంత మిడిమేళంగా మాట్టాడినా జాతర మాత్రం జరపాల్సిందే మామా!" చేతిలో దుడ్డు కర్రను ఒక్కసారి పైకెత్తి నేలను కొట్టి చెప్పాడు.

ఆ మాటతో అందరూ ఏకకంఠంగా 'జాతర జరగాల్సిందే' అన్నారు.

ఆపైన శివదాసు ఏమీ మాట్లాడలేకపోయాడు.

అంత భారీ ఖర్చునుంచీ గూడాన్ని రక్షించాలని అతని తాపత్రయం. కానీ ఎవరూ అతన్ని సమర్థించకపోవడంతో 'అందరికీ అయిందే నాకూ అయిందీ. అర్థం చేసుకోలా మూఢజనం... పోనీలే అనుకుంటూ ఇంటిముఖం పట్టాడు శివదాసు.

అతని ఓటమిని చూసి చిన్నగా నవ్వుకున్నాడు మునెప్ప.



అనుకున్న ప్రకారం. ఎక్కడుండే బంధువులూ జాతరకు రెండురోజులు ముందుగానే గూడెంలో దిగిపోయారు.

జాతర సందడి ప్రారంభమైపోయింది.

ఎవరిముఖంలో చూసినా జాతర ఉత్సాహం, ఆనందం.

రచ్చబండ దగ్గర నడివీధిలో వున్న సత్తెమ్మకు ఆరోజు ఉదయమే ఒక గొర్రె తెగింది. ఆ వెంటనే మాతమ్మగుడి దగ్గిర ఒక పొట్టేలి బలైపోయింది.

ఇంటింటికీ ఒక పందిగున్న చొప్పున తెగిపోయింది. పంది మాంసంలో ఒకభాగం, గొర్రె తలా కాళ్లు పట్టం బోయసాని ఓబం కింద ఉచితంగా రంగసానికి అందజేశారు.

ప్రెసిడెంటు భాగంగా పొట్టేలి తలా కాళ్లు వరదయ్య ఇంటికి చేర్చబడ్డాయి.

గూడెంలో... ఆపూట ప్రతి ఇంటిలోను మాంసం ఉడికింది. దోసెలు కాలాయి. అవి చాలక రకరకాల పిండివంటలు తయారు. ఉన్నది ఒక్కతే అయినా రంగసానికి బోలె

వంత మాంసం దక్కింది. అంత మాంసాన్ని ఏం చేసుకోవాలో అర్థంగాక కొన్ని పందివా ళ్లు, కొంత మాంసం మాత్రమే వండుకొని మిగిలిన మాంసం కొంత ఎండేసుకుంది. గొర్రె తలను వరదయ్య ఇంటికి చేర్పించి, కాళ్లు మాత్రం బాగా కాల్చి అటకపైన కుండలో దాచుకుంది.

ఆ మంగళవారం... సాయంత్రం మూడు గంటలనుంచే జాతర సంబరం ఆరంభ మైంది.

మాతమ్మగుడి దగ్గర ప్రజలు వందలు వేలుగా చేరిపోసాగారు.

డప్పులు, మేళాలు, రకరకాల డుముకు లు, కొమ్ములు వంటివాద్యాలు అవిరా మంగా మోగుతూనే వున్నాయి.

ఒకవైపు పొంగళ్లు పెట్టుకునేవాళ్లు.

మరోవైపున రకరకాల అంగళ్లు... రకర కాల జూదాలు.

పిల్లా జల్లా, ముసలీముతకా అన్ని వయ సులవాళ్లు... ప్రదర్శించే వివిధరకాల కళా రూపాలు ఉండనేవున్నాయి.

ప్రభలతో అలంకరించిన సప్పరాలు తిప్పేవాళ్లు, గగ్గిరెట్టలు అనబడే పెద్దపెద్ద వలయాకారపు మువ్వల్ని చేతికి తగిలించు కొని పంబలకనుగుణంగా యువకులు నర్తించే చెలమ్రాల ఆటలు... కావడిని భుజా లపై తిప్పుతూ నర్తించేవాళ్లు, కాగడాలు, కత్తులు తిప్పుతూ ప్రదర్శనలిచ్చేవాళ్లు. కట్టె వరుసలు... కీలుగుర్రాలు... కొజ్జాల నృత్యా లు... మలిఅడుగులు... గంగవేషాలు... కో లాట నృత్యాలు, పిల్లనగ్రోవుల నృత్యాలు, చెక్కభజనలు... చెంచునృత్యాలు, యానా దుల చిందులు... మోడీ ఎత్తేవాళ్లు, పల్టీలు కొట్టేవాళ్లు... రంగులరాట్నం తిరిగేవాళ్లు... పీకలు ఊపేవాళ్లు, ఈలలు, కేకలు వేసేవా ళ్లు... అంతా గందరగోళంగా వుంది.

ఆ గ్రామంలో చుట్టుపక్కల పల్లెలనుంచీ ఊరేగింపుగా పానకాలు బండ్లు తోలుకువచ్చే వాళ్లు, ప్రభలతో అలంకరించిన ఎడ్లతేర్లు తీసుకువచ్చేవాళ్లు. వాళ్ళ అట్టహాసం చెప్పన లవి కానట్టుగా వుంది.

జమిలిగడ్డ గూడెంనుంచీ కూడా ఓ ప్రద ర్శన బయలుదేరింది. కొందరు యువకులు "డుబ్బాచుకు... డుబ్బాచుకు'' అని వడ్డి పలకలనబడే మట్టి డుముకుల్ని వాయి స్తుంటే ఊసాలగాడు "వద్దురా సిద్దులయ్య యిద్దరు పెండ్లాలొద్దురా. దానికి బెడితే దీనికి కోపం దీనికి బెడితే దానికి కోపం... వద్దురా సిద్దులయ్యా.. డుబ్బాచుకు... డుబ్బా చుకు'' అంటూ లగువుగా చిందులు తొక్కు తూ ఎగురుకుంటూ వస్తున్నాడు. వారివెంట గతంలో ఎప్పుడో మాతమ్మలుగా ముద్దరేసి బసివినులుగా మార్చబడిన ఇద్దరు ఆడవాళ్లు తమ నడుములకు వేపమండలు చుట్టుకొని, కాళ్ళకు గజ్జలు కట్టుకొని చిందులు తొక్కు తూ వస్తున్నారు.

అలా నిమ్నకులాలవాళ్లున్న ప్రతి ఊరి నుంచీ ఏదో ఒక కళారూపం. దాంతోబాటు... ఒకరిద్దరు మాతమ్మలు ఊరేగింపుగా పొద్దు గుంకేవేళకు మాతమ్మగుడికి చేరుకుంటున్నా రు. అక్కడ...

మాతమ్మ గుడికి చుట్టుపక్కల చెట్లు నిండా రంగురంగుల సీరియల్ బల్బులు అలంకరించబడివున్నాయి.

వాటి వెలుగుల్లో... మాతమ్మ విగ్రహం శోభాయమానంగా కనిపిస్తోంది.

ప్రతి సంవత్సరమూ ఆ ఊరి ప్రసిడెంటు పంపే పసుపుచీరతో తలలేని ఆ నగ్నవి గ్రహం... సగంవరకు కప్పబడివుంది.

ఆ చెట్ల చుట్టూ పల్లెలనుంచి వచ్చిన పానకాల బండ్లు, ప్రభల బండ్లయిన ఎడ్ల బండ్ల తేర్లు ప్రదక్షణం చేస్తున్నాయి.

బెల్లం కలిపిన పానకం నీళ్ళను ఆ బండ్లపైనున్న వ్యక్తులు గ్లాసుల్తో దాహం అని వచ్చినవారికి అందిస్తున్నారు.

అక్కడ అంతా కోలాహలం.

గందరగోళం...

చెవులు చిల్లులుపడే హెూరు.

గంగమ్మకు బలివ్వడానికి పట్టుకొచ్చిన ఒక దున్నపోతు అక్కడే ఒక చెట్టుకు కట్టివే యబడి, ఒక చీకటి తునకలా నల్లగా కని పిస్తోంది.

ఆ గుడిముందర... కొందరు స్త్రీలు పూనకం వచ్చి ఊగిపోతుంటే అక్కడున్న చాకలి పూజారులు... "ఆc! వసే భ్రష్టు ముండా! ఏ దయ్యానివే... గంగమ్మ ముందర్నా నీ చిందులు. ఈయమ్మ నిన్ను మించిన పెద్ద దెయ్యం. దెయ్యాల్ని మింగే దేవత. పో దిగిపో' అంటూ అమ్మవారి 'బండారు'ను వాళ్ల నుదుటన దిద్దుతున్నారు.

ఆ బండారు బొట్టుతో కొందరు చల్లబడిపో తే మరికొందరు రెచ్చిపోయి ఊగిపోతున్నా రు. అలా రెచ్చిపోతున్న వాళ్ళలో రంగసానీ వుంది. రంగసాని పూనకం వచ్చి "ఊc... నేనే దేవతరా! ఊc... నేనే ఈ మాత నురా..." అంటూ ఎగిరెగిరి గంతులేస్తూ చిందులు తొక్కుతోంది.

ఆ చుట్టపక్కల హరిజనవాడలనుంచీ, వడ్డిగూడాలనుంచీ వచ్చిన దాదాపు పది మంది బసివినులు ఆమె చుట్టూ వేపమండ ల్ని చేతబట్టుకొని వలయాకారంగా నిలబడి చిందులు తొక్కుతూ నర్తిస్తున్నారు. వారిలో సగంమంది కల్లు తాగివున్నారు. అందుకే పిచ్చిగా గంతులేస్తున్నారు. వారిలో ఒకరిద్ద రు బసివినులుగా మారడానికి రంగసానే కారణం! వారు ఎగురుతుంటే ప్రజలు విరగ బడి చూస్తున్నారు. వంటిమీద గుడ్డ జారిపో తున్నా కూడా వాళ్లు అదేమీ గమనించడమే లేదు. గంతులేస్తూనే అక్కడి ప్రజలకు వినో దాల విందులు చేస్తున్నారు.

అలా కొంతసేపటికి వారి నర్తన ఆగి పోయి, ఆ ప్రదేశంలో మైకు ఏర్పాటు చేయబ డింది.

ఆ మైకు ముందర ఆసాది ఆదన్న జమిడిక చేతబట్టుకొని, మరిద్దరి వంతగాళ్లతో ప్రత్యక్షమయ్యాడు. అతను రాజులకా లంనాటి వేషంలో, తలపాగా ధరించి 'టిం... టిం..." అంటూ శబ్దంచేస్తూ జమిడికను వాయిస్తుంటే ఇంచుమించు కొద్దిపాటి తే డాతో అవే వేషాలు వేసుకొని గుమ్మెతల వంటి ఆకారాల్ని చంకన తగిలించుకుని వాయిస్తూ... అతని జమిడిక శబ్దంతో శ్రుతిక లుపుతూ వంత పాడుతున్నారు వంతగాళ్లు.

ఆసాది ఆదన్న ఎంతో ఉత్సాహంగా, శ్రావ్యంగా జమిడిక వాయిస్తూనే గంగమ్మ పుట్టుపూర్వోత్తరాల్ని, మధ్య మధ్య శృంగారా త్మక పిట్టకథల్ని, బూతుమాటల్ని చేర్చి రసరమ్యంగా కథ చెప్పి ఒప్పించాడు.

ఆసాది ఆదన్న కథ ముగిసే సమయానికి తెల్లవారుజామైంది. దాదాపు అదే సమ యంలో మాతమ్మ పూజ ముగిసింది. ఆ వెంటనే పొడుగాటి వేటకత్తితో తలారి రాము డు మూడు దెబ్బలకు దున్నపోతు మెడ నరికేసి శభాష్ అనిపించుకున్నాడు.

నేల తెగిపడిన దున్నపోతునోట, దానికా లిగిట్టను కోసి కరిపించి, దానినెత్తిన దీపం పెట్టారు. ఆ తర్వాత మాదిగమల్లన్న దానిపొ ట్ట కోసి, కొత్త చేటలోకి కసురుతీసి ఆకాశానికి ఎగజల్లాడు.

ఆ వెనువెంటనే మరికొన్ని గొర్రెలు, పొట్టే ళ్లు తెగాయి. వాటి తర్వాత లెక్కలేనన్ని కోళ్ల గొంతులు కసుక్కు కసుక్కుమని తెగిపో యాయి.

అలా తెగిన సగంకోళ్ళ తలల్ని భక్తులు, తమ కోర్కెల్ని నెరవేర్చమని కోరుతూ విగ్రహం పైనున్న చంద్ర చెట్టులోకి ఎగురవేశా రు.

ఆ సమయంలో రక్తం ఓడుతున్న కోడిత లల్నే కాయలుగా కాసిన వింత చెట్టులా చంద్రచెట్టు ప్రకాశిస్తోంది.

అక్కడ... రక్తం కాలువ గట్టింది.




పరిస్థితి భీభత్సంగా మారింది.

ప్రజలు... అలా జాతరను భక్తిశ్రద్ధలతో జరుపుకున్నారు. అందరితోబాటుగా జమిలిగడ్డ గూడెం ప్రజలూ ఆ జాతర్ని చూసి తరించిపోయినట్లు భావించుకున్నారు.

అలా... అక్కడికి వచ్చి భావించుకున్నవారిలో రెడ్డమ్మ, నాగమ్మలున్నారు.

వారితోబాటుగా మాతంగీ, శివదాసులూ వున్నారు. ఆవిధంగా ఆ గ్రామస్తులంతా రెండురోజులు ఆనందంగా జాతర వేడుకలు చేసుకుని, తిరిగి తమ తమ పనుల్లో మునిగిపోయారు.

★ ★ ★

"ఎంత సేపయిందిరా శివుడూ వచ్చి?"

"ఇబ్బుడేలే కూసో"

పాపయ్య పందిని చంపేసినచోట ఒక రాతిపైన కూర్చొని అతని కోసమే ఎదురు చూస్తున్న శివదాసు ఎదురుగా వున్న మరో రాతిని చూపిస్తూ అన్నాడు.

ఎదురుగా కూర్చున్నాడు నారాయుడు.

"ఎందుకురా అర్జంటుగా రమ్మన్నావంటే నే?"

'ఏమీ లేదురా! రాత్రి గలాటా జరిగిందిగదా! దాని గురించి మాట్లాడదామని..."

"ఏందిరా మాట్లాడేది? మీ వోళ్ళంతా వచ్చి మాపైన బడినారు'' కోపంతో నారాయుడి కళ్లు ఎరుపెక్కాయి.

"కోప్మెందుకురా? అట్లా సూస్తావుంటే దీనెనకనేదో కిటుకు వున్నట్టుందిరా. అది తెల్సుకుంటేగానీ ఎన్నో ఏళ్లనుంచీ మీకూ మాకూ వస్తావుండే ఈ రంపులూ రాగింతాలు మానిపోవురా''

"నిజంవే! నాకూ అట్లే అనిపిస్తావుండాది. కానీ మీ వోళ్లు నన్ను సెప్పనిస్తేగదా! వగేల సెప్పినా తెలుసుకుంటే గదా?"

"వోరే రాముని పందిని మీరేమైనా సంపినారా? లేదా?"

"నువ్వు గూడా అట్లంటే ఎట్లారా? మా గోవుల్నాచ్చిగా మేము ఎయ్యాలా. మా నాయన మూడు రోజులైంది ఊరికి పొయ్యి. ఈ రోజుక్కూడా రాలా. నేను నిన్న సందేలదాకా బాయికాన్నే ఉండి పూడిసినా... ఆ పంది సంగతే మాకు తెలీదు'' అసలు విషయం చెప్పాడు నారాయుడు.

"అదే... ఆడనే వుండేది కిటుకంతా. పాపయ్య సేను, మున్రాజు సేను సూసినావా?"

"లేదు''

"సరే లెయ్యి, సూతాం"

ఇద్దరూ పైకిలేచి పక్కనే వున్న చేన్లోకి నడిచారు.

శివదాసు, నారాయుడు చిన్ననాటి స్నేహితులు. ఎలిమెంటరీ స్కూల్లో చదువుకునేటప్పుడు క్లాస్‌మేట్స్ కూడా.

శివదాసుకు తగినంత ఆర్థిక స్థోమతులేక చిన్నప్పట్నుంచే మట్టిపనుల్లో దిగిపోయాడు.

నారాయుడు మాత్రం స్కూల్ ఫైనల్‌వరకూ చదువుకొని వ్యవసాయం చేసుకుంటున్నాడు. ఆ ఇద్దరూ ప్రాణస్నేహితులు కాకపోయినా వారి మధ్య మంచి స్నేహభావమే వుంది.

ఈ రెండు పల్లెల ప్రజలు ఎన్నోసార్లు ఏదో సాకుతో కొట్టుకొని చచ్చినా వారి స్నేహం మాత్రం దెబ్బ తినలేదు.

ఆ రెండు పల్లెల మధ్య ఎన్నో తరాల నుంచీ వస్తున్న గలాటాలకు శాశ్విత పరిష్కారాన్ని వెదకాలని ఉంది ఇద్దరికీ.

పంది శనగచెట్లు కొట్టేసినచోట ఇద్దరూ పరిశీలనగా చూశారు. పాపయ్య చేన్లో అస్పష్టంగా కనబడుతున్న రక్తపు మరకలు, పంది ప్రాణం పోయేటప్పుడు గింజుకుని చెదరిపోయి వున్న స్థలం అంతా గమనించారు.

పరిస్థితి వారికి అర్థమైపోయింది.

"ఇప్పుడు సెప్పరా? ఈ సేనుగలోళ్ళే సంపేసి దాన్ని మీ సేన్లో ఏసేసి మా వాళ్ళను రెచ్చగొట్టినట్టు అనిపిస్తావుండాది. ఏమంటావ్?" ప్రశ్నించాడు శివదాసు.

"నిజంవే"

"ఆ పాపిగోనికీ మీకు కాదుగదా! వోడే సంపేసి దాన్ని మీ సేన్లోకి ఏసేసుంటాడు"

"నిజంవే?"

"ఇప్పుడర్థమైందా? శత్రువులెవరో?

ఇంగొకమాట కూడా సెప్తా ఇనుకోరా. మ ఆడబిడ్డ మంగమ్మ చావు వెనక కూడా ఇట్టాంటి కిటుకే ఏదో వుండాదని నా అనుమానం.

"నిజమే ఉండచ్చురేయ్" సాలోచనగా అన్నాడు నారాయుడు.

వోరే! మా వాళ్ళూ సదూంసంధ్యాలేని సవట్లు. ఎవురు సారాయిపోసి వొగ రూపాయిస్తారో వోళ్ళమాటే మాట్లాడే అమాయకుల్రా... అది వోళ్ళ తప్పు గాదురా. వోళ్ళనట్లా ఎర్రోళ్లగానే బతకనిస్తావుండే ఈ మడుసుల్దేరా తప్పు"

అని ఆవేశం పెల్లుబికి ఆపైన మాట పెగలక మౌనంగా వుండిపోయాడు శివదాసు.

అంత చెప్పినా నారాయుడికి వారిపైన కోపంపోలేదు.

"నా పొట్టేల్నెత్తుక పొయ్యి తినేసినారుక దా! అట్లా దొంగ పనులు మానుకోవచ్చు గదా!"

"వరదయ్య, మునిరాజు లాంటి ధనవంతులు, అగ్రకులాల వోళ్లు తమ కాలం గడుపుకునే దానికి వోళ్లనట్లా తయారు సేసినారు"

"ఇట్టావోళ్లు మా కులంలోనే గాదురా... మీ కులంలోనూ వుండారు. ఆ మాటకొస్తే ప్రతి కులంలోనూ వుండారు"

"కాబట్టి మనట్లా కోర పిలకాయలంతా సేరి వోళ్లను బాగు సెయ్యాల్రా... మనట్లా వోళ్లలో వుండే ఎస్తక్కవల్ను సరిసేసే వైదు గులం కావాల్రా మనం"

అలా ఆవేశంగా అన్న శివదాసు మాటలు ఆతని కోపాన్ని పోగొట్టి, దాని స్థానంలో వారిపైన దయ, జాలి నింపాయి.

"అయితే యిప్పుడేం సేద్దాంరా" ప్రసన్నంగా ప్రశ్నించాడు.

"మనం ఈ అన్యాయానెదుర్కోవాల్రా. మనట్లా వోళ్లంతా కులాలు మర్చిపొయ్యి అందరూ వొగిటిగా కూడుకోని వోళ్ల దవుర్జన్యాలకు అడ్డు పడాల్రా. మాయన్న సావుకు, మంగమ్మ సావుకు వెనుక ఉండే కిటుకేందో తెలుసుకోవాల. అట్టా జరక్కపోతే మన్లాంటోళ్లు ఎంతకాలం బతికినా బానిసబతుకు బతకాల్సిందేరా. ఇలాంటి సావులు సూడాల్సిందేరా.

"అందుకే తిరగబడాల... తిరగబడిందానివల్ల మనకు పోయేదేమీ లేదు. వొగ ఎట్టి బతుకులు తప్ప"

ఆతని మాటల్లో ఆవేదనా, ఆవేశం రెండూ ధ్వనించాయి.

"సరేరా! నువ్వు సెప్పినట్లు సేద్దాం" చేతిలో చేయి కలిపాడు నారాయుడు.

★ ★ ★

వరదయ్య మేడ పక్కన గూడెం వాళ్లు వచ్చి ఎత్తిన ఒక బండ్ల పందిరి వుంది. దానికీ మేడకు మధ్య రెండు బారలు వెడల్పుతో పెరటిలోకి వెళ్లేదారి. అలాగే వెడితే పై అంతస్తు కిటికీకి ఆనుకొని మరొక బండ్ల పందిరి వుంది. దానిపైన వరిగడ్డి వాము వుంది. ఆ పందిరిపైకి వెళ్లడానికి అనువుగా ఒక నిచ్చెన ఆనించబడి వుంది.

ఆ రాత్రి!

యథాప్రకారంగా పనులు ముగించుకొని భోంచేసి పడుకోవడానికి ప్రయత్నించాడు మునెప్ప.

తన ఈత చాప, పాత దుప్పటి, మురికి




దిండు చుట్టి సంకన పెట్టుకొని వచ్చి ఆ సందులో పడకవేశాడు.

గొడ్లకు గడ్డి వేయడానికి, నిచ్చెన గుండా పందిరి పైకి వెళ్లి అయిదారు వరి గడ్డి కట్టలు వామెలో నుండి పెరికి కిందవేశాడు. దిగి వచ్చి కిందవేసిన వరిగడ్డి కట్టల్ని రెండు చేతుల్తో ఎత్తుకొని వెళ్లి... అక్కడున్న పశువులకు వేశాడు.

ఆ తర్వాత పగలంతా పొలం పనులు చేసిన ఎద్దులకు మాత్రం చెరకు తోటలో కోసి తెచ్చిన పచ్చిగడ్డిని వేసి వచ్చి, ఆ పాత ఈత చాపను పరచి, దిండుపైన దుప్పటి వేసికొని పడుకున్నాడు.

అది వేసవికాలం కావడంతో ఉక్కపోస్తుంటే చొక్కా తీసి పక్కన వేశాడు. అయినా ఆతనికి నిద్రరాలేదు.

ఆకాశంలోని చుక్కల్ని చూస్తూ ఆలోచిస్తున్నాడు. "ముప్పయేండ్లయి పోతావున్నా మనువయ్యే బాగ్గెవే కనిపించలా... వరదయ్యా పట్టించుగోడు. ఆ మాటెత్తితే ముత్తాతల కాలంనుంచీ వస్తావుండే అప్పు తీర్చమంటాడు. అదే ఎంతుందో తెలీదు.

ఎంతసేపూ 'ఆ పని బాగలా... ఈసారి యగసాయంల ఫలసాయం తక్కువైందీ, ఊరికే దున్నపోతు మాదిర్తో వొళ్లు పెంచుకోవడమేగానీ ఏవీ లాభం లేదు' అని దినొమ్ము ఏదో వొగటంటానే వుంటాడు.

ఏం బతుకో... బానిస బతుకు. వొంటెద్దు చాకిరీ.. వొగ అచ్చటాలా... వొగ ముచ్చటాలా...

పోనీ మాతంగి మనసునైనా తిప్పుకున్నా నా అంటే అదీలా. దీనెమ్మ... యదవ బతుకై పూడిసింది.

మొట్టమొదటిసారిగా బతుకును గూర్చి ఆలోచించ సాగాడు మునెప్ప.

ఒకవైపు బతుకుపైన మరోవైపు మాతంగిపైన ఆతని ఆలోచనలు ఆతనికి బాధని, తాపాన్ని కలిగిస్తున్నాయి.

మాతంగి ఆతని కళ్లకు దేవత.

"అబ్బ దాని కండ్లు, పండ్లు, ఆ ముక్కుతీరు, ఆ మెడ ఆ యిదీ అన్నిటికీ మించి ఆయమ్మి మాట వరస, అబ్బ గూడెంలోనే ఆయమ్మి మాదిరి ఎవురూ లేరుగదా! కడకు రైతులిండ్లలో గూడా కానం. ఆయమ్మి బంగితోట్లో తులసిచెట్టు మాదిరి. అందుకే ఆయమ్మంటే నాకంత యిది.

అయినా ఏం ప్రయోజనం?

నా మనసు మాత్రం ఆయమ్మి మీంద... ఆయమ్మి మనసంతా శివుడిపైనా.. ష్చ...త్తో! ఒక్క నిట్టూర్పు విడిచాడు.

ఆ వెన్నెట్లో వెల్లికిలా పడుకొని తన రెండు చేతులూ తల కిందవుంచి గుండెలు పగిలేలా విరహ వేదనతో నేలపైనున్నాడు మునెప్ప.

సరిగ్గా అదే సమయంలో... మేడ రెండవ అంతస్తులోని చివరి గదిలో లైటు వెలిగింది. తెరచివున్న కిటికీలో నుండి ఒక ఆకారం తొంగి చూసింది.

ఇదేవీ గమనించని మునెప్ప తన వంటరి బతుకుకు పరిష్కార మార్గాలను వెదుక్కుంటూ మగతగా కళ్లు మూసుకొని వున్నాడు.

ఇంతలో అతని గుండెపైన పెదో మెత్తగా ప్రాకినట్లనిపించి కళ్లుతెరిచాడు. అంతే... ఒక్కసారి కెవ్వున కేక వేయబోయి అప్రయత్నంగానే ఆపేసి ఆశ్చర్యంగా చూశాడు

కొంచెం లావుగా మొరటుగా వున్న ఒక నల్లని ఆకారం పక్కన కూర్చొని అతని గుండెలపైకి వంగివుంది.

నిదానంగా చూశాడతను.

విశాలమైన అతని ఎద రొమ్మును తన రెండు చేతులతో నిమురుతూ, తొలగివున్న పైటతో తమకంతో కూర్చొనివుంది ఆ ఆకారం.

ఆమె త్రిపురసుందరి!




ఆ సంఘటన అతను కలలో కూడా ఊహించనిది. ఆమె రంగును... అందాన్ని చూసి ఆమెను పెండ్లి చేసుకోవడానికి ఎవరూ ముందుకు రాలేదు. ఇక చేసేది లేక ఆమె కంటే మూడేండ్లు చిన్నదైన చిన్న కూతురికి కూడా పెండ్లి చేసేశాడు వరదయ్య. ఆమెకిప్పుడు ఒక బిడ్డ కూడా.

అయితే వరదయ్య త్రిపురసుందరికి పెళ్లి ప్రయత్నాలు చేయలేదనీ, ఆమెకు పెళ్లి సంబంధాలు రాలేదనీ కాదు. లెక్కలేనన్ని పెళ్లి సంబంధాలొచ్చాయి.

వచ్చిన ప్రతివాడూ పీకలదాకా మెక్కడం, ఆమెను చూసిన తర్వాత జడుసుకొని పారిపోవడం ఆనవాయితీగా మారిపోయింది.

ఏమీలేని వాడికైనా సరే తన కులంవాడైతే చాలు పెళ్లి చేసి పంపాలని ప్రయత్నాలు చేస్తున్నాడు వరదయ్య.

ఆరోజు గూడా ఆ ప్రయత్నం మీదనే పొరుగూరు వెళ్లాడతను. రోజూ కష్టం చేయడంవల్లా కొంచెం మొరటుగా కనిపించినా మునెప్ప అందగాడే. చిన్నప్పటినుండీ ఎరుగున్నవాడు. పైగా తన యింటి మనిషి. అందుకే గుట్టుచప్పుడు కాకుండా వుంటుందనుకుందో ఏమో ఆతనితో తన కోర్కె తీర్చుకోవాలనుకుంది.

కానీ గతంలో తన వల్లనే బుడ్డన్న మట్టిపాలైపోయాడన్న భయంతో ఇన్ని రోజులు ఆగింది.

ఈ రోజు ధైర్యం చేసేసింది. ఆ వెన్నెల్లో మునెప్ప శరీరాన్ని ఒక్కసారి ఆపాదమస్తకం చూసింది. ఆతని బలమైన కండరాలు ఆమె మనసును పట్టి కుదిపాయి.

ఎత్తైన అతని వక్షస్థలం రేగిపోయివున్న జుట్టు చూసేకొద్దీ ఆమెకు వెర్రెక్కిపోతోంది.

"చిన్నమ్మా! యిదేం పని. ఎవరైనా సూస్తే... యింకేమైనా వుండాదా?" భయంతో వణికిపోతూ లేచి కూర్చున్నాడు మునెప్ప.

"మునెప్పా! నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు వేస్తా. నన్ను కాదనొద్దు... ఈ బాధ నేను భరించలేను. నా సర్వస్వం వదిలేస్తా. ఈ ఆస్తి అంతస్తు ఇవేవీ నాకొద్దు... నీవెక్కడికి రమ్మంటే అక్కడి కొచ్చేస్తాను. నీకోసమేమైనా చేస్తా''

ఆవేశంతో అతని తలను వక్షస్థలానికేసి అదుముకుంటూ అంది.

ఆవేశంతో ఎగిరెగిరిపడుతున్న ఆమె స్తనద్వయం, ఎప్పుడూ స్త్రీ సాంగత్యం ఎరుగని మునెప్పను పిచ్చివాణ్ణి చేసింది.

అతన్ని తీగెలా పెనవేసుకుపోయి అలాగే నేలకు వరిగిపోయింది. త్రిపురసుందరి.

ఎన్నో సంవత్సరాలుగా అణగారివున్న కోరికలు ఇద్దరిలోను ఒక్కసారిగా విజృంభించాయి.

సుకుమారంగా పెరిగిన త్రిపురసుందరి శరీరం ఆ వెన్నెట్లో ఆ చింకి చాపపైన మెత్తగా నలిగిపోయింది.

"ఎంత విచిత్రమైంది కామం!

మానవ జీవితాలతో నిత్యం ఆడుకుంటూనే వుంటుంది.

సింహబలుడైన కీచకునంతటివాణ్ణి నర్తనశాలకు నడిపించి యమపురి కంపించిందీ కామం.

నవగ్రహాలను తన కాళ్ల కిందవేసి, త్రిలోకాలను గడగడలాడించిన రావణ బ్రహ్మంతటివాడిచేతనే సీతనపహరింపచేసి ఆతన్ని సర్వనాశనం చేయించిందీ కామమే.

అహల్య శీలాన్ని దొంగతనంగా దోచుకున్న ఇంద్రుని శరీరాన్ని తూట్లు తూట్లు చేయించిందీ అదే!

అయితే మహాభారత వంశకర్త అయిన వేదవ్యాసుడినీ, ఈ భరత ఖండానికి తన పేరే నిలిచిపోయేంత కీర్తి వహించిన భరతుడినీ అందించిందీ ఈ కామమే.

చరిత్ర ప్రసిద్ధి చెందిన రోమన్ రాజులచేత

రాజ్యాలు, ప్రాణాలు ఒక్క క్లియోపాత్రా పాదాలచెంత పణంగా అర్పింపచేసిందీ ఈ కామమే.

కామానికి కళ్లేకాదు కులం, మత సమాజాంతరాలూ వుండవు.
ఆ లక్షణమే మేడలో పట్టు పరదాల మాటున తిరుగాడే యువతిని నేలకు దింపి ఒక పాలేరు పక్కన పడుకునేటట్టు చేసింది.



అది ఎండాకాలం కావడంతో ప్రతి ఏడులాగే బావులన్నీ ఎండిపోయాయి. పంటలు బాగా దెబ్బతిన్నాయి.

వరదనాయుడు, సాంబయ్య, మునిరాజు వంటి ధనవంతుల బావుల్లో కూడా నీటిమట్టం తగ్గిపోతోంది.

రైతులు తమ బావులకు పూడెత్తించో లేదా అడుగులు ఊడ్పించోలేదా యింకొంచెం లోతు తవ్వించో తమ పంటల్ని కాపాడుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

ఆ ప్రయత్నంలో భాగంగానే... తన బావిలో పూడెత్తే పని సాంబయ్య గూడెంవాళ్ళకు వప్పగించాడు.

గూడెంవాళ్ళు మరికొందర్ని పక్కపల్లెవాళ్ళను కూలీలుగా కలుపుకొని ఆ బావి పని చేస్తున్నారు.

ఆరోజు అందరూ పూడు మన్ను మోసి ముద్దగా తడిసివున్నారు. ఆ సాయంత్రం... పని వదలగానే... వర్షపు నీరు దిగి ఊపిరాడక పుట్టలోనుంచి వస్తున్న చీమలగుంపులా, ఆడామగా అందరూ తమచుట్ట గుడ్డల్ని భుజానవేసుకొని గబగబ... బురద కడుక్కోవడానికి వరదయ్య బావిదగ్గరకు వెళ్ళారు.

మామూలుగా అయితే ఆడవాళ్ళు మగవాళ్ళు వేరువేరుగా బురద కడుక్కునేవారు. కరువుకు బావులన్నీ ఎండిపోయివుండడం చేతా అందరూ ఆ బావికే వచ్చారు.

మగవారు... నాడా డ్రాయర్లలోను, అడ్డ పంచలతోను బావిలో దిగారు.

యువకులు, ఒకర్నొకరు నీటిలో ముంచుకుంటూ, తిట్టుకుంటూ కేరింతలు కొడుతూ అలుపు తీర్చుకుంటున్నారు.

కొందరు స్త్రీలు ఈదేటప్పుడు అడ్డురాకుండాను, తొలగిపోకుండానూ వుండేందుకు పైటల్ని, చీరల్ని, పావడాల్ని పుట్టగోచీలుగా పెట్టుకొని నీటిలో దిగారు.

ఈత వచ్చిన వారు బావిలో ఈదుకుంటుంటే ఈతరాని వారు అంచున దొరువులపైన కూర్చొని కడుక్కుంటున్నారు.

ఆవేళ... పగటి శ్రమను మరచిపోయి అందరూ ఆనందంగా నీటిలో మునుగుతున్నారు.

నును వెచ్చని సాయంత్రపు ఎండలో శుభ్రమైన వారి శరీరాలు మెరిసిపోతున్నాయి.

ఆడవారికి అవకాశం కల్పించడానికి మగవారు త్వరగా కడుక్కొని గట్టుపైకి వెళ్ళి... తమ బట్టల్ని తలపైనా, వీపులపైనా వేసికొని ఆరబెట్టుకుంటూ యింటి ముఖం పట్టారు.

శివదాసుమాత్రం బావిలో... మాతంగి కడుపుకింద తన ఎడమచేయిపెట్టి... కుడిచేతి వేళ్ళు ఆమె వీపున పావడానాడా క్రింద దూర్చి, మునిగిపోకుండా ఆమెను ఆ నాడా సాయంతో ఎత్తిపట్టుకొని ఈత నేర్పిస్తున్నాడు.

"ఓమ్మీ! యీదినం... పట్టుకోను. నువ్వే యీదులాడాల" అన్నాడు ఆమెను సగం బావిలోకి తీసుకెళ్ళిన శివదాసు.

బావిలో పడిపోయినప్పటినుంచీ శివదాసు సహాయంతో మాతంగి ఈత నేర్చుకుంటోంది. అప్పటికే ఈత వచ్చినా, మునిగి పోతానన్న భయంతో, యింకా శివదాసు





సహాయం కోరుకుంటోంది. ఎలాగయినా ఆ భయాన్ని పోగొట్టాలని శివదాసు తాపత్రయం.

"నువ్వు పక్కనేవుండు... మునిగిపోతే పట్టుకోయేం?" నోట్లోకొచ్చిన నీటిని బావిలో ఉమ్మేతూ తన కడుపుకిందవున్న శివదాసు చేతిని సుతారంగా నొక్కుతూ అంది మాతంగి. పావడా నాడాను వదిలేసి... ఈదుకుంటూ ఆమెకభిముఖంగా వెనక్కివెళ్తూ ఆమెను ప్రోత్సహిస్తున్నాడు శివదాసు.

"సేతుల్తో... కడుపుకిందికి నీళ్ళు తీసుకుంటూ... కాళ్ళు పైకెత్తి కొట్టు" అతని సూచన మేరకు అతి ప్రయాసతో... తన రెండు చేతుల్తో రత్నాల రాసుల్ని ఆబగా ముందుకు తోసుకుంటున్నట్లు, నీటిని జరుపుకుంటూ ఈదుతూ కొంచెం కొంచెమే నీటిపైన తన శరీరాన్ని ముందుకు జరుపుకుంటూ వస్తోంది మాతంగి.

అలా ఆమె ముందుకు... అతను వెనక్కి... నీటిలో కదుల్తున్నారు. అప్పటికే ఆడవాళ్ళు తమ పని పూర్తిచేసుకుని గట్టుపైకి వెళ్ళి తమ తడిబట్టల్ని ఆరబెట్టుకుంటున్నారు. కొందరు యిండ్లక్కూడా బయల్దేరారు.

"నన్ను పట్టుకో... యింక నావల్లగాదు..." బావిలో భయంతో ఆయాసపడిపోతూ అంది మాతంగి.

అతనింకా దూరంగా జరిగాడు.

"ఊఁ... కానీ... యింకొంచెందూరమే... మెల్లిగా వచ్చి యీ దరి పట్టుకో... మళ్ళా ఆ పక్కకిపోదాం..."

ఇంతలో ఆమెకు గస పెరిగి... మునిగిపోతూ నోట్లోకి నీళ్ళు రావడంతో... వాటిని తాగడంతో, గగ్గువచ్చింది.

"శివుడూ! శివుడూ!" భయంతో అరిచింది.

ఇంకలాభం లేదనుకున్న శివదాసు వెంటనే వెళ్ళి, ఆమె కడుపు కింద చేయివేసి పైకి తేల్చాలని ప్రయత్నించాడు.

అతని చేయిపట్టుకుని భయంతో అతన్ని పెనవేసుకుపోయింది మాతంగి.

దాంతో... 'ఎంతయినా ఆడది ఆడదేరా సామీ... నేను పట్టుకోనుండంగానే... నన్ను భయంతో బిగపట్టేసింది' రెండు శరీరాలు పైకి తేలి ఉండడానికి ప్రయత్నిస్తూ నీటి అడుగున తన కాళ్ళను వేగంగా వెనక్కి ముందుకి కదిలించసాగాడు.

అయినా ఆమె పట్టు వదల్లేదు.

ఇక ఆలశ్యం చేస్తే ఇద్దరూ మునిగిపోతామనుకున్నాడు. "అట్ట పట్టుకుంటే ఎట్టమ్మే నువ్వూ నామాదిరి కాళ్ళు ఆడించు లేకుంటే యిద్దరం మునిగిపోయి చస్తాం" అని హెచ్చరించాడు.

ఆమె అలాగే చేయడంతో... ఆమె శరీరం నిశ్చలంగా నీటిపైన తేలింది. నీటిలో తేలివుండే కిటుకు తెలిసిపోయి ఆమె ఆనందంగా ఆతన్ని హత్తుకుపోయింది.

గట్టుపైన ఎవరి మాటల్లో వారున్నారు. వీరినెవ్వరూ గమనించడం లేదు. అతను ప్రతిరోజూ ఆమెకు అలా ఈత నేర్పిస్తూనే వున్నాడుగనక... ఎవ్వరూ వారిని పట్టించుకోడం లేదు.

బావిలో... శివదాసు మాతంగుల శరీరాలు తేలిగ్గా నిశ్చలంగా కదుల్తున్నాయి. వారి శిరస్సులు మాత్రం నీటిపైన కనిపిస్తున్నాయి. ఏకమైన వారి రెండు మనసులు ఊసులాడుకుంటూ మధురస్వప్నాలను కంటున్నవేళ.

• భాషకందని మధురమైన భావాలను తమ కళ్ళతోనే వ్యక్తంచేసుకుంటున్నవేళ.

గట్టుపైన ప్రత్యక్షమయ్యాడు మునెప్ప!

"నీయమ్మ మడ్డినాకొడుకుల్లారా! కలీజు ముండల్లారా! కొంతే గాలం లంజిల్లాలా! దినొమ్మ పందులు మాదిరిగా పొర్లాడతా...

ఆడామగా బాయిలో దూకి సస్తావుంటే... యట్ట. యెంగిలీ బంగిలీ, గల్లాగలీజు అంతా బాయిలో పేరుకుంటావుంటే... ఆ నీళ్ళు యట్టనోట్లో పోసుకుండేది? మీ దరిద్రమంతా నీళ్ళలోకేపాయ!

మిమ్మల్ని రక్తపెంజిరి పెరకా! వసే బోయ సాన్లూ, గవడసాన్లూ, మిమ్మల్ని మాలోడు సెయ్య. మాదిగోడు ముట్ట మిమ్మల్ని అందరికింద పండబెట్ట. అంతదూరంనుంచీ ఆడపించుకుంటా వచ్చినారు గదే... బాయిలో దూకేదానికి. మిమ్మల్ని మెట్లతో కొట్టినా పాపంలేదే'' ఆడామగా తేడా పాటించకుండా పచ్చిబూతులు తిట్టసాగాడు మునెప్ప.

బాయిలో వున్న శివదాసు, మాతంగి ఇదేదీ గమనించడంలేదు. "లేదులే అన్నో! మీయట్టా మారాజులే అట్టంటే... మాయట్టోళ్ళు యక్కడ పోవాల సెప్పు"

గాలిలో ఆరబెట్టుకుంటున్న కొంగును కప్పేసుకుంటూ అని ఇంటికి దారి తీసింది మల్లమ్మ. అక్కడున్న ఒకరిద్దరు మగవాళ్ళు, మిగిలిన ఆడవాళ్ళు అందరూ ఆమెను అనుసరించారు.

"హూ... యీళ్ళ కిట్టాకాదు. రేపు మా పెద్దాయనకు సెప్పి యేడా నీళ్ళు, పనులు దొరక్కండా సేసి ఈ కరువు కాలానికి కడుపుకింత గంజి దొరక్కండా జేయాల. అబ్బుడుగానీ తెలీదు''

వెలుతున్నవారిని చూసి అనుకుంటూ బావిగట్టుకు వచ్చి బావిలోకి తొంగిచూశాడు.

అంతే! అక్కడి దృశ్యం చూసి మండిపోయాడు.

తను ప్రేమించిన మాతంగిని పెనవేసుకుని నీటిలో శృంగారం నడుపుతున్న శివదాసుపైన అతనికి ఎక్కడలేని కోపం వచ్చింది. బచ్చనకుంట కట్టపైన శివదాసు తన్ను చితకతన్నిన సంఘటన గుర్తుకొచ్చి, పగదీర్చుకోవడానికిదే మంచి అదననుకున్నాడు మునెప్ప.

పక్కనే వున్న ఒక పెద్ద బండరాయి చేతుల్లోకి తీసుకుని బావిలోకి విసిరాడు.

అదే సమయంలో అనుకోకుండా మాతంగిపైకి చూడడం అసంకల్పితంగానే అప్రయత్నంగానే ఆమె శివదాసును హఠాత్తుగా నీళ్ళలోకి ముంచేసి తాను మునిగిపోవడం క్షణంలో జరిగిపోయింది.

ఆ బండరాయి నీటిలో పడి బావంతా అల్లకల్లోలమైపోయి, అది శివదాసు వీపుకు వరుసుకుంటూ నీటి అడుగుకు వెళ్ళిపోయింది. మాతంగి చేసిన పనివల్ల అతనికి పెద్ద ప్రమాదమే తప్పిపోయింది.

"వరే! నీయమ్మ ముండనాకొడకా, నీకేం పొయ్యేకాలంరా... ఆడేడా తావులేనట్టు నీలల్లోనే పనిపట్నావు. నీకు పెసల్‌గా సెప్పాలంట్రా..."

"వసే సిగ్గులేన్దానా! ఈనం పానం లేదంటనే నీకు. అన్నీ యిడిసిపెట్టేసి నట్టుండావుగదే...' నీయబ్బన్నివ్వు సెయ్య...నీయబ్బడాలా! పైకిరాయే'' గద్దించి తిడుతూ గట్టిగా గట్టుపైనించే అరవసాగాడు మునెప్ప.

శివదాసు కోపాన్నణుచుకుంటూనే మౌనంగా గట్టుపైకొస్తున్నాడు.

నీళ్ళోడుతున్న శరీరాన్ని తుడుచుకుంటూ అవమానంతో తలవంచుకుని అతన్ననుసరించింది మాతంగి.

నీటిలో తడిసి స్నిగ్ధసుందరంగా, అపరజలకన్యలా గట్టుపై కొచ్చిన మాతంగి అందాల్ని కళ్ళతోనే జుర్రుకుంటూ...

"వోన్ని తగులుకుంటే నీకేమొస్తుందే నా బూసడా! నాలాంటోన్ని మరుక్కోయే లాభముంటుందిగానీ..." అవహేళన చేశాడు.




ఇంక ఓర్చుకోలేకపోయాడు శివదాసు.

అతని కోపం అవధులు దాటింది.

"ఏమ్మొరిగినావురా కుక్కనాకొడకా! ఆడేన్నో నాయుళ్ళ సంగటిదిని వోళ్ళు పోసే గోకుడు సద్దెనీళ్లు దాగి కొవ్వుబట్టిందిరా నీకు'' అని తిడుతూ పిడికిలి బిగించి అతని పొట్టలో రెండు పోట్లుపొడిచాడు. ఆ దెబ్బకు 'అమ్మో' అంటూ ఫిరంగిగుండు తగిలినట్టు గిరకీలు కొడుతూ డొక్కచేతబట్టుకొని నేల కూలిపోయాడు మునెప్ప.

"సాంపు! నా కొడకా!" అని గొణుక్కుంటూ మాతంగి నడుంచుట్టూ చేయివేసి నడిపించుకుంటూ అక్కడినుండి పల్లెవైపు బయలుదేరాడు శివదాసు.

★ ★ ★

కరువు తీవ్రరూపం దాల్చింది. జీవన సరళిలో ఎన్నో మార్పులు వచ్చాయి. పేదలంతా తిండికి లేక కటకట పడుతున్నారు.

తిండిగింజలు లేవు. తాగు నీరులేదు. అయినా ప్రభుత్వం ఏమీ పట్టించుకోవడం లేదు.

రైతులు పోషించుకోలేక పశువుల్ని ధారపోసి ఆ డబ్బుల్తో తిండి గింజలు తెచ్చుకుంటున్నారు.

బావులకు పూడిత్తడం వంటి మట్టి పనులు చేస్తూ గూడెం వాళ్ళు పొట్టపోసుకుంటున్నారు.

మామిడి తోటల్లోను, ఏటి గట్టుల్లోవున్న కలబంద గుముల్లోను, ఈత చెట్లలోను ఉన్న గడ్డల్ని తవ్వుకొచ్చి పేదలు కడుపు నింపుకునే పరిస్థితి ఏర్పడింది. అడవిలో గేదారాకు కోసుకొనివచ్చి ఉడకబెట్టి పసరు పిండేసి దానికి ఉప్పుకారం చల్లి, కొందరు దాన్నే తింటున్నారు.

ఇన్ని కష్టాలనుభవిస్తున్నా గూడెంవాళ్ళకు పంతాలు పట్టింపులు మాత్రం పోలేదు.

తమ దొంగతనాన్ని బయటపెట్టాడని తిమ్మడికి, గంగడికి శివదాసుపైన వున్న కక్ష ఏమాత్రం తగ్గలేదు. ఆ విషయంలో శివదాసుకూ్కడా బాధగానే వుంది.

దానికితోడు ఒకరోజు జరిగిన సంఘటన శివదాసును యింకా కుంగదీసింది.

వేటినైతే తమ స్థిరచరాస్తులుగా భావించాడో, వేటి ఆధారంతోనైతే కరువు తెలియకుండా నాలుగు డబ్బులు సంపాదించుకుంటున్నాడో, వేటివల్లనైతే ఇతరుల నాశ్రయించకుండా తన వారికింత పెడుతున్నాడో అవే సర్వనాశనమైపోయాయి.

ప్రతిరోజూ ఉదయాన్నే సుబ్బరమణి పందుల్ని బయటకు తోలుకొనిపోయి మళ్ళీ తొమ్మిదికంతా తిరిగి ఇంటికి రావడం, మళ్ళీ మధ్నాహ్నం మూడు గంటలకు తోలుకొని వెళ్ళి ఏ ఆరింటికో ఇంటికి రావడం ఆనవాయితీ. అది పందులుండే ప్రతివారికీ మామూలే.

ఆరోజు ఉదయాన తడికె తీసుకొని పందుల దొడ్లోకి అడుగుపెట్టిన సుబ్బరమణి గుండె ఆగినంత పనయింది.

"అన్నా! అన్నా! పందులన్నీ నేల ఈలగరుచుకోని పడుండాయి. వొగిటీ లెయ్యలా''

అది విన్న శివదాసుకు నవనాడులు స్తంభించిపోయినట్లు అనిపించింది. చేస్తున్న పని అలాగే ఆపేసి పరుగెత్తుకుంటూ వెళ్ళి దొడ్లో చూశాడు.

పందులన్నీ అచేతనంగా పడి వున్నాయి. కొన్ని నాలుక బయటకు చాపి, మరికొన్ని పళ్ళు ఈల గరచుకొనీ, మరికొన్ని కండ్లు తేలేసి, భయంకరంగా కనిపిస్తున్నాయి.

అప్పటికే వాటి కడుపులు బాగా ఊరిపోయి బూరటిల్లి వున్నాయి.

వాటిమధ్య పడుకొని ఒక చిన్న పందిగున్న మాత్రం కళ్ళార్చుకుంటూ... బాంబు

పడిన పట్నంలో అందరూ చనిపోగా ఏకాకిగా మిగిలిపోయి బిక్కుబిక్కున చూస్తున్న పసిపాపలా... అతనివైపు చూస్తోంది.

ఏం జరిగిందో శివదాసుకు అర్థంకావడంలేదు. తన సర్వస్వం అనుకున్న పందులు చచ్చి పడి ఉండడం అతనికింకా నమ్మకం కలుగలేదు.

వాటిని చూస్తున్న అతనికి పక్కనే పడివున్న ఒక సీసా కనిపించింది. వెళ్ళి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. దాన్నుంచి వెగటువాసన వస్తోంటే అదేమిటో అతనికి తెలిసిపోయింది. అది ఎండ్రిన్ బాటిల్!

ఎవరో రాత్రి తడికె తీసి పందుల కుడితి తొట్లో దాన్ని కలిపారు. ఆ నీళ్ళు తాగిన పందులు చచ్చిపోయాయి. తొట్టి అందకపోవడంతో ఒక చిన్న గున్న మాత్రం బతికిపోయింది.

గుండెలోనుండి తెరలుతెరలుగా వస్తున్న దుఃఖాన్ని అతి ప్రయత్నమ్మీద ఆపుకుంటున్నాడు. ఎంత వద్దనుకున్నా అతని కళ్ళు చెమర్చాయి.

వెంటనే సుబ్బరమణితో చెప్పి రెడ్డన్నను, కిష్టున్ని రప్పించాడు. వారితోబాటు గూడెం ప్రజలూ అక్కడ చేరిపోయారు. అందరి హృదయాల్లోను ఆ క్షణంలో శివదాసుపైన జాలి, దయ పుట్టుకొచ్చాయి.

చిన్నచిన్న పందుల్ని వదిలిపెట్టి, మిగిలినవి ఏవో కొంత మొత్తానికి యిచ్చివేశాడు. రెండింటినైతే ఊరికనే ఇచ్చివేశాడు.

మేకలోల్ల పల్లెవాళ్ళు కూడా వొగటి తీసుకెళ్ళారు.

కనీసం నాలుగువేలు అమ్మాల్సిన పందులు ఆ పూట నాలుగు వందలు కూడా అమ్ముడుపోలేదు.

శివదాసుపైన ఆవిధంగా పగతీర్చుకున్నందుకు మునెప్ప కసిగా నవ్వుకున్నాడు.

అలా శివదాసు ఆర్థికంగా దెబ్బకొట్టబడ్డాడు. ఇది జరిగిన కొంతకాలానికి శివదాసును మానసికంగాను సామాజికంగాను గూడెం వాళ్లకి దూరం చేసిన సంఘటన మరొకటి జరిగింది.



సాంబయ్య బావిపని కొద్దిరోజులకే అయిపోయింది. ఆ తర్వాత శివదాసు, కిష్టుడు, కొక్కువారిపల్లె సమీపంలో వున్న వెంకటమ్మ చెరువులో ఒక ఆసామికి ఇటుక కోసే పని వప్పుకున్నారు.

ఉదయం ఎనిమిది గంటలకంతాలేచి స్నానపానాదులు ముగించుకుని మధ్నాహ్న భోజనాన్ని చేతబట్టుకొని బయలుదేరి సాయంత్రం అయిదు గంటలకంతా పని వదలగానే తిరిగి యింటికి బయలుదేరడం అప్పటికి వారి నిత్యకృత్యం.

ఆరోజు మధ్నాహ్నం పదకొండు గంటల సమయం...

వెంకటమ్మ చెరువు మొగదల, ఇటుక కోసే పని జోరుగా సాగిపోతోంది.

శివదాసు, కిష్టుడు చదునుచేసి నీళ్ళు చల్లిన ఒక బయలు ప్రదేశంలో తలకు గుడ్డకట్టుకొని, గోచీ బిగించి, గొంతు కూర్చున్నారు. వారి కుడిచేతుల్లో జానెడు పొడవున్న ఒక సన్నని చెక్కులున్నాయి. ఎడమ చేతుల్లో ఒక అడుగుపొడవు, జానెడు వెడల్పువున్న ఇటుకల 'అచ్చు'లున్నాయి. అవి కాస్త దీర్ఘ చతురస్రాకారంలో రెండు అరలుగా




ముచ్చటగా కనిపిస్తున్నాయి.

చెరువుమధ్యలో కొద్దిగా నీళ్ళున్నాయి. చెరువునీటి గట్టున ఒక చిన్న మోటరు తగిలించి, రబ్బరు పైపు ద్వారా నీరు అక్కడికి సరఫరా చేయబడుతోంది.

కొందరు అక్కడికి దగ్గర్లోనే ఒకచోట గుంట తవ్వి ఆ మట్టిని గట్టున కుప్పగా పోస్తుంటే మరికొందరు ఆ మట్టికుప్పను నీటితో తడిపి, కాళ్ళతో తొక్కి ఇటుక కోయడానికనువుగా తయారుచేస్తున్నారు.

రెడ్డన్న మరో వ్యక్తి చెరోవైపున వంగి సలంకపార్లతో అతడి మట్టిని కానగబర్రలతో అల్లిన వడ్డితట్టల్లోకి కొంచెం కొంచెంగా వేస్తున్నారు.

కొందరు ఆడవాళ్ళు నెత్తిన తలగుడ్డలు చుట్టల్లా పెట్టుకొని వరుసగా వచ్చి ఆ మట్టి తట్టల్ని నెత్తికెత్తుకొని మోసుకెళ్ళి ఇటుకకోసే వాళ్ళకందిస్తున్నారు.

శివదాసు, కిష్టుడు తమ చేతుల్లో వున్న అచ్చుల్ని నేలపైనపెట్టి, వాటినిండా, ఆడవాళ్ళందిస్తున్న తడిమట్టిని పోసి, తమ కుడిచేతుల్లోని చెక్కతో అచ్చులపైన మిగిలిన మట్టిని జరుపుకుంటూ, ఆ తర్వాత అచ్చుల్ని పైకి లేపి, తమ శరీరాల్ని వెనక్కి జరుపుకుంటూ అలా ఇటుక కోస్తూనే వున్నారు. అట్లా కోసిన పచ్చి ఇటుకలు ఆ ఎండకు ఎండుతున్నాయి. ఆ ప్రదేశానికవతల అలా కోసి బట్టీ కట్టిన కాల్చని ఇటుక బట్టీ ఒకటి, పెళ్ళికి ముస్తాబుచేసిన పెళ్ళికూతురులా ముద్దుగా కనిపిస్తోంది. కాల్చిన రెండు ఇటుక బట్టీలు వాటికవతల, నెలలు నిండిన నిండు గర్భిణిల్లా అక్కడక్కడా పొగచూరి ఎర్రగా కనిపిస్తున్నాయి. వాటికి మధ్యన అక్కడక్కడ సగం తీసేసిన ఇటుకబట్టీలు కూడా కొన్ని కనిపిస్తున్నాయి.

చెరువులో... వాళ్ళకి కొంత దూరంలో ఇటుక కాల్చడానికి కోయబడిన కట్టెలు, దుంగలు పెద్ద గుట్టలా ఎండకు ఎండుతూ కనిపిస్తున్నాయి.

"ఆ... కానీ... పొద్దుపాయ... కానీ'' అంటూ రెడ్డన్న హెచ్చరిస్తూనే తడిమట్టిని తట్టల్లో వేస్తున్నాడు.

"కానీన్నో... ఊరికే ఎందుకరుస్తావుగానీ ఎండపొద్దన... ఈడ ఊరికే ఎవురూ నకరాలుపోతా నిలబడలేదుగానీ..." అంది మట్టితట్టను నెత్తికెత్తుకుంటూ మల్లమ్మ.

"యేందన్నో... భలే జోరుగా వుండావే మడిసివి... ఎందుకట్టా ఉపద్ర (తొందర, ఉపద్రవం) పెడతావు మడుసులకు'' మల్లమ్మ వెళ్లగానే తన తట్టను అక్కడవేస్తూ అంది రాజమ్మ.

"కానీ బిడ్డా! నేనేమన్నానుగానీ... కొంచెం ఉషారు దెచ్చుకోండి ఎండకు అంటా ఉండా అంతే!" అంటూ పారతో తడిమట్టిని ఆమె తట్టలో వేశాడు.

"ఏమబ్బా! మొగోడా! నీతో మాట్లాడాల. మద్దేనం అన్నందినేటప్పుడు కాపిట్టుకో నుండి పోపాలి నన్ను గలువు. నిండా అవసరమైన మాట ఆ" అంది అప్పుడే తట్టను అక్కడ పెడుతూ నాగమ్మ. వంచిన తలను పైకెత్తి ముసిముసిగా నవ్వుకుంటూ ఆమె ముఖంలోకి చూస్తూ "సరేలే' అంటూ మట్టిని తట్టలో వేశాడు.

"మర్చిపోబోకబ్బా! కండితంగా సెప్తా వుండా ఆం" అంటూ ఆ తట్టను నెత్తిపైకెత్తుకొని వయ్యారంగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది నాగమ్మ.

"యేందబ్బా ఆ మాట" అనుకుంటూ తనపనిలో తాను మునిగిపోయాడు రెడ్డన్న.

"వొరే కిష్టా! దాడ నా షర్టు జేబీలో వాచ్చుంటుంది. తీసి టైమెంతయిందో సూడరో'

ఇటుక కోస్తూనే చెప్పాడు పక్కనున్న కిష్టుడితో శివదాసు- ఆ మాటతో లేచివెళ్ళి వాచీ చూసివచ్చి "పన్నెండుపైన యింకా పదినిమిషాలెక్కువే అయుండాదబ్బా!" అంటూ చెప్పాడు కిష్టుడు.



"సరే... అయితే యింక పనాసి అన్నాలు దినమని సెప్పబ్బా మళ్ళా రెండు కంతా పనిలో దిగాలగదా!" అన్నాడు శివదాసు.

"వరే రెడ్డిగా! యింకాపేసి అన్నానికి లెయ్యండ్రా. అన్నాల్దిన్నాక మద్దేనం యిడుపులో సూసుకుందారి'' అని గట్టిగా కేకేశాడు కిష్టుడు.

"ఇంక పదండబ్బా!" అంటూ ఆ మాటతో పైకి లేచాడు రెడ్డన్న.

ఎక్కడివాళ్ళు అక్కడ పని ఆపేశారు.

అందరూ చుట్టగుడ్డల్ని, తలగుడ్డల్ని విప్పి విదిలించుకుని పైపుగుండా వస్తున్న నీటితో కాళ్ళూ ముఖాలు కడుక్కున్నారు. అంతవరకు ఎండలో చెమటలు కక్కుతున్న వారి శరీరాలు కాస్త ఉపశమనంపొంది ఉల్లాసం పుంజుకోసాగాయి.

అందరూ చెరువుకట్టపైనున్న కానగచెట్ల నీడల్లో కూర్చొని సద్ది మూటలు విప్పారు.

అంతలోపల... కట్టకవతలున్న దిగుడుబావిలోనుంచి... ఒక డాక్సా నిండా నీళ్ళు తెచ్చిపెట్టాడు కిష్టుడు.

ఒకరి కూర మరొకరు, ఒకరి అన్నం ఇంకొకరు మార్చుకుంటూ, ఏ పొరపొచ్చాలూ లేకుండా ఆనందంగా తింటున్నారు మధ్యాహ్న భోజనం.

నాగమ్మ, రెడ్డన్న ఒక కానగచెట్టుకింద కూర్చున్నారు.

ఎవరి ఆకలివారు తీర్చుకోవడంలో నిమగ్నమైవున్నారు.

"ఏమయ్యా మొగోడా! ఊర్లో లేలేత మూగతరుపులు (ఇంకా పిల్లల్ని కనని వయసుకొచ్చిన ఆవుదూడలు) అన్నీ సూటికొస్తా వుండాయి. కానీ నువ్వే ఏమీ అనుకోలా'' అంది నాగమ్మ.

"ఏందమ్మీ అట్టాంటావు నాగీ!" తల వంచుకొని ముద్దు మింగుతూ అన్నాడు రెడ్డెన్న.

"యేంది? సెప్తావుంటే ఉలుకూ పలుకూ లా''

అతని సత్తుక్యారియర్‌లో వున్న సద్ద సంగటి ముద్దపైన తను తెచ్చుకున్న చింతకాయ ఊరుమిండిని కాస్త విదిలిస్తూ అంది నాగమ్మ.

"ఏం సెప్పేదమ్మో?"

"ఏంలేదా సేప్పేదానికి. సెప్పాల్సిందే సెప్పు"

గద్దించినట్లు అడిగింది.

తననుంచి ఆమె ఏం సమాధానం కోరుతోందో అతనికి తెలుసు. తెలిసినా నోరుమెదపలేదు. ఆ విషయం చెప్పడానికి అతనికిష్టంలేదు. అందుకే మౌనంగా ఉండిపోయాడు.

"ఏందయ్యా నువ్వు. నేనడిగేదేందీ? నువ్వు మాటాపలుకూ లేకుండా మూగెద్దు మాదిరితో... గొమ్మున సంగటి మింగతా వుండే దేందీ?" దబాయించినట్లు అడిగింది నాగమ్మ.

"ఏం సెప్పేదమ్మా!"

"ఆ దినం... బచ్చనకుంటకాడ కానగచెట్ల గుంపులో ఎన్ని కష్టాలొచ్చినా, పెద్దోళ్ళు వప్పుకున్నా, వప్పుకోకపోయినా దిగ్గిరిలోనే వొగమంచిదినం సూసి పెండ్లిజేసుకుంటానంటివే... పెద్ద పుడింగి (హీరో)లాగా మాటిస్తివే... అబ్బుడే మర్సిపోతవా... నీపురసత్తా (మగతనం) సూపించు''

"అన్ని గ్యెవనంగానే (జ్ఞాపకంగానే) వుండాయి, మరవలా''

"మరింకా ఎందుకు నానేసుకోనుండేది''

"కావాలని నానేసుకోలా... మా యింట్లో సింతలోళ్లని సేసుకునేదానికి వప్పుకోవడంలా''

"మేము సింతకాయలోళ్ళన్ని మీరు ఉప్పోళ్లని యిప్పుడు తెలిసిందా. నాపైన మొనుసుపడినప్పుడు, మాటిచ్చినప్పుడు, తె




లీలా నీకు'' నిలదీసినట్టు అడిగింది.

"అబ్బ ఎందుకట్టా జేరిపోతు మాదిరితో సతపోరతావు'' కాస్త విసుగ్గా అన్నాడతను.

ఆ మాటతో దుఃఖం ముంచుకొచ్చింది నాగమ్మకు. కళ్ళనీళ్ళు జల్లున బుగ్గలపైకి జారాయి.

అది గమనించిన రెడ్డన్న కదిలిపోయాడు. రాళ్ళను సైతం కరిగించే శక్తి కలకంఠి కన్నీళ్ళకే గదా వుంది. అందుకే రెడ్డన్న కరిగిపోయాడు.

"అంతమాత్రానికే యాడవాల్నా..." అనునయించాడు.

"అదంతా నాకు తెలీదయ్యా! మాయప్ప నాకు యేరే సంబంధాలు సూస్తావుండాడు. రేపు ఆదివారంనాటికి సెరువుముందరపల్లి నించి నన్ను చూసేదానికి ఎవరోవస్తారంట. సంబంధం గనక కుదిరితే నేను ఏ నుయ్యో గొయ్యో సూసుకుంట అంతే! ఆ తర్వాత రామరామ అని నువ్వే నూరేండ్లు ఏరేదాన్ని కట్టుకోని కాపరం జేద్దువుగానీ'' నిక్కచ్చిగా చెప్పింది నాగమ్మ.

"సరే... ఈ దినమే... శివదాసుతో మాట్లాడి ఎట్టోవొగట్ట మావాళ్లను వప్పించేటట్లు జేస్తా. వప్పుకోలేదనుకో ఆమింద ఆలోసిద్దాం... నువ్వు ముందు అన్నంతిను''

అంటూ తను తినడం ముగించి క్యారియర్‌లో నీళ్లుపోసి చేయికడిగేసుకున్నాడు. ఆ తర్వాత కాళీ అయిన సత్తుగ్లాసులో ఆమెకు నీళ్లు తెచ్చివ్వడానికి లేచి వెళ్లిపోయాడు.

★ ★ ★

ఆ మరునాటి సాయంత్రం....

ఇటుకపని ముగించుకుని ఇంటికి చేరుకున్న శివదాసు... ఇంటిముందర కూర్చొని బారెడు పొడవున్న కానగబ్రల్ని ఒకదాని తర్వాత ఒకటిగా ఇంటూ ఆకారంలో పెడుతూ, వాటిమధ్యన అరికాళ్లు పెట్టి కూర్చొని... మట్టి తట్టను అల్లుతున్నాడు.

అతని పక్కనే కొంతదూరంలో పందల గుడిసెకి ముందర ఓ పాత కాలంనాటి నులకమంచం వుంది.

దానికవతల చుక్కమ్మ గుడిసెకు ఈశాన్యం వైపున మూరెడెత్తున్న రోలుదిమ్మ మధ్యలో వెదురుతో గరాటు ఆకారంలో అల్లిన కుదురును వుంచింది. అందులో అర్ధశేరు పొట్టూడదంచిన సద్దల్నిపోసి, గుక్కెడు నీళ్లు అందులోపోసి రోకల్ని తీసుకుని గుప్పించి గుప్పించి సద్దలు కొడుతోంది.

ఆమె గుప్పించిన ప్రతి దెబ్బ గుడిసె లోపలున్న నీళ్లబిందెలో ప్రతిధ్వనిస్తోంది.

గుడిసెలో పొయ్యిమీద ఒక సట్టిలో ఎసరు కాగుతోంది. రోట్లోని సద్దలు పదునుగా నలుగుతున్నాయి.

వలయాకారంగావున్న కానగబ్రల మధ్యన శివుడు... వంటి తలతో పద్మంలో నుంచి ప్రత్యక్షమైన బ్రహ్మదేవుడిలా కనిపిస్తూ తట్టను అల్లుతూనే వున్నాడు.

సరిగ్గా అప్పుడొచ్చాడు రెడ్డన్న అక్కడికి.

"ఏమిరా రెడ్డిగా! యిట్టొస్తివీ?"

తలపైకెత్తి చూసి మళ్లీ తట్ట అల్లడంలో మునిగిపోతూ ప్రశ్నించాడు శివదాసు.

"ఏంలేదు శివుడూ. నీతో కొంచెం మాట్లాడాల..."

వేగంగా వేళ్లను తిప్పుతూ చాకచక్యంగా బ్రల్ని మార్చుతూ చెకచెకా తట్టను అల్లకుపోతున్న శివదాసు నైపుణ్యాన్ని ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు రెడ్డన్న.

"ఏందోసెప్పు"

"ఈడ గాదులే'

"సరే... అయితే ఉండు... తట్ట అయిపోవచ్చింది. అందాక మంచం పైన కూసోని మాటలు సెప్తావుండు..." అన్నాడు శివదాసు.

"నీకు సేతగాని పనే లేనట్టుండాదబ్బా... అన్ని పన్లు జేస్తావు'' మెచ్చుకోలుగా అంటూ

వెళ్లి నులకమంచంపైన కూర్చున్నాడు రెడ్డన్న.

ఇంతలో చుక్కమ్మ... దంచిన సద్దల్ని చేటలో పోసుకొని కింద ఒక దుప్పటి పరచి, అందులోకి సద్దపిండిని చెరిగింది. చేటలో మిగిలిన సద్దనూకల్ని తీసుకెళ్లి పొయ్యిమీద చట్టిపైనున్న మూకుడు తీసి, కాగిన ఆ ఎసరులో పోసి, చిప్పకట్టెతో బాగా కలియబెట్టి, మళ్లీ మూకుడుతో మూసివేసింది.

సద్దనూకలు పొయ్యి మీద శబ్దం చేస్తూ ఉడకసాగాయి.

ఇంటి ముందర శివదాసు అల్లుతున్న తట్టను ముగిస్తూ హెచ్చు తగ్గులు వచ్చిన బద్రల్ని సరిచేస్తున్నాడు. ఇలా కొద్ది నిముషాలు గడిచాయి.

ఇంట్లో పొయ్యిమీద ఉడికిన సద్దనూకల్లో, చెరగిన సద్దపిండినిపోసి, సంగటి కట్టెతో కెలికి మూతపెట్టింది చుక్కమ్మ. సన్నటి మంటతో ఉమ్మటిల్లుతూంది సంగటి. ఆ సంగటి నుంచీ వస్తున్న కమ్మటివాసన ఆ ప్రాంతమంతా ఆవరిస్తోంది.

శివదాసు తట్టను అల్లడం పూర్తిచేసి, ఆ తట్టను గుడిసెలో పడేసి "అమ్మణ్ణీ! నేను రెడ్డన్నతో అట్టబొయ్యొస్తా. అబ్బోడు పంది గున్నని తోలకొస్తే గుడిసెలో తోలి బయటికి రాకుండా రాయి అడ్డంపెట్టండి'' అంటూ తలగుడ్డను విదిలించి భుజానవేసుకుని వీధిలోకి అడుగుపెట్టాడు శివదాసు. రెడ్డన్న ఆతన్ననుసరించాడు.

అలా ఇద్దరూ ఊరి ముందరకు బయలుదేరి ఒకచోట రాళ్లపైన కూర్చొన్నారు.

అది మేకలోళ్లపల్లెకు పోయేదారి. అక్కడ ఇద్దరూ మనసులు విప్పి మాట్లాడుకున్నారు. నాగమ్మ విషయమంతా వివరంగా చెప్పాడు రెడ్డన్న.

"వొరే శివుడూ... మన పెద్దోళ్లు జన్మలో మారరు. ఒకేకులంలో ఇంకా ఈ ఉపజాతులెందుకు. వద్దంటే ఇనరు. మేం బట్టిన పందిగున్నకు మూడే కాళ్లంటారు. ఏం చేసేది సెప్పు... అట్ట కన్నోళ్లను కాదనలేను. నాగమ్మనూ వదులుకోలేను. నువ్వే ఏదో ఒగదారి సూపెట్టాలరా శివుడూ'' ప్రాధేయపడుతూ అన్నాడు రెడ్డన్న.

"ఉండ్రా... దీనికి ఏదో వొగ యోశన సేద్దాం" అంటూ ఆలోచనల్లో మునిగిపోయాడు శివదాసు.

సరిగ్గా అప్పుడే.. కణేల్ కణేల్‌మంటూ ఊర్లో డప్పు మ్రోగింది. ఆ వెంటనే ఒక పెద్ద అరుపు వినిపించింది.

"ఏందిరా రెడ్డన్నా అది?" అడిగాడు శివదాసు.

"అదేదో దండోరా మాదిరుండాదిరా'' చెప్పాడు రెడ్డన్న.

ఇద్దరూ ఒక్కక్షణం చెవులు రిక్కించి ఆ అరుపును విన్నారు. అది మాల కదిరప్ప వేస్తున్న దండోరా!

"అందరూ వినండప్పా మారాజులూ... రేపు రేతిరికి సీతారామ నవమిగ్గాను మేకలోళ్లపల్లెలో సుక్కలూరి రామనాటకం 'లవకుశ' ఆట జరుగుతుంది. అందురూ హాజరై ఆటసూసి తరించండహో..."

గొంతు చించుకొని అరుస్తూ డప్పు కొడుతున్నాడు కదిరప్ప.

పల్లెల్లో ఏ ఉత్సవాలు, ఊరేగింపులు జరిగినా, వేడుక చేసుకున్నా దాన్ని చుట్టుపక్కల అన్ని పల్లెలకు తెలియడానికి మాల కదిరప్ప దగ్గర డప్పు కొట్టించి దండోరా వేయించడం ఆనవాయితీ.

ఆ దండోరా వినగానే శివదాసుకు మెరుపులాంటి ఉపాయం ఒకటి స్ఫురించింది. దానిపైన తీవ్రంగా ఆలోచించాడు.

"కట్టుబాట్లను, ఆచారాలను వదిలించుకోని వొగమెట్టు కిందికి దిగి, చింతలోళ్లు ఉప్పుతెగోడయిన రెడ్డెన్నకు నాగమ్మనిచ్చి పెండ్లి చేసే దానికి వప్పుకోరు. రెడ్డన్నోళ్లు అంతే. ఆ మాటకొస్తే ఈ గూడెంలో ఉపతెగ




లు, ఆచారాలు పోగొట్టుకునేదానికి ఎవ్వరూ వప్పుకోరు. ఈళ్లందరికీ పంతాలు, పట్టింపులు ఎక్కువ. తినేదానికి సంగటి లేకపోయినా వాటిని మాత్రం వదులుకోలేరు. అట్లని ఊరికే ఉంటే నాగమ్మే మొచస్తానంటుంది. ఇంక ఈ జాతిలో సర్వసాధారణంగా వుండే ప్రేమించుకోడాలు, లేచిపోడాలు, మళ్లాయిడిపోడాలు యియ్యేగతి. యిద్దర్నీ వొగటిజేసి, సందు జూసుకొని బయటికెల్దీసి, దూరంగా పంపించేయడమే మంచిది. లేకుంటే దీనికి యేరే దారిలేదు. ఎవురేమనుకున్నా ఆపనే జేయాల. ఇట్టాంటివి రెండుమూడు జరిగిపోతే ఈ ఉప తెగలు మెల్లిగా వదిలేస్తారు. రెడ్డన్నకొచ్చిన యిరుకే (సమస్య) రేపు మా తంగికీ, నాకూ కూడా రాబోతుంది. ఇదే మంచి దారి అన్నిటికీ..."

అలా ఒక నిర్ణయానికొచ్చి "వొరే రెడ్డిగా! నీకు ధైర్నంవుంటే సెప్పు. దీనికంతా వొగటే దారుంది!" అన్నాడు.

"ఏందో సెప్పు" ఆసక్తిగా అడిగాడు రెడ్డన్న.

"రేపు నువ్వూ నాగమ్మ అన్నీ సర్దుకోని, మేకలోళ్లపల్లెకు లవకుశ నాటకానికి వస్తావుండారు అంతే. మామూలుగా నాటకానికొచ్చినట్టే ఉండాల.. అంతే'' రహస్యం చెబుతున్నట్లు చెప్పాడు శివదాసు.

"వస్తే!"

అర్థం కానట్లు అడిగాడు రెడ్డన్న.

"వొరే పిచ్చిపుల్లయ్యా! ఆట అయిపోగానే అందరూ ఇంటికి పోతారు. మీరుమాత్రం ఇండ్లకుపోరు''

"ఎట్టా... కొంచెం యివరంగా సెప్పరా నీ యిత్తగిల"

"ఏంలేదుర... మీరిద్దరూ.. ఈ ఊరొదిలేసి దూరంగా వెళ్లిపోండి''

"అట్టజేస్తే... అందరూ తిట్టుకోరా''

"ఆc... తిట్టుకోనీ.. ఎన్ని రోజులు తిట్టుకుంటారు... వారంపది రోజులు అంతే. ఆ తర్వాత మర్చిపోతారు''

"సరే.. ఈ ఊరొదిలి యాడికనిపోవాల?"

"ఏపిలిబైల్లో మావోళ్లుండారు. కొన్ని దినాలు ఆడనే ఉండండి. ఆడ రైతుల పన్లు సేసుకుంటా వుండండి. ఆడపనులు మెండుగా ఉండాయిలే. ఏదో వొగటి జేసుకోని బతకొచ్చు''

"యేందోరా... అదంతా తల్చుకుంటా వుంటేనే ఓ మాదిరిగా ఉండాది''

"ఎందుకు?"

"పుట్టినూరు. పెరిగిన గడ్డ... అయినోళ్లు పొయినోళ్లు వున్న ఊరు వదిలిపోవాలంటే..."

"ఇద్దో... అట్టనుకుంటే ఇంక ఈ జన్మలో నాగమ్మను మనువాడలేవు. మన కులంలో యివన్నీ మామూలేగదా! ఓ ఆరునెలలు అట్టుంటే... అన్నీ మామూలైపోతాయి. తిరిగి ఈడికే రావచ్చు అంతే!" ధైర్యం చెప్పాడు శివదాసు.

"సరేబ్బా! అట్టేగానీరా''

'అదీమాట! అట్టుండు... నాగమ్మకు అన్నీ వివరంగా చెప్పంపుదాములే'

"సరేయింక పోదామా'' పైకిలేస్తూ అన్నాడు రెడ్డన్న.

అతని కళ్లలో రేపటి గురించిన ఆలోచన్లు. నాగమ్మతో తన కాపురం ఊహించుకుని లోలోపలే పొంగిపోసాగాడు.

మిత్రుడికళ్లలో ఆనందం చూసిన శివదాసు సంతృప్తిగా గాలిపీల్చుకుంటూ ఇంటి ముఖంపట్టాడు. రెడ్డన్న ఆతన్ననుసరించాడు. అప్పటికే సూర్యుడు పడమిటింట్లో మాటువేశాడు.

ఆ మరునాడు నాటకం చూడటానికని నాగమ్మ పెందలాడే నారాయుడి ఇంటికి చేరుకుంది.

రెడ్డన్న అప్పటికే అక్కడున్నాడు. ఆ రాత్రి... ఆ యిద్దరూ నాటకం కొంతసేపు

చూశారు.

అంతే... ఆ మరునాడు నాగమ్మ, రెడ్డన్న లు లేచిపోయారన్న వార్తతో గూడెం కుత కుత లాడింది.

శివదాసే ఈ పని చేయించాడన్న నిజాన్ని తెలిసికొన్న గూడెం ప్రజలు పెద్ద రాద్ధాంతం చేశారు.

దాంతో ఆ రోజు మళ్ళీ గూడెంలో కొట్లాటలు, తిట్లు యధాలాపంగా జరిగిపోయాయి.

★ ★ ★

మాతంగి ఒక కడవ చేతబట్టుకొని సాయంత్రంవేళ నీళ్ళు తేవడానికి వరదయ్య బావివైపు బయలుదేరింది.

ఒంటరిగా వస్తున్న మాతంగికి బావి గట్టునే ఎదురు పడింది రంగసాని.

"అమ్మణ్ణి! వొగ్గెడు విట్లురా! చెరుకుతోట్లో గెడ్డికోసి మోపు తట్టినా వోగ సెయ్యేసిపో" వయ్యారాలుపోతూ పిలిచింది.

నీళ్ళ కడవను తొట్టిపక్కనే పెట్టి ఆమె వెంట బయలుదేరింది మాతంగి.

"మొన్నమొన్నదాకా సీవిడి గార్చుకుంటూ వుంటివి. నా కండ్ల ముందర పుట్టిందానివి. అబ్బుడే పసుపు గొమ్మ మాదిరిగా రివరివ ఎదిగి పోయినావే"

తోటమధ్య గెనింపైన నడుస్తున్నదల్లా ఆగి వెనక్కి తిరిగి మాతంగి బుగ్గపైన చిటికేసి కళ్ళలోకి చూస్తు చెప్పింది.

మాతంగి బుగ్గలు సిగ్గుతో ఎర్రబడ్డాయి.

"ఏందమ్మణ్ణి! నీ సొగుసు నీకు తెలీదుగానీ ఎవుడైనా మొగోడు ఇంత మాత్రం వొంటిగా సూస్తే అట్టే వాటేసుకోవాల్సిందే" అపాదమస్తకం మాతంగిని చూస్తూ అంది.

వనదేవతలా వున్న మాతంగి సిగ్గుతో తల వంచుకుంది.

"ఇంకా ఎంత దూరవక్కా?"

చుట్టూ చూసింది మాతంగి.

ఏపుగా మనిషి కనబడనంత ఎత్తుగా పెరిగివున్న చెరుకుతోటలు ఆమెకు కాస్త అనుమానాన్ని కలిగించాయి.

"ఇద్దో! ఇక్కడే దా గెనిమి కిందనే వుండాది. గెడ్డిమోపు రా" అంటూ ఒక పెద్ద గెనింకిందికి తీసుకుపోయింది రంగసాని.

"ఆ... ఈన్నేవుండు సెరుకు పిచ్చె వొక తెంపుకోనొస్తా తింటా పోదాం"

చెరకుతోటలోకి జొరబడింది రంగసాని. ఎంతసేపటికీ రంగసాని రాకపోవటంతో చుట్టూ మరొక్కసారి చూసింది మాతంగి.

నిలువెత్తు గెనింకింద తాను ప్రపంచం కనిపించనంత ఎత్తుగా, దట్టంగా చుట్టూ తోట. భయంతో ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది.

రంగసాని వెళ్ళినవైపే చూస్తున్న ఆమె భుజంపైన వెనుకనుండి ఎవరో చేయి వేయడంతో ఉలిక్కిపడి చూసింది.

కుందేలిని కొట్టబోయే డేగలా చూస్తున్నాడు వరదయ్య.

రంగసాని చేసిన మోసం అర్థమైపోయి, జరగబోయే ప్రమాదాన్ని తలచుకొని, భూతాన్ని చూసిన పసిపాపలా వణికిపోతోంది మాతంగి.

"నువేం భయపడొద్దు. మొన్న బాయిలో నుంచీ నీళ్ళు తెస్తావుంటే సూసినా మొనసు పడినా. ఇంకా ఏల నిలబడి పోతావ్? రా" ముందుకు వస్తున్నాడు వరదయ్య.

"వద్దయ్యా! నేనట్టాంటిదాన్ని కాదు. మీ బోంటి పెద్దోళ్ళు యిట్టా పన్లు సెయ్యడం నాయంగాదు"

వెనక్కి జరుగుతూ- చేతులెత్తి ప్రార్థించింది మాతంగి.

అయినా అతని గుండె కరగలేదు.

"మీ నాయన నా దెగ్గిర నాలుగొందలు బాకీ ఉన్నాడు. ఆ బాకీ కొట్టేస్తా. మున్రాజుకు చెప్పి మీ నాయనకు జీతమెక్కిస్తా. మిమ్మ

 

ల్ని కరువునుంచి కాపాడతా. నా మాటిని నన్ను మరుక్కో'' చేయి పట్టుకొని తనవై పుకు లాక్కోబోయాడు.

"వద్దు... వద్దు'' పరిగెత్తబోయింది.

అయితే వరదయ్య చేతికి ఆమె పైట దొరకడంతో పైట ఆతని చేతుల్లోకి వెళ్ళిపో యింది కుప్పగా.

తన రెండు చేతుల్ని గుండెకు అడ్డుపెట్టు కొని పరుగెత్తసాగింది మాతంగి.

అయినా అతను ఆమెను వదల్లేదు. ఆమె వెంటబడ్డాడు. ఆ రోజు ఉదయమే తోటకు నీళ్ళు కట్టి వుండడంతో వారి అడుగులు నేలలోకి దిగబడుతున్నాయి.

అంతా రొచ్చు రొచ్చుగా వుంది.

ఆమె పరుగెత్తుతోంది.

చెరుకులు విరుగుతున్నాయి.

పావడా కుచ్చిళ్ళు తగులుకుని బురదగా వున్న సాలులో పడిపోయిందామె. అతను ఆమె పైన బడ్డాడు.

మాతంగి నిస్సహాయురాలై మిగిలిపో యింది.

అతని కౌగిట్లో మాతంగి గింజు కుంటోంది.

ఆవేశంతో రెచ్చిపోతూ వరదయ్య ఆమె ను పూర్తిగా ఆక్రమించుకోబోయాడు.

ఇంతలో దిక్కులు పిక్కటిల్లేటట్టు 'వరే' అన్న కేక. అలాగే వెనక్కి తిరిగి చూశాడత ను. అపర యముడిలా వస్తున్నాడు కిష్టుడు. అతని ఆవేశమంతా నీరుకారిపోయింది.

ఊడిపోయిన పంచెను పైకి లాక్కుంటూ పైకి లేచి పరుగెత్తబోయి కింద పడిపోయాడు వరదయ్య.

అతని శరీరం కింద పడ్డ చెరుకుగడలు పటపటమని పెద్ద శబ్దంచేశాయి.

కిష్టుడు ఇంకా దగ్గరకొచ్చేస్తున్నాడు.

వరదయ్య పైకి లేచి ఆ తోటలో కనిపించ కుండా పారిపోయాడు.

"అన్నా! నా బతుకు ఈనమైపోయింది. మొన్న మునెప్ప, ఈ దినం వరదయ్య... ఎంత కాలమని మీరు మాకు కావిలుంటార న్న''

వెక్కివెక్కి ఏడుస్తూ చేతుల్తో ముఖం కప్పుకుంది మాతంగి.

పక్కనే పడి వున్న పైటను ఆమెకు కప్పి, ఆమెను ఓదార్చి

"నేను నీళ్ళకు రాబట్టి సరిపోయింది. రామ్మా పోదాం" అని ఆమెను ఇంటికి తీసుకువచ్చాడు కిష్టుడు.

★ ★ ★

ఆకాశంలో చుక్కలు పేదవాని ఆశల్లా మిణుకుమిణుకు మంటున్నాయి. అప్పుడే రత్తయ్య వీధిలో అడుగుపెట్టాడు.

ఆరోజు ఆదివారం. రాత్రి ఎనిమిదిగంటల వుతోంది. అది సంతరోజు. ఆ రోజు చాలా మంది సారా తాగి రావడం అలవాటు.

కొందరు తాగేసి వీధుల్లో కూర్చొని తమ తాత, ముత్తాతల గొప్పతనాలు ఏకరువుపెడు తున్నారు.

కొందరు ఎవరికి వారే దూషించుకుంటు న్నారు. కొందరప్పటికే నిద్రకుపక్రమిస్తున్నా రు.

అయితే పీకలదాకా తాగిన రత్తయ్య ఆవేదన గుండెను కుదిపేస్తోంది.

ఎన్నో సంవత్సరాలుగా మునిరాజు దగ్గర పనిచేస్తూ సారా కొట్టులో వుంటున్నా, నిష్కా రణంగా ఆరోజు నిలచిపొమ్మన్నాడు.

అతనికి అప్పుపడిన డబ్బులు అప్పటిక ప్పుడే కక్కమన్నట్లు మాట్లాడాడు. పచ్చి బూతులు తిట్టాడు.

ఎంత ఆలోచించినా రత్తయ్యకు కారణం కనిపించలేదు.

తన కూతురు లొంగలేదన్న కారణంగా తన కుటుంబంపైన పగ పట్టినాడు వరద య్య.



ఆ విషయం ఆతనికెలా తెలుస్తుంది. మాతంగి కూడా ఈ విషయం ఏనాడూ చెప్పలేదు.

అందుకే కడపటిసారిగా తాగేసి గూడెంలోకి వచ్చాడు రత్తయ్య.

ఊర్లో గందరగోళం.

అతనేమీ పట్టించుకోలేదు.

మౌనంగా తూలుతూ నడుస్తున్నాడు.

వారు మాట్లాడుకుంటున్న మాటలు అతనికి వినిపిస్తూనే వున్నాయి.

"వొరే! మా నాయన మహాన్నిబావుడు సచ్చి ఏలోకానున్నాడో, వొగసారీ పందెమేసుకోని ఎలకతోక లొండుకోని వొగ తూరిగా ఏడు ముద్దల సంగటి తినేసినాడంట తెలుసునా''

సారా మత్తులో నత్తి నత్తిగా తన తండ్రి గొప్పతనాన్ని గురించి చెప్పాడు గంగడు.

"ఆహా... అట్లానా?"

ఊకొట్టాడు పక్కనే వున్న నాగన్న.

"ఆ... అదేం గొప్ప యిసయంరా... మా నాయన దొంగతనాలు సేసే దినాల్లో... వొగ

బ్బుడు మేజారి సిద్దుగోని నాయన కాలంలో సద్దసేను ఇరగపండిన్నిందంట. కోసి గూడు ఏసిన్నారుట. సరిగ్గా గొర్తుకోళ్ళు నన్నెత్తి నుండంగా పొయ్యి గూడెక్కి మొత్తం కంకులు కోసుకోని... రెండు సంచులుకు వేసుకోని వొగడే ఎత్తుకొచ్చేసినాడంట... అది తెలుసునా''

తన తండ్రి గురించి చెప్పాడు అక్కడే వున్న తిమ్మడు.

అంత బాధలోను వారి మాటలు విన్న రత్తయ్య చిన్నగా నవ్వుకున్నాడు.

ఆ మరుక్షణం అతని స్మృతి పథంలో అతను పది సంవత్సరాల వయసులో వున్నప్పుడు జరిగిన ఒక సంఘటన మెరుపులా గుర్తుకొచ్చింది.

అప్పటికి రత్తయ్య తండ్రి మంచి మిడిప్రాయంలో వున్నాడు.

ఒక రోజున రచ్చబండపైన కూర్చొని యువకులంతా కబుర్లాడుకుంటూ ఒక పందెం వేసుకున్నారు.

'రచ్చబండ నుండి నడివీధిగుండా బట్టలు విప్పేసి నగ్నంగా ఊరి చివరివరకు ఎవరు ఒక్కసారి పోయి వస్తారో వారికి పదిహేను రూపాయలు బహుమానం' అని నిర్ణయించుకున్నారు. కానీ ఎవరూ అందుకు సాహసించలేదు.

చివరికి రత్తయ్య తండ్రి కోటయ్య ఆ పని చేసి గెల్చుకున్నాడు.

ఆ సమయంలో ఆడవాళ్ళంతా ఇండ్లలో దూరుకొని తలుపులు మూసుకున్నారట. అయినా కొందరు తలుపుల సందుల్లోనుండి ఆ దృశ్యం చూడనే చూశారట.

ఆ సంఘటనను ఇప్పటికీ ఊర్లో కథలు కథలుగా చెప్పుకుంటూ వుంటారు

తనతండ్రి ఆ పని ఎందుకు చేశాడో రత్తయ్యకిప్పటికీ గుర్తే

ఇంట్లో తిండి గింజల్లేక ఆ పూట యింటిల్లిపాదీ పస్తులుంటే గెల్చుకున్న పదిహేను రూపాయలతో అందరి ఆకలీ తీర్చాడు తన తండ్రి.

ఈ సంఘటన తలచుకునేసరికి రత్తయ్యకు శరీరంలోని సారా మత్తు కొద్దిగా దిగిపోయినట్లనిపించింది.

మెల్లగా గుడిసెవైపుకు నడిచాడు.

ఆ గుడిసె ముందర గౌరి, బాలకిష్టుడితో ఆడుకుంటోంది. ఆకాశంలో ఒక చుక్కలా వెలుగుతూ ఏదో విమానం పోతుంటే దాన్ని చూసి కదిలే చుక్క అనుకుంది గౌరి.

తమ్ముని కళ్ళు మూసిపెట్టి దానివైపు చూస్తూ...

"పలాన పలాన తావన పందిని కోసింతావన యాడనోనంటి! ఆకాసింలో వొగ సుక్కజోరుగా బోతా వుందంట. ఎక్కడో కనుక్కోచ్చ్'' అని మూసిన కళ్ళపై నుండి తన చేతులు తీసింది.

బాలకిష్టుడు ఆకాశంలో నడిచే నక్షత్రాన్ని వెదుక్కుంటున్నాడు.

గుడిసెలో రత్తయ్య భార్య ఆదెమ్మ చదునుగా వలయాకారంగా వున్న ఒక పలుచని రాతిపలకపైన సద్ద సంగటి పోసి దానినుండి ఎడమచేతిలోని మూకుడులోనికి కొంచెం కొంచెం తీసుకొని కుడిచేతితో దాన్ని నొక్కుతూ, అప్పుడప్పుడూ చేతిని నీటిలో అద్దుకుంటూ... గుండ్రంగా ముద్దలు చేస్తోంది.

ఒక్కొక్క ముద్దనే ఆ సంగటి బండపైనే ఒకవైపున వరుసగా పెడుతోంది.

సంగటి ముద్దలు గాలికి ఆరుతున్నాయి. వలిపొలిగా ఆరి కొంచెం గట్టిపడిన సంగటి ముద్దల్ని తీసి మాతంగి చట్టలో వేస్తోంది.

"మాతా! కొన్ని నీళ్ళియ్యమ్మణ్ణీ!" అడిగాడు అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టిన రత్తయ్య.

పక్కనే వున్న కంచుచెంబుతో కడవలోని నీళ్ళు ముంచి యిచ్చింది. నీళ్ళు తాగిన రత్తయ్య చొక్కాతీసి, పై కప్పునుండీ ఒక

వైపుకు వేలాడుతున్న దండెం కట్టె పైన వేశాడు.

దాని పక్కన ఒక చిన్న గాదె... దానికి ఆనించి ఒక రోకలి, కొన్ని దుడ్డు కర్రలు, వాటిపక్కన నేలపైన శిథిలావస్థలో వున్న ఒక చెక్కపెట్టె, దానిపైన పాతవైపోయి వున్న రెండు ముతకదుప్పట్లు, ఒక దిండు వున్నాయి. రెండు పాత తుంగచాపలు వాటికి ఆనించి వున్నాయి. అవి ఆ యింటి ఆర్థిక స్థితికి అద్దంపడుతున్నాయి.

ఆ గుడిసెలో ఉత్తరం వైపున గోడకు ఆనుకొని వారి ధనధాన్యాలు దాచుకునే దొంతి కుండలు మూడు వరుసలుగా, ఒక దానిపైన ఒకటిగా వున్నాయి.

ఆగ్నేయం వైపున మట్టితో చేసిన రెండు పొయ్యిలు, దానికి దక్షిణంవైపున రెండు నీటి కడవలు, వాటికి పైన గోడకు చెంబులు, గరిటెలు, కంచాలు వున్న ఒక చెక్క స్టాండు వున్నాయి.

రెండు పొయ్యిల్లో ఒక దానిపైన సంగటి చట్టి, మరో దానిపైన కూర చట్టి.

దొంతి కుండల్లో నుండి ఒక కడవను దించిన రత్తయ్య, తాను వేసుకుని వున్న గాడా బాడీ జేబులోనుండి కొన్ని చిల్లర డబ్బులు తీసి, ఆ కడవలో ఉన్న ఒక చిన్న మట్టి దుత్తలో వేశాడు.

సారా అంగడిలో తన తెలివితేటలతో మిగుల్చుకున్న డబ్బుల్ని ప్రతిరోజూ అందులో వేస్తుండడంతో ఆ బుడిగె ఇప్పుడు నిండుగా వుంది.

దాన్ని చూసినప్పుడంతా మాతంగి పెళ్ళి పైన అందమైన కలలు కంటాడు రత్తయ్య.

దాన్ని యథాస్థానంలో పెట్టి చేతులు, కాళ్ళు కడుక్కొని వచ్చి భోజనానికి కూర్చున్నాడు.

ఒక సత్తుగిన్నె కడిగి అతని ముందు పెట్టి, ఒక ముద్ద సంగటి, చింతకాయ ఊరిమిండి వేసి, ఒక సత్తుగ్లాసులో నీళ్ళు ముంచి, పక్కనే పెట్టింది మాతంగి.

"సిక్కంగా పుల్లంగా కారంగా... బలే బాగుండా దమ్మణ్ణి ఊరిమిండి''

అని ఊరిమిండిలో అద్దుకొని ఒక్కొక్క కబళాన్నే లొట్టలువేస్తూ... మింగుతున్నాడు రత్తయ్య.

"ఏమప్పా! రేపు అందరూ... బాయి పనికి పోతా వుండారు. నేనూ పోతాను''

నేల చూపులు చూస్తూ అంది మాతంగి.

"ఆడ ఎవురెవురొస్తారో ఏమో... పోకిరి నాయాండ్లంతా బాయి పని సేస్తారు. ఆడ పిల్లోల్లపైన మన్ను ఏస్తారు. గబ్బు గబ్బు మాట లంటారు గదా! మనూరోళ్ళయితే ఫరవాలేదు''

"వొప్పుకోనుండోది మనూరోళ్లే.. కూలోళ్ళు మాత్రం మేకలోల్ల పల్లోళ్ళు''

"మనూర్లో ఎవురొప్పుకోనుండేది?"

"ఊరికి ఎలేసినారు గదా! శివదాసు మామోళ్ళను, వోళ్ళు, వొప్పుకోనుండారు. అయినా మనూర్లో కిష్టన్నోళ్ళు, రాజమ్మ అందరూ పోతా వుండారప్పా. నేను పోతా?"

"ఆ యమ్మి కంత మునాసగా వుండాది. సావాసులంతా బోతా వుండారు. పోనీలే' వత్తాసుగా పలికింది ఆదెమ్మ.

"ఎలేసినోళ్ళ పనికి పోతే యెట్లాని'' అనుమానం వ్యక్తం చేశాడు రత్తయ్య.

"అందరూ బోతావుండ్లా... వోళ్లకు లేని ఎలి మన కెందుకప్పా!" చిరుకోపంగా అంది మాతంగి.

"మీయమ్మ కూ్కడా శానా మునాసగా వుండాది. నీకూ కుశాలగా వుండాది. సరే పొయ్యిరా... కానీ ఎవురేమన్నా నోరు సేసుకో వద్దు''

అని అన్నం తినడం పూర్తిచేసి, చేయి కడుక్కొని లేచాడతను.

ఆ విధంగానైనా కుటుంబ పోషణలో

తాను పాలు పంచుకుంటున్నందుకు, మరో వైపు శివదాసు పనికి పోతున్నందుకు ఆనందంతో మాతంగి మనసు గంతులేసింది.



**సూ**ర్యుడు అగ్ని గోళంలా మండిపోతున్నాడు. తన బావి దగ్గర చెరుకుతోట చూస్తూ నడుస్తున్నాడు వరదయ్య.

కరటక దమనకుల్లా ఆతన్ననుసరిస్తున్నారు మునిరాజు, పాపయ్య.

"మున్రాజు... నీ దొంగ సారాయి బిజినేసెట్టా ఉండాదీ'' ప్రశ్నించాడు వరదయ్య.

"యాడన్నా! ఈ సారాయి నిషేదమొచ్చిపడి చస్తా ఉన్నా. వ్యాపారం లేకుండా అయిపాయ. అంగిడి మూతబడె ఏం జేసేదీ'' యాష్టపోయాడు మున్రాజు.

"వరే... దానికే యిడైపోతావేందీ నీయమ్మ జిగుడా! నువ్వేమీ అంగలార్చొద్దు గానీ యింకో పంజెయ్యి''

"యేందో సెప్పన్నా'' ఆసక్తిగా అడిగాడు మున్రాజు.

"నీరా... అమ్మడానికి నేను లైసెన్సు తీసిస్తాగానీ నాతోబాటు ఒక మారి అయిద్రాబాదుకురా''

"అవును నీరాలో ఏం వరుంబడి వుంటుందన్నా'' పాపయ్య మధ్యలో కల్పించుకున్నాడు.

"వారే యర్రి మొహాల్లారా! మన మమ్మేది నాటు సారాయే... పేరు నీరాగా మారిపోతుందంతే'' అసలు విషయం చెప్పాడు వరదయ్య.

"అబ్బా! నీ బుర్రే పుర్రన్న ఆమేలు జేసి పెట్టు. జీవితాంతం బుణపడి వుంటా'' మెచ్చుకోలుగా అన్నాడు మున్రాజు.

"అవును గవర్నమెంటుకు తెలిస్తే ఎట్టా'' పాపయ్య అనుమానం వ్యక్తంచేశాడు.

"తెలిస్తే ఏమైపోతుందిరా బుసపత్తిరి... మనం సెక్రం తిప్పేస్తాం గదా... పైగా కాంట్రాక్టర్లంతా అదే పని గద చేస్తా ఉండేది. అందునా ఆ కాంట్రాక్టర్లలో సగంమంది ఎం.ఎల్.ఏలు, మంత్రులు ఉండ్లా, వోళ్లేగదా... బినామీ పేర్లతో వ్యాపారం జేస్తావుండేది...''

అలా పిచ్చాపాటీ మాట్లాడుతూ వెళుతున్నవారికి అప్పుడే తోటలోనుండి వెలుపలికొచ్చిన మునెప్ప కనిపించాడు.

"ఏంవిరా మునిగా! తోట పారిందా?"

వాళ్ళతో మాట్లాడుతున్న సంభాషణ అంతటితో ఆపి కటువుగా ప్రశ్నించాడు వరదయ్య.

"అయిదు గుంటలు నేల నిలిచి పూడ్చింది'' భయం భయంగా చెప్పాడు మునెప్ప.

"బాయిలో నీళ్లు లేవా?"

"ఉండాయి సాంవీ! కరెంటు పూడిసింది'' నసుగుతూ చెప్పేసరికి మండిపడ్డాడు వరదయ్య.

"కొంచెం తెల్లారిసరికల్లా లేసి సావంత్రీ అంటే యెనుములు మాదిరిగానిద్దరపోతారు లంజకొడుకులు. మిమ్మల్ని దున్నపోతుల మాదిరి మేపుకుంటావుండేది ఇంకెందుకురా?

రేపు ముందుగా తెల్లారి జాంవన్నేలేచి కరెంటు పొయ్యేసందికి పార గట్టెయ్'' అని




తోటవైపు చూస్తూ తిరిగి చెప్పాడు.

"కరెంటు వచ్చే లోపల పొయ్యి... ఆ ఉప్పుతోళ్ళ రత్తిగోన్ని పిల్చుకోన్రా... పో' పురమాయించగానే అక్కడినుండి వెళ్ళిపోయాడు మునెప్ప.

"నువ్వు జెప్పినట్లే... ఆ రత్తిగోన్ని సారాయి అంగిట్లోనుంచి తీసేసినా... ఇంక నువ్వు గెట్టిగా అడగాలన్న''

"ఈడు నా దెగ్గిరా బాకీ సేసినాడు. ఏదో పేదోడుగదాని సారాయి అంగిట్లో పెడితే... వోడిసెయ్యి మంచిది కాదు'' అన్నాడు మునిరాజు.

మాతంగి తనకు లొంగలేదని అవకాశమున్న ప్రతిరోజూ పట్టి బాధించి తన సత్తా ఏమిటో మాతంగికి తెలసేట్టుచేయాలన్న తలంపుతో ఉన్నాడు వరదయ్య.

అలా మాట్లాడుకుంటూ వరదయ్య బావి గడ్డనున్న కావిలి కొట్టంలోని అరుగుపైన కూర్చున్నారు వాళ్లు. అక్కడ అన్ని లోకాభిరామాయణాలు అయిన పిదప శివదాసు విషయం కూడా చర్చకు వచ్చింది.

"మొత్తానికి మునెప్ప పందులకు యిసంపోసి అనుకుంది సేసినాడు. ఆ శివదాసుగోడికి మనంవేందో... మన దెబ్బంటే ఏందో ఈ ఏలకు తెలుసుంటుంది''

తాము శివదాసును దెబ్బతీయడానికి వేసిన పథకం ఫలించినందుకు సంతోషంగా అన్నాడు మునిరాజు.

"అబ్బుడే ఏమైందీ! ఏడు తరాల్నుంచీ ఈ గ్రేమానికి పిన పెద్దలం మేం. అల్లాంటి మమ్మల్నే ఎదిరిస్తాడే వోడు. కానీ... ఇంకా... సూస్తా... ఆ మట్టి నా కొడుకు నా కాళ్ళ దెగ్గిరికొచ్చి తప్పయిపోయింది సాంవీ... అని సెంపలేసుకోని కాళ్లు పట్టుకోని యాడవాల" సీరియస్‌గా చెప్పాడు వరదయ్య.

ఇంతలో వారి సంభాషణకంతరాయం కలిగిస్తూ వచ్చి చేతులు కట్టుకొని వొంగి ఒకవైపుకు వదిగి నిలబడ్డాడు రత్తయ్య.

"ఏందిరో రత్తిగా వచ్చినావా?" గమనించనట్లే చూస్తూ... పలుకరించాడు వరదయ్య.

"ఎందుకో రమ్మన్నారంట"

"ఏం లేదురా... నా దెగ్గిర నువ్వు దుడ్డుతీసుకోని శానాదినాలై పూడిశ ఇంతవరకు అతీగతీ లేదు''

పిలిపించిన పని ఏమిటో అర్థమైపోయింది రత్తయ్యకు.

"కష్టాల్లో వుండాను. ఇబ్బుడివ్వలేను. సాంమీ'' నీళ్లు నములుతూ అన్నాడు.

"ఏందిరో నీ యవ్వ జిగుడా! అట్టాంటా వుండావు?" అన్నాడు వరదయ్య.

"ఏందిరో నా కొండె... నా అంగిట్లో యేమెు సిల్లరదుడ్లు ఎత్తేస్తివీ.. ఇబ్బుడేమో... ఆయనకివ్వలేనంటా వుండావు?" అనే అవకాశం దొరికిందిగదాని నోటికొచ్చినట్టు అనసాగాడు మునిరాజు.

ఎందుకో ఇద్దరూ చేరి తనపైన అనవసరంగా పగపట్టి ఇలా ప్రవర్తిస్తున్నారని తెలిసిపోయింది రత్తయ్యకు.

అయితే కారణం బోధపడలేదు. అందుకే అన్నాడు.

"ఎందుకు సామీ మాయట్టా పేదోళ్ళను... ఇట్టా అంటారు''

"ఆహా... ఆడికొచ్చినవంట్రా నా కొండే... ఇంకా ముసుగులో ఏందిరా నా బుసపత్తిరి. రేపు పొద్దునిగే సందికి నా దుడ్డు నాకు కట్టేయ్'' నిక్కచ్చిగా చెప్పేశాడు వరదయ్య.

"ఈ కరువుకాలంలో నేనేడ దెచ్చేదయ్యా'' దీనంగా అన్నాడు రత్తయ్య.

"అదంతా నాకనవసరం. నేజెప్పిన ప్రకారం గనక కట్టకపోతే మళ్ళా నేనేం జేస్తానో... నాకే తెలీదు'' అతని కంఠంలో క్రూరత్వం ధ్వనించింది.

నోటిమాట పెగలక అలాగే నిలబడిపోయాడు రత్తయ్య.

"పోనీ ఇంకో పంజేస్తే" పాపయ్య ప్రారంభించాడు.

ఏందన్నట్లు చూశాడు వరదయ్య.

"రేపు లోపల ఈడు ఎట్టాగు ఇయ్యలేడు. అందుకని వోని కొడుకును రెండేండ్లు మీ ఇంట్లోనే జీతానికి పెట్టుకుంటే... బాకీ తీరిపోతుందిగదా"

ఆ మాట వినగానే రత్తయ్యకు గుండెలో రాయి పడ్డట్టయింది.

బాకీ పేరుతో వారు సాగించే వెట్టిచాకిరీకి పన్నెండేండ్ల బాలకిష్టున్ని బలిచేయడానికి అతని మనసు అంగీకరించలేదు.

ఒక్కసారి ఆ ఊబిలో చిక్కుకుంటే... ఇక జీవితాంతం బానిసగా బతకాల్సిందే... తరాలు కష్టపడినా ఆ అప్పు తీరదు అనుకున్నాడు. కానీ గత్యంతరం లేదు.

అందుకే మౌనంగా వుండిపోయాడు రత్తయ్య. వారేం చెబుతున్నారో, తానేమి వింటున్నాడో తెలుసుకునే స్థితిలో అతను లేడు.

కానీ అతను తెలుసుకున్నదీ విన్నదీ ఒక్కటే. "ఇంక ఈళ్ల పెద్దోళ్లమాదిరి ఈడూ రెండు గాడిదలు పట్టుకోని వాటిపైన ఉప్పు మూటలు ఏసుకోని అమ్ముకోవాల్సిందే"

"ఊరూరు తిరగతా 'ఉప్పమ్మో ఉప్పో ఉప్పు' అంటూ అడక్కతినాల్సిందే"

వికటాట్టహాసాల మధ్య వారంటున్న మాటలు సూదుల్లా అతని హృదయానికి గుచ్చుకుంటున్నాయి.

ఆ మాటలు వింటూ ఇంకా అక్కడ నిలబడలేక తడబడుతున్న అడుగులతో మౌనంగా అక్కడినుండి వచ్చేశాడు రత్తయ్య.

రానురాను రత్తయ్య పరిస్థితి గడ్డుగా తయారయింది. ఎంత కూలీనాలీ చేసినా.. ఏమీ మిగలడంలేదు. సంపాదించేదంతా ఇంటి ఖర్చులకే సరిపోతోంది.

వరదయ్య బాకీ తీరే మార్గమే అతనికి కనిపించడంలేదు. దాంతో కొడుకును కూడా స్కూలుకు నిలిపేశాడు. మొదట బాలకిష్టుడు స్కూలు మానడానికి ససేమిరా వప్పుకోలేదు. అయిదు పాసయ్యాడు. ఆర్లో చేర్చాలి.

ఆర్లో చేరతానన్న సంబరం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసింది. కానీ ఆర్లో చేరడానికి తగినంత ఫీజుగానీ, పుస్తకాలు కొనడానికి అవసరమైన డబ్బులుగానీ తన తండ్రి దగ్గర లేవని ఆ చిన్నారి మనసుకు తెలియలేదు.

తనతోటి పిల్లలు అప్పుడే హైస్కూల్లో చేరిపోయారు. తన తండ్రి ఇంకా నన్నెందుకు స్కూల్లో చేర్పించలేదు. అనుకొని ఆవేదన చెందాడు.

చివరికి ఒకరోజు తండ్రిని నిలదీసి 'అప్పా! నా సావాసగాళ్లందరూ స్కూల్లో చేరిపోయినారు. వోళ్లంతా నాకంటే బాగా సదివేటోళ్లుగాదు. అయినా సేరిపోయినారు. నన్నూ ఆర్లో సేరిపించప్పా' అని అడిగేశాడు.

"పోనీలే నాయనా! వోళ్లు ఉన్నోళ్లు... ఎన్నైనా సదుగుతారు.. అయినా పందులమేపుకునేవోళ్లం మనకెందుకు నాయనా సదుగు" అన్నాడు రత్తయ్య.

తన కొడుకును బాగా చదివించాలని రత్తయ్యకూ వుంది. కానీ తన ఆర్థిక పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని ఆ మాటనక తప్పలేదతనికి.

ఆ మాటతో తండ్రికి ఎదురు చెప్పలేక మౌనంగా ఉండిపోయాడు బాలకిష్టుడు.

కానీ ఎలాగో ఓలాగు పుస్తకాలయినా సంపాదించుకుంటే లేనోళ్ల హాస్టల్లో నుండయినా సదూకోవచ్చు. మరి పుస్తకాలు సంపాదించే మార్గం ఎట్టా! అనుకుంటూనే ఉన్నాడు అప్పుడప్పుడు.

★ ★ ★

ఆ రోజు ఆదివారం.

అది జమిలిగడ్డలో సంత రోజు.

సమయం మూడు గంటలు. చుట్టుప




క్కల రైతులు, వ్యాపారస్తులు, కూరగాయలు, సరుకులు సంతతోపులోకి తీసుకొచ్చి వ్యాపారం ప్రారంభిస్తున్నారు.

అది సంతకుండే సమయం కాబట్టి చుట్టుపట్టులనుండీ ప్రజలు ఊరికి ఉత్తరానుండే సంతతోపులోకి చేరుకుంటున్నారు. వెచ్చాలమ్మేవాళ్లు, దుస్తులమ్మేవాళ్లు, తమలపాకులు, పొగాకు, దుగ్గ దుగ్గాణం అమ్మేవాళ్లు, మిఠాయి అంగళ్లవాళ్లు, బొరుగులు, టెంకాయలు, కడ్డీలు అమ్ముకునే వాళ్లు... ఇంకా అనేక రకాలయిన చిల్లర సామాన్లు అమ్ముకునేవాళ్లు... కేకలేస్తూ 'అగ్గవకొల్లగ్గవ' అంటూ వచ్చిపోయేవాళ్లను ఆకర్షిస్తున్నారు. వింత వింతగా అరుస్తున్నారు.

పిల్లాజల్లా, ముసలీముతకా, చిన్నాపెద్దా తేడా లేకుండా చేతుల్లో చిన్నపాటి సంచుల్ని పట్టుకొని క్రిక్కిరిసివున్నారు.

సంతకు చివర ఓ కుమ్మరి బండికూడా ఆగివుంది. ఆ బండిలో కొన్ని కొత్త మట్టి పాత్రలున్నాయి. మరికొన్ని మట్టిపాత్రలు బండిముందర అనేక సైజుల్లో వరుసగా పెట్టబడివున్నాయి.

బండికి ముందర 'ముక్కెన'కు కట్టివేయబడివున్న బండినిలాగే ఎద్దు వరిగడ్డిమేస్తూ వుంది. ఆ వంటెద్దు బండికింద నీడలో కూర్చొని కుమ్మరి కుప్పయ్య కుండలు అమ్ముకుంటున్నాడు. కుప్పయ్యది మేకలోళ్ల పల్లెకవతలున్న కుమ్మరపల్లె, ఆ గ్రామానికంతా పేరు మోసినవాడు కుమ్మరశెట్టి కుప్పయ్య. ఆతని కుండలకు గిరాకీ ఎక్కువ. ఆ బండికి పక్కనే.. బారెడు వెడల్పుతో రెండు చువ్వలు నేలలోపాతి... వాటికి ఒక వెడల్పాటి ప్లాస్టిక్ కాగితం కట్టి, దానినీడలో మధ్యన కూర్చొని సరుకులమ్ముకుంటున్నాడు పుంగనూరు పుంగన్న.

కుంకుమ, పసుపు, చిన్నచిన్న సుగంధ ద్రవ్యాలు, రకరకాల పూసల దండలు... వివిధ రకాలయిన వీధి నాటక పుస్తకాలు, పురాణాలకు సంబంధించిన అనేక పుస్తకాలు, కావ్యాలు... పుంగన్న అంగడిలో వస్తువులు. ఇంకా సెకండ్‌హ్యాండు పాత పుస్తకాలను కూడా పుంగన్న సగం రేటుకే అమ్ముతుంటాడు. అటువంటివి ఒకటో క్లాసునుంచీ పదో తరగతి వరకు అన్ని సబ్జక్టు పుస్తకాలు ఆతని కొట్టులో లభిస్తాయి.

సంతలో అమ్మేవాళ్లు, కొనేవాళ్లు ఎవరికి వారే అన్నట్లున్నారు.

ఒక చేతిసంచీతో బాలకిష్టున్ని వెంటబెట్టుకొని సంతలో ప్రవేశించాడు రత్తయ్య.

ఆతన్ని చూసీ చూడగానే సంత మొగదల ఉన్న కూరగాయల వాళ్లు "శేరు అర్ధరూపాయి... కమ్మపల్లె వంకాయలు... నాటు కాయలు కొల్లగ్గవ" అని ఒకరు.

"శేరు టొమాటోలు ఒకేపావలా... అయిపాయె... కొనండీ.. రాన్నా రాన్నా అయిపాయె'' అని మరొకావిడ.

"పొట్లెలికూర మాదిరితో ఉండాదన్న వొగో ఎరగడ్డ... రాన్నా... కేజీ నాలుగే రూపాయలు రా... రా'' అని ఎరగడ్డలమ్మే అతను.

అట్లే మొటిక్కాయలు, బీన్సుకాయలు, తెల్లగడ్డలు అమ్మే రైతులు ఒకేసారి కేకలేస్తూ పిలిచారు.

అలాగే మిగిలిన వ్యాపారస్తుల అరుపులు చెవులు చిల్లులు పడేట్టున్నాయి... చెరువులో చేరిన కొత్త నీళ్లల్లో కప్పల్లా అరుస్తున్నారు. గందరగోళంగా అరుస్తున్నారు.

గబగబ కావాల్సినవి కొన్ని కొనుక్కొని తను మామూలుగా వెచ్చాలు కొనే పుంగన్న దగ్గరకు చేరుకున్నాడు రత్తయ్య.

సరుకుల బ్యాగును బాలకిష్టుడు భుజానికి తగిలించుకుని తండ్రిని అనుసరించాడు.

"అప్పా! బరువుగా వుండాది బ్యాగుదీసుకో!" అని ఆ సంచిని తండ్రి చేతికిచ్చి ఆతని పక్కనే నిలబడ్డాడు బాలకిష్టుడు. తీసుకున్న సంచిని వడిలో పెట్టుకుని అంగడికి చివరన

కూర్చొని "ఏం పుంగన్నా బాగుండావా?" అంటూ పలుకరించాడు.

"ఏదో మీ దయప్పా! ఇట్టుండాగానీ.. ఏం గావాల సెప్పు" అన్నాడు పుంగన్న.

"మా దయ ఏముంది. అంతా మహన్ని భావుడు పరమాత్తుని దయగానీ... నాకు వొగ రూపాయికి గసాలు, అర్ధరూపాయి ఆవాలు, ఒక రూపాయికి తెల్లగడ్డలు'' అంటూ లిస్టు చెప్పాడు రత్తయ్య.

రత్తయ్య అడిగిన వస్తువుల్ని గబగబ తూకంవేసి పొట్టాలు గడుతూ "ఆ యింగా.. ఆ యింగా'' అంటూనే వచ్చిపోయే వాళ్లకే సరుకులిస్తూ, చిల్లర తీసుకుంటూ బేరం చేయసాగాడు పుంగన్న.

బాలకిష్టుడు అంగడంతా పరిశీలనగా చూడసాగాడు. అలా చూస్తుంటే.. ఆతని పక్కనే వరుసగా పేర్చఖడి వున్న పాత పుస్తకాలు, వాటి పక్కన పెన్సిళ్లు పేనా లుండే పెట్టె ఆతని దృష్టిని ఆకర్షించి వాటినే తదేకంగా చూడసాగాడు. అక్కడ పుస్తకాల దొంతర్లో పైన ఆరవ క్లాసు సైన్సు పుస్తకం పైన ఆతని దృష్టి పడింది.

పెద్దపెద్ద అక్షరాలతో అందంగా ముద్రించి వున్న సామాన్య శాస్త్రం ఆరవ తరగతి అన్న అక్షరాల్ని మురిపెంగా చూస్తూ చదివాడు.

ఆ తర్వాత మెల్లగా ఆ పుస్తకాన్ని చేత్తో పైకి లేపి దాని కింద పుస్తకం చూశాడు. అదీ ఆరో క్లాసు పుస్తకమే. దానికింది పుస్తకాన్ని తన మునివేళ్లతో పైకి లేపి చూశాడు. అదీ ఆరో తరగతి పుస్తకమే.

అవన్నీ పాతవి... ఆరు గట్టెక్కి ఏడో క్లాసుకు పోయిన పిల్లలు తూకానికి అమ్ముకు న్న పుస్తకాలు. వాటిని పుంగన్న అర్ధరేటుకే అమ్ముతాడు.

అందుకే తన ఎడమ చేతితో మెల్లగా రత్తయ్య భుజాన్ని గోకి, కుడిచేత్తో ఆ పుస్తకా ల్ని చూపిస్తూ... 'అప్పా! ఆరో క్లాసు పుస్తకా లు' అన్నాడు.

ఆ మాట విని సీరియస్‌గా ముఖంపెట్టి, తిరిగి తన పనిలో తను మునిగి పోయాడు రత్తయ్య.

మళ్లీ కొంతసేపటికి ఆతని భుజం గీరి 'అప్పా!' అన్నాడు.

"ఏంగావాల్రా'' అన్నాడు తీక్షణంగా చూ స్తూ రత్తయ్య.

"నేను మళ్లీబడికి పోతానే!" గోముగా అడిగాడు బాలకిష్టుడు.

"అబ్బబ్బ.. కొంతసేపు గొమ్మునుంటా వా?" కసిరినట్టు అన్నాడు రత్తయ్య.

అది గమనించిన పుంగన్న 'ఏంగావా లంట అబ్బోడికి?" అన్నాడు.

"బడికిపోవాలంట.. పుస్తకాలు కొనమంటా డు'' అని అనాలోచితంగానే అసలు విషయం చెప్పాడు రత్తయ్య.

"ఎంతమంచి బిడ్డయ్య మీయబ్బోడు. అందరి పిల్లోళ్లు మిఠాయిలు, బొరుగులు గావాలని సతాయిస్తారుగానీ... మీ యబ్బో డు మాత్రం బడికిపోతానంటావుండాడు. ఇంత పిల్లోడైనాడు యింకా బడికి పంపించ లేదా?" పొట్లాలు కడుతూనే అడిగాడు పుంగ న్న.

"యాడన్నా! పోతావుండే... ఈ తూరే.. అయిదు పాసయినాడు. బడికి ఆపేసినా?"

"ఎందుకనీ?"

"కాయకష్టం చేసుకునే వోళ్లం... జరగ ద్దా... అయిన వోడు సదూకోని రాజ్యాలేలా ల్నా పాడా. బస్సులుమీంద రాసిండే ఊర్లపే ర్లు, జాబులు సదూకుంటేసాలు''

"ఏందో యిశిత్రం... డబ్బునోడికి సదు వురాదు. సదువుకునేవోడికి దుడ్డుండదు. సరే గానీ... యింగేంగావాలంటివి అది సెప్పు" అని అడిగాడు.

"గసాలు అవీ గట్నావా?"

"ఆc అయిందిl"




ఇంతలో ఓ పద్దెనిమిదేళ్ల యువకుడు కాఫీ తెచ్చిచ్చాడు.

"ఇతనెవరు పుంగన్నా. నేనెప్పుడూ సూడలేదే" అన్నాడు రత్తయ్య ఆతన్ని ఎగాదిగా చూస్తూ.

"మాయక్క కొడుకులే ఊరికే ఇంట్లో బడుంటే సాయంగా రమ్మన్నా"

"ఏం సదిగినాడు.. షర్టు ప్యాయింటు బలంగా యేసిండాడు"

"వోడి మొహం... పది పదిసార్లు రాసి పాసుగాలేక, అట్ట ఏ ఉద్యోగమూ లేక యింట్లోనే ఉండాడు..."

తనను గురించి ముక్కుమొహం తెలీని వ్యక్తికి అలా చెప్పడం నామోషీగా భావించి ముఖం గంటు పెట్టుకొని అటువైపుకు తిరుక్కున్నాడా అబ్బాయి.

"ఆc... యింగేంగావాల!" కాఫీ చేసిన గ్లాసుని ఆతనికి తిరిగిస్తూ, దానికి తగిన చిల్లర కూడా గల్లా పెట్టెలో నుంచీ తీసిస్తూ అన్నాడు.

ఇంతలో మరో యిద్దరు వచ్చి 'పుంగన్నా మాకూ సరుకులు గావాల' అంటూ వచ్చి రత్తయ్య పక్కగా నిలబడ్డారు. వారి తర్వాత ఓ నడివయసు వ్యక్తి 'పుంగన్నా! వేములపల్లి రాయబారం నాటకంగావాల ఉండాదా?' అంటూ వచ్చాడు.

"ఆc... ఉండాది... దా పక్కన పుస్తకాల్లో ఉండాది సూసుకో... పది రూపాయలు" అన్నాడు పుంగన్న.

మళ్లీ భుజంగీరాడు బాలకిష్టుడు.

"అప్పా! నాకు పుస్తకాలు..." అంటూ బుంగమూతి పెట్టాడు.

"యిప్పుడెందుకు లేరా.. చేతిలో దుడ్డులేదు" బుజ్జగింపుగా అన్నాడు రత్తయ్య.

"అన్ని సరుకులు కొన్నావే... పుస్తకాలకు, ఫీజుకు మాత్రందుడ్డుండదా?" నిలదీసినట్టు అడిగాడు బాలకిష్టుడు.

పుస్తకాలకు, ఫీజులకు సరిపడే డబ్బులుంటే రెండు మాసాలు నిశ్చింతగా సంసారాన్ని నెట్టుకు రాగలడతను. కానీ వారానికి సరిపడే డబ్బులు కూడా లేవు.

అందుకే సగానికి సగం తగ్గించి సరుకుల్ని తీసుకుపోతున్నాడు. అలాంటిది.. కొడుకుకు కావాల్సిన డబ్బులు ఎక్కడినుంచి తెస్తాడు? అందుకే "వోరే నోరుమూసుకోని గొమ్మునుంటావా, రెండిగ్గమంటావా?" అన్నాడు కటువుగా.

తండ్రి గదమాయింపుతో ఏమ్మాట్లాడలేక అలాగే, ఆ పుస్తకాలవైపే చూస్తూండిపోయాడు బాలకిష్టుడు.

పుంగన్నకు డబ్బులు చెల్లించి సరుకులు తీసుకొని సంచిలో వేసుకొని కుండలు కొనడానికి కుప్పయ్య దగ్గరకు వెళ్లాడు.

అక్కడ ఓ కూరసట్టిని చేతిలోకి తీసుకొని.. ఒక చేత్తో, వేళ్లు మడిచి కుండపైన కొట్టాడు. ఆ దెబ్బలకు అది ఖంగుఖంగున మోగింది.

'ఆ బాగుంది' అనుకుని "ఎంతబ్బా ఇది?" అని అడిగాడు.

"మూడు రూపాయలన్నా" అన్నాడు కుప్పయ్య.

"ఇచ్చే రేటు చెప్పు" అన్నాడు రత్తయ్య.

"వొగ అర్ధరూపాయి తగ్గిస్తా... అంతకంటే తక్కువైతే రాదన్నా"

"సరే వొంటిసట్టి ఎత్తకపోకూడదంటారు. దీనిమీదికి మూకటొకటియ్యి"

ఆతనడిగిన మూకుడు అందిచ్చాడు కుప్పయ్య. ఇంతలో 'పట్టుకో! పట్టుకో... తన్ను వాన్ని' అంటూ ఓ వ్యక్తి ఓ పిల్లవాన్ని తరుముకొచ్చాడు.

"దొంగముండాకొడకా... వేలుడంత లేవు.. దొంగతనం చేస్తావా..." జుట్టుపట్టి వంగదీసి వీపున ఒకటిచ్చాడా వ్యక్తి.

"అప్పా!" అన్నాడా పిల్లవాడు. తిరిగి

చూశాడు రత్తయ్య.

ఎదురుగా బాలకిష్టున్ని బాదుతున్నాడా వ్యక్తి.

ఆ వ్యక్తి పుంగన్న మేనల్లుడే...

"వోరబ్బా... యిడిసి పెట్రానాయనా... వాడు మా పిల్లోడు'' అంటూ అడ్డుపడ్డాడు రత్తయ్య.

"మీ వాడా.. యిట్టాంటోళ్లను కని దేశింపైన వదిలేస్తే ఎట్టయ్యా..." అంటూ తల ఎగరేసి మాట్లాడాడా అబ్బాయి. ఆ మాటతో రత్తయ్యకు తల తీసేసినంత పనయింది.

"ఏం జేసినాడయ్యా!" అన్నాడు బాలకిష్టున్ని అక్కున చేర్చుకుంటూ...

"యిద్దో... ఈ ఆరో తరగతి పుస్తకాలు... వగటికాదు రెండుగాదు... నాలుగు పుస్తకాలు.. మేం బేరం జేసుకుంటా వుండంగానే ఎత్తుకోనొచ్చేసినాడు'' అంటూ ఆతని చేతిలోని పుస్తకాల్ని చూపించాడు.

ఆ వింత చూడడానికి సంతలో ప్రజలు సగంమంది అక్కడ గుమికూడిపోయారు.

దాంతో ప్రాణం బిక్కచచ్చిపోయింది రత్తయ్యకు. పళ్లు పటపట కొరుకుతూ, చేతిలో చట్టిని అక్కడే పెట్టేసి, బాలకిష్టుడి చేయిపట్టుకొని "ఇంటికి పదరా నీ పని చెప్తా'' అంటూ లాక్కొని సంత వెలుపలికి దారితీశాడు.

సంతగేటు దాటుకొని రోడ్లో కొస్తూనే వీపున రెండు అంటించి "నిన్ను బడిగ్గాదురా... పందల కాడకేస్తా పద.. యింకా మాట్లాడితే... గాడిది పైన ఉప్పు మూట్లేసి, అమ్మక రమ్మంట పదరా'' అంటూ ఇంటికి లాక్కెళ్లాడు.

ఇటు తండ్రి, అటు షాపువాళ్లు కొట్టినా, తిట్టినా, దొంగ అని అన్నా బాలకిష్టుడు బాధపడలేదుగానీ.. తండ్రి అన్న 'పందలకాడికేస్తాను, ఉప్పు మూట్లేసి అమ్మక రమ్మంటాను' అన్నమాటలకే ఎక్కువ క్రుంగిపోయాడు. ఆ బాధతో ఆ రాత్రంతా జాగరణమే చేశాడు బాలకిష్టుడు.

వరదయ్య బచ్చన్న కుంట్లో యిటుక కోయిస్తున్నాడు.

గూడెం వాళ్ళు వచ్చి ఎత్తివెళ్ళిన బండల మిద్దెకు అవసరమైన ఇటుక అక్కడ తయారవుతోంది.

ఉప్పుతోళ్ళ రాముడు, తిమ్మడు, గంగడు యింకా చాలామంది ఇటుక కోసే పనిలో నిమగ్నమై వున్నారు.

ఇటుకకు కావాల్సిన నీటిని వరదయ్య తన బావినుండి ఒక రబ్బరు గొట్టంద్వారా సరఫరా చేయిస్తున్నాడు.

శివదాసు వప్పుకున్న సాంబయ్య బావి పని పూర్తి కావస్తోంది. బచ్చన్న కుంట్లో వరదయ్య ఇటుక పని మహా జోరుగా జరిగిపోతుంటే... ఇటుక కాల్చడానికి అవసరమైన కట్టె కూడా అక్కడే ఎండుతోంది.

కొట్టి వేయబడిన చింత మాన్లు, సీమరాల మాన్లు, కానగ మాన్ల కట్టెలు అక్కడే ఒక పెద్ద గుట్టలా కనిపిస్తున్నాయి.

రత్తయ్యను ఆ యిటుక పనికి రానియ్యలేదు. గత్యంతరం లేక రత్తయ్య, గౌరీ, మాతంగి, ఆదెమ్మలు కూడా బావి పనికే వెళుతున్నారు. ఎలాగైనా సరే... వీలయినంత త్వరగా డబ్బులు కూడబెట్టి, బాలకిష్టున్ని విడిపించాలని ఆతని ప్రయత్నం.

కానీ ఆ కూలీ డబ్బులు సంసారానికే సరిపోతోంది. ఇంక మిగిలేదెక్కడ?"

అందుకే... తనకు బాగా తెలిసిన సారా కాచే విద్యను కూడా ఉపయోగించుకోవాలనుకున్నాడు.

పగలు కూలి పని చేస్తూనే ఎవ్వరికీ తెలీకుండా సారా దించడం ప్రారంభించాడు రత్తయ్య.

కాచిన సారాను రహస్యంగా తక్కువ ధరకు అమ్మ సాగాడు. ఇంట్లో తెలీకుండా తాగేవారు, సారాని ప్రత్యక్షంగా తాగడం





నామోషీగా భావించేవారు అందరూ రత్తయ్య సారానే ఆశ్రయించారు. సారా నిషేధంవల్ల వ్యాపారం బాగానే సాగిపోతోంది.

రహస్య మధుసేవకులకు అనతికాలంలోనే రత్తయ్య ఇల్లు వర ప్రసాదమైపోయింది.

తక్కువ ధరకు ఘాటుగా వున్న సారా... సులభంగా దొరకడంతో అటు గూడెం వాళ్ళు, ఇటు మేకలోల్ల పల్లె వాళ్ళు రత్తయ్య ఇంటికి రాసాగారు.

దాంతో రత్తయ్య సారా వ్యాపారం మూడు గ్లాసులు, ఆరు పెగ్గులుగాను, ఆరు పెగ్గులు, పన్నెండు కిక్కులుగాను దినదిన ప్రవర్థమానమవుతోంది.

దీంతో మునిరాజు దొంగ సారా వ్యాపారం దెబ్బతినే స్థాయికి చేరుకుంది. అసలు విషయం తెలుసుకున్న మునిరాజు సహించలేక పోయాడు. అగ్గిమీద గుగ్గిలంలా ఎగిరిపడ్డాడు.

వెంటనే పోలీసులకు కబురు పంపాడు.

పోలీసులు రంగంలోకి దిగి రత్తయ్యను రెడ్‌హాండెడ్‌గా పట్టుకోవడానికి పథకాలు వేస్తున్నారు.

పైగా మునిరాజు ముట్ట జెప్పిన పైకంతో పోలీసులు ఎలాగైనా సరే... రత్తయ్యను బొక్కలో తోసెయ్యాలని చూస్తున్నారు.

అయితే రత్తయ్య సారా ఎక్కడ కాస్తున్నాడో ఎవరికీ తెలీదు. ఆ విషయం అందరికీ అంతుచిక్కని విషయం. కానీ రత్తయ్య మాత్రం తన ఇంట్లోనే సారా దించుతాడు.

ఆ రోజు సాయంత్రం.

పగలంతా కండలు పిండుకొని వచ్చిన గూడెం ప్రజలంతా ఇంటిదగ్గర ఎవరి పనుల్లో వారు మునిగివున్నారు.

కొందరు అప్పటికే అన్నాలు తిని పడుకోవటానికి సిద్ధపడుతున్నారు.

రత్తయ్య మాత్రం తన యింట్లో... ఒక పొయ్యిమీద ఒక పెద్ద కడవ పెట్టాడు. దానికి సగానికి పైగా తుమ్మచెక్క ఊట వుంది. దాని కంఠం కిందిభాగంలో ద్రవానికి పైన ఒక చిన్నరంధ్రం చేయబడి వుంది. దానికి మూరెడు దూరంలో వున్న పక్కపొయ్యి మీద వెడల్పు మూతిగల ఒక పెద్ద అల్యూమినియం డాక్షా వుంచాడు. దానికి సగానికి పైగా చల్లని నీళ్ళు పోశాడు. ఆ నీటిలో కంఠం వరకు మునిగిపోగల మరొక చిన్న మట్టిపాత్ర వుంచాడు.

ఒక సన్నని పరింది (బొప్పాయి) ఆకు బుర్రను తీసికొని ఊట కడవకున్న రంధ్రంలో దాన్నుంచి, దాని రెండో చివరను డాక్షాన్‌లోని మట్టిపాత్రలో పెట్టాడు. దానిపైన మట్టి మూకుడు వుంచాడు. లోపలి గాలి వెలుపలికి రాకుండా తడిబట్టలు చుట్టేశాడు. పరింది బుర్ర పొడవునా తడిగుడ్డ పీలికలు చుట్టాడు.

ఆ తర్వాత ఊట కడవపైన మరొక మూకటి వుంచి కింద మంట వేశాడు.

క్రమేపి ఆ ఊట వేడెక్కి మరిగి దాని ఆవిరి పరింది బుర్ర గుండా వచ్చి చల్లబడి డాక్షాన్‌లోని మట్టిపాత్రలోకి చేరి ద్రవీభవించి సారాగా వడుగుతోంది. అలా చాలాసేపు కాచిన పిదప ఊటలోని ద్రవమంతా ఆవిరై కడవలో సారాగా మారి... ఆ సారాతో డాక్షాలోని కడవ నిండిపోయింది.

ఆ పనికి యింటిల్లపాదీ అతనికి సహకరిస్తున్నారు.

వేడికి వాడబారివున్న పరింది బుర్రను తీసి, తడి బట్టను విప్పి బుర్రను విరిచి ఊట తొక్క వున్న బానలో వేసి, దాన్ని జాగర్తగా దించాడు. కొద్దిగా చల్లారిన పిదప ఆ బానను, యింటి వెనుక వైపున ఆరుబైలు చేనులోకి తీస్కుకెళ్ళి... అక్కడ ఒక గొయ్యి తవ్వి, ఆ తొక్కను అందులో వేసి తిరిగి మట్టికప్పేశాడు.

చెంబుతో నీళ్ళు తెచ్చి అక్కడే ఊటబానను బాగా కడిగి శుభ్రంచేసి సారా వాసన రాకుండా జాగర్తపడ్డాడు. ఆ తర్వాత దాన్ని తీసుకువచ్చి పందుల గుడిసెముందుర పెట్టి

అందులో కుడితినీళ్ళు పోసేశాడు.

ఇప్పుడు ఆ కడవ నుండి సారా వాసనకు బదులు కుడితి నీళ్ళ వాసన వస్తోంది.

సారా కాచిన చిహ్నాలు ఎక్కడా కనిపించ కుండా ఆ విధంగా జాగర్తపడిన రత్తయ్య ఏదో పనిమీద వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఇంతలో ఆదెమ్మ డాక్షాలో వున్న సారా దుత్తనుదించి, పక్కన పెట్టింది. వెంటనే మాతంగి ఆ డాక్షాను యింటి పెరటిలోకి తీసుకెళ్ళి అందులోని నీటిని బాగా పాతబడి వున్న నీటి తొట్టిలోపోసి తిరిగి దాన్ని తెచ్చి యింట్లో పెట్టింది.

ఇంతలో వున్నట్టుండి గౌరి వీధిలోనుండి గాబరాగా పరుగెత్తుకుంటూ యింట్లోకి దూసుకువచ్చింది.

"ఏందమ్మా ఆ పరుగు మెల్లగా రాలేవు. ఏడన్నా పడితే యెట్లా?" దండింపుగా అంది ఆదెమ్మ.

"అమ్మా! అమ్మా! ఎవురో పేయింట్లేను కోసి వస్తావుండారమ్మా! పోలీసోళ్ళ మాదిరుండారు. మబ్బులో సరీగా కనిపించలా... వోళ్ళు రత్తయ్యిల్లు ఎక్కడా అని ఈదిలో అడగతా వుండారు'' గసపోసుకుంటూ చెప్పింది గౌరి.

"నిజంగానంటే?"

"అవునమ్మా!" దేవున్తో వట్టుపెట్టుకుంది.

"అమ్మా! మనం సారాయి కాస్తా వుండేది ఎవురైనా సెప్పింటారు. మనింటికే అయుంటుంది. యిబ్బుడేంజేయాల"

భయం భయంగా అంది మాతంగి. ఆదెమ్మ చాలా తెలివైంది. అందుకే ఆమె మెదడు చురుగ్గా పని చేసింది.

"నువ్వు పోలీసోళ్ళ కండ్ల పడొద్దు తల్లీ! వోళ్ళు సూపులంత మంచివిగావు. నువ్వు పక్కింట్లోకి పోయమ్మా'' అని కూతుర్ని హెచ్చరించి గబగబ యింట్లో నుండి ఒక పాత సంచి పట్టను తెచ్చి యింటిముందర వేసి, సారా దుత్తను మూకుడితోసహా అలాగే తెచ్చి, ఆ సంచి పట్టపైన పెట్టి కూర్చుంది.

గౌరి, మాతంగి పక్కింట్లోకి వెళ్ళి తల్లి ఏం చేస్తుందోనని భయంగా, ఆదుర్దాగా దూరంనుండి ఆమెనే చూస్తున్నారు.

ఆదెమ్మ సంచిపట్టపైన గొంతు కూర్చొని సారా దుత్తను కాళ్ళ సందున చీరకింద దాచేసింది. ఎట్టి పరిస్థితుల్లోను ఆ దుత్త కనిపించకుండా చీర కుచ్చిళ్ళు చుట్టూ సర్దుకొని మూలుగుతూ కూర్చుంది.

ఇంతలో రానే వచ్చారు ఆగంతకులు! ఒక సబిన్స్పెక్టర్, ఇద్దరు కానిస్టేబుల్స్!

వారిని చూడగానే ఆదెమ్మ గుండె జల్లుమన్నా ఆ మరుక్షణంలోనే మళ్ళీ సర్దుకుంది.

"రత్తయ్యిల్లు యిదేనా?" చేతిలోని స్టిక్ తిప్పుతూ ముద్దాయి నడిగినట్లు కఠినంగా అడిగాడు యస్.ఐ.

"అవును సామీ! ఏమి సామీ?

అమ్మో! అయ్యో! మా యింటికెందుకొచ్చినారు సామీ? అయ్యో! అమ్మో! దేవుడా!" అని మూలుగుతూనే అంది.

ఎక్కడ కనుక్కుంటారో అన్న భయం హృదయంలోనే అణుచుకుంటూ వుంది.

"చూడండి సార్! ఏమీ తెలీనట్లు అడుగుతోంది నంగనాచి''

కొరకొర చూస్తూ అన్నాడొక కానిస్టేబుల్. "లోపలెదకండి తెలిసిపోతుంది'' అని యస్.ఐ. ఆర్డర్ వేయగానే దొంగను వాసన పట్టబోతున్న పోలీసు కుక్కల్లా యింట్లోకి జొరపడ్డారు కానిస్టేబుల్స్.

ఇంట్లో కడవలు, దొంతులు, చట్లు, యితర పాత్రలు అన్నీ వెదికారు.

కొన్ని వస్తువులు నేలకేసి కొట్టి చిందర వందర చేశారు.

"ఏంది సామీ! యింట్లో అట్ల జొరబడినారు?" కదలకుండానే అడిగింది ఆదెమ్మ.

"కేడీ నాకొడుకు జాగ్రత్త పడినాడు. దొంగ




ముండా! నీ మొగుడుండాడే... వాడెక్కడ?"

కర్కశంగా చూస్తూ అడిగాడు యస్సై.

ఆదెమ్మ మెదడు మరొక్కసారి షార్పుగా పనిచేసింది.

"నిన్న మద్దేనం కాడ ఊరికి పోయినాడు. యింకా రాలా రేపొస్తాడు సామీ!"

"అమ్మా! నాయనో! ముండ జొరం యిబ్బుడే రావాల్నా?" మూలుగుతూనే చెప్పింది.

"నీ మొగుడు దొంగ సారా కాస్తున్నాడని మాకు సమాచార మందింది. అందుకే వచ్చాం"

అసలు విషయం చెప్పాడు యస్సై.

ఇంతలో యింట్లో నుంచీ ఒక కానిస్టేబుల్ వెలుపలికి వచ్చి నిలబడ్డాడు.

"కొంపలో సారాయి కాస్తా వుండారా లేదా? నిజం చెప్పేయ్. లేకుంటే నీ తోలు వల్చేస్తాం లం..." అంటూ లాటీ ముందుకు చాపి గదమాయించి అడిగాడు కానిస్టేబుల్.

"అదెట్లాటిదో మాకు దెలీదే" నిక్కచ్చిగా చెప్పింది.

చుట్టుపక్కల యిండ్లల్లో అప్పుడే ప్రజలు చేరిపోయి ఆ వింతను చూస్తున్నారు.

"ఇంట్లో ఎక్కడా లేద్సార్!"

ఇల్లు వెదకడం పూర్తిచేసి వచ్చిన రెండో కానిస్టేబుల్ చెప్పాడు. ఇంతలో మొదటి కానిస్టేబుల్ పందుల దొడ్లోకి తొంగిచూశాడు.

ఆ వాసనకు ముక్కు మూసుకున్నాడు.

ఆదెమ్మ గుండెలో రైళ్ళు పరుగెడుతున్నాయి. మధ్యలో తన భర్త వచ్చేసి ఎక్కడ చిక్కిపోతాడో, కాళ్ళ సందులోనుండే దుత్తలో నుండీ ఎక్కడ సారా వాసన వస్తుందో. ఎక్కడ కనిపెట్టేస్తారోనన్న భయంతో ఆమె శరీరం వణుకుతోంది.

ఈసారి భయంతో ఆమె ప్రమేయం లేకుండానే మూలుగు వస్తోంది.

ఆ పందుల గుడిసెలో ఏమీలేదని గ్రహించిన ఆ కానిస్టేబుల్ కుడితి నీళ్ళ కడవ దగ్గరకొచ్చి దాన్ని చూస్తూ నిలబడ్డాడు.

ఆదెమ్మ వెన్నులో సన్నని చలి ప్రారంభమైంది. అతను అక్కడినుండి ఆమెదగ్గరకొచ్చాడు.

ఆమెనే గుచ్చిగుచ్చి చూస్తున్నాడు. ఈసారి ఆమె ప్రాణాలు పైనే పోయినట్లనిపించింది. పక్కింట్లోనుండి చూస్తున్న గౌరీ, మాతంగి యింక దొరికిపోయినట్లేననుకొని, ఈ ఆపదనుండి కాపాడమని మనసులోనే దేవున్ని వేడుకుంటున్నారు.

"ఏయ్! ఎందుకట్లా గొంతుక్కూర్చున్నావ్?" డేగలాగా చూస్తూ అన్నాడు.

యస్సై, రెండో కానిస్టేబుల్ కూడా ఆమెవైపే చూస్తున్నారు.

"తెల్సుకున్నారు... యింక మనపని అయిపొయ్యినట్లే" అనుకొని లేని ధైర్యాన్ని కూడగట్టుకోని చెప్పింది ఆదెమ్మ.

"ఏం లేదుసామీ... వంట్లో నల్తగా వుండాది. యింటికి దూరం!"

"సరే! నీ మొగుడొస్తే వొగసారి స్టేషనుకు రమ్మను" యస్సై కలుగచేసుకుంటూ అన్నాడు.

"టేసునుకెందుకు సావీ"

"స్టేట్‌మెంట్ రాసియ్యాల"

ఇద్దరి కానిస్టేబుల్స్‌ని వెంట తీసుకుని అక్కడినుండి వెళ్ళిపోయాడు యస్సై.

ఆరోజుకు గండం గడిచినందుకు హాయిగా గాలిపీల్చుకుంది ఆదెమ్మ.

ఆమె ప్రదర్శించిన సమయస్ఫూర్తికి అంతవరకు వింతగా చూస్తున్న ఆడవాళ్ళు ఎంతగానో మెచ్చుకున్నారు.

ఏమీ తెలియనట్లు అమాయకంగా కనిపించే తల్లి తెలివితేటలకు పొంగిపోయింది మాతంగి.

పరుగున వచ్చి తల్లిని కౌగలించుకొని

ముద్దుల వర్షం కురిపించేసింది.

ఆదెమ్మ మాతృహృదయం పొంగిపో యింది.

దొంగసారా కాచటం ఎప్పటికైనా ముప్పే నని శివదాసు చెప్పిన సలహాతో ఆ రోజు నుండే ఆ వృత్తికి స్వస్తిచెప్పాడు రత్తయ్య.

ఎంత విచిత్రం...

రత్తయ్యలాంటి వారిచేతనే అడవిలో దొంగసారా కాయించి, దాన్ని గవర్నమెంటు సారాలో కలిపి అమ్ముకొని సొమ్ము చేసు కుంటున్న మునిరాజు సంవత్సరాల తరబడి ఆ పని చేస్తున్నా... ఆతన్ని అడిగే నాథుడే లేడు. పైగా సారా నిషేధం అమల్లో ఉన్నా ప్రత్యక్షంగానే వరదయ్య అండదండలతో అమ్ముకుంటూనే వున్నాడు.

పొట్టకూటికోసం... అదే రత్తయ్య చేస్తే దానికి పోలీసులు, చట్టాలు... అన్నీ... అత న్ని సారా దొంగగా ముద్రవేశాయి.

ఈ చట్టాలు, న్యాయాలు అన్నీ సామాన్యు ల కోసమేనని అనిపించింది.

ఇక గత్యంతరంలేని రత్తయ్య రెండు గాడిదలు పట్టుకొని వాటిపైన రెండు ఉప్పు మూటలు, టెంకాయ పీచుతో అల్లిన తాళ్ళు వేసికొని... చుట్టుపక్కల ఊర్లలో అమ్ము కుంటూ భుక్తికోసం తన పూర్వీకుల వృత్తినే చేపట్టాడు. అది ఆతని కులవృత్తి.

ఇలా తన కులవృత్తిలోకి తిరిగి కూరుకు పోయాడు రత్తయ్య.

★ ★ ★

వరదయ్య ఇంట్లో మునెప్ప పరిస్థితి దారు ణంగా తయారయింది.

చీటికీ మాటికీ అటు వరదయ్య యిటు ఆతని భార్య... నిష్కారణంగానే అతన్ని తిట్టి పోయడం ఎక్కువైపోయింది. ఒక్కొక్క రోజు తిండి కూడా సరిగా వేసేవారు కాదు. వేసినా ఆ ముందు రోజు కూరలు, పాచిపో యిన అన్నం వేసేవారు.

ఇలాంటి పరిస్థితిలో పస్తులు కూడా వున్నాడు.

అతని బాధ చూడలేని త్రిపుర సుందరి యింట్లో తెలీకుండా రహస్యంగా తాము తినే తిండీ తాను ఎత్తిపెట్టుకున్న పిండి వంటలు రహస్యంగా తెచ్చి పెట్టేది.

పారిపోదామంటే... వరదయ్యతో భయం. త్రిపుర సుందరి ప్రేమ అతన్ని అక్కడే కట్టిపడేసింది.

మునెప్పకు ఇప్పుడిప్పుడే జ్ఞానోదయం అయింది. ఎవరి అండ చూసుకొని తనవా రిని హీనంగా చూశాడో, ఎవరి ప్రోద్బలంతో అయితే శివదాసులాంటి వారికి అన్యాయం చేశాడో వారే యిప్పుడు అవమానంగా, హీ నంగా చూస్తుంటే భరించలేకపోతున్నాడు.

'ప్రాయంలో వున్నప్పుడే యిట్ట ఆడిపోసు కుంటా వుండారే. రేపు ముసిల్తనం వచ్చా డిసి ఉడిగిపోతే నన్ను ఉన్నిస్తారా... చిప్పి చ్చి బయటికి తొయ్యరా...' అన్న ఆలోచన కూడా అతనికి మొదటిసారిగా స్ఫురించి విలవిలలాడిపోయాడు.

దీనికి తోడు మాతంగి కుటుంబానికి జరిగిన మరో అన్యాయం ఆతన్నెంతగానో కృంగదీసి అతన్ని పూర్తిగా మార్చివేసింది.

ఒకవైపు కరువు కాటకాలతో ప్రజలు మల మలమాడి చస్తుంటే... అలాంటి పరిస్థితిల్లో నే, మండలస్థాయి ఎన్నికలు వచ్చాయి.

అధికారపార్టీ తరుపున వరదయ్య పోటీ చేస్తుంటే... ప్రతి పక్షం తరపున సాంబయ్య పోటీ చేస్తున్నారు.

ప్రచారాలు జోరుగా పెద్దఎత్తున సాగిపో తున్నాయి.

అధికారపార్టీ తరుపున ప్రచారానికి ఒక ప్రముఖనాయకుడు రాబోతున్న సంద ర్భంగా మునిరాజు, పాపయ్య, వరదయ్య యింట్లో ఒకరోజు సాయంత్రం... సమావేశ మైనారు.





పీకల్దాకా సారా తాగారు.

ఆ సమయంలోనే ప్రత్యేకంగా ఎన్నికల కని అడవిలో కాచిన దొంగసారా క్యాన్ ఒకటి అక్కడికి మోసుకొచ్చాడు మునెప్ప.

"ఎక్కడ పెట్టేదయ్యా?" క్యాన్ దించి అడిగాడు.

"అక్కడ పెట్టి... లోపల సోడాలుండాయి ఆ బాలకిష్టుడి దగ్గిర పంపించు. నువ్వు... లోపల్ల ఆల్మేరాలో వుండే మందు సీసా పట్టుకోన్రా..." పురమాయించాడు వరదయ్య.

"మత్తుకోసం శానా మందులు కలిపినా. ఆ సాంబయ్య సారాయి కంటె ఘాటుగా వుంటుంది. దీన్ని తాగినోళ్ళంతా మనకే వొట్లేసెయ్యాల. అయితే యిది కల్తీ సరుకుగదా ముందు ఎవురికైనా తాపించాల"

క్యాన్‌లోని సారా గురించి చెప్పాడు మునిరాజు. "నీయవ్వ జిగుడా! నే గాదన్నానా''! ఉదాసీనంగా అన్నాడు వరదయ్య.

ఇంతలో బాలకిష్టుడు సోడాలు తీసుకొచ్చి అక్కడపెట్టి పక్కకు వెళ్ళి నిలబడ్డాడు.

"నాక్కావాల్సింది ఆ సాంబయ్యగోడు ఓడిపోవాల. నా కొడుకు మనతో వున్నిట్టే వుండే... మనకే పోటీ నిలబడే. నాకు మోసం జేసే'' ఆవేశాన్ని తెచ్చుకుంటూ అన్నాడు వరదయ్య.

"అవును'' అన్నాడు మునిరాజు.

పాపయ్య ఇదేదీ పట్టించుకోకుండా ఏకబిగిన తాగుతున్నాడు.

"నాకు మోసం జేసినోన్ని ఊరికే వదల్తానా. వోడి పాణాలు దీసేస్తాను''

సారా మత్తు తలకెక్కి ఏమ్మాట్లాడుతున్నాడో అతనికే తెలీడంలేదు.

"ఆ బుడ్డన్న... అదే మా జీతగాడు నా కూతురుతోనా సరసాలాడతాడు. అందుకే ఇటిక శూలలో దాక్కున్నాడు. మాడిపోతాడనుకుంటే... వానొచ్చి బయటికి వచ్చినాడు.

అదీ లమ్మిడీ! మంగి... అడగతానే వప్పుకోనుంటే ఏమిలా... నోటికొచ్చినట్ట నే... బాయిలో దాక్కుండె''

బిక్కుబిక్కున ఒక మూల నిలబడి ఆ మాటల్ని వింటున్నాడు బాలకిష్టుడు.

"ఇప్పుడు శివదాసు గోడొకడు. వాడికతా సూస్తా. ఆ మాతంగి నన్నే ఈసడించుకుంటుందా దానెబ్బడాలు దాని సంగతీ సూస్తా!"

వరదయ్య మాటల్ని విన్న మునెప్పకు బుడ్డన్న ఎందుకు చచ్చిపోయాడో, మంగమ్మ ఎందుకు ఆత్మహత్య చేసుకుందో, శివదాసు ఎందుకు వీళ్ళకు వ్యతిరేకమో అర్థమైపోయింది.

వారి క్రూరత్వానికి వెన్నులో సన్నగా చలికూడా ప్రారంభమైంది.

వరదయ్య బాలకిష్టున్ని దగ్గరకు పిలిచాడు.

భయపడుతూనే సమీపించాడు బాలకిష్టుడు. మునెప్ప గుండె వేగంగా కొట్టుకుంటోంది.

"ఏందిరా నా కొండె. నువ్వీడ గొడ్డుసేకరీ సేస్తావుంటే... ఆడ మీ యక్కగారు యింట్లో సుఖంగా కూసోని దొరసాని మాదిర్తో కులకతా వుండాది. నీకు బాధలేదూ?"

కసిగా, వ్యంగ్యంగా అడిగాడు.

బాలకిష్టుడు మౌనంగా తలవంచుకొని నిలబడ్డాడు.

సారా మత్తులో ఏం చేస్తున్నాడో తెలియని వరదయ్య ముఖంలో క్రూరత్వం, కసి చోటు చేసుకుంటున్నాయి.

"వొరే మునిగా... ఆ క్యాన్‌లోటిది ఒక గలాసు సారాయి దీసుకోరా'' ఆజ్ఞాపించాడు.

అక్కడే అంతవరకు వారు తాగి పెట్టిన ఒక ఖాళీ గ్లాసును తీసుకొని క్యాన్ మూత తెరచి కొంచెం సారా వంచుకుని వరదయ్య కందించాడు మునెప్ప.

"ఈడ బాలగోడెందుకు సామీ?" అనుమా

నంగా అడిగాడు మునెప్ప.

వరదయ్యకు వళ్ళు మండింది.

"ఆయ్! ముందు నువ్వీడినుంచీ ఎల్లిపో... లోపల యింట్లో పంజూసుకో... పో' కసురుకున్నాడు.

మునెప్ప బాలకిష్టున్ని జాలిగా చూస్తూ వెళ్ళిపోయాడు. బాలకిష్టుడు అరుస్తున్నా వినకుండా వరదయ్య, మునిరాజు యిద్దరూ జేరి, ఆ గ్లాసుడు సారాను అతని నోట్లో పోసి బలవంతంగా తాగించేశారు.

ఆ సారా తాగిన అతను గింజుకుంటుంటే ముగ్గురూ పైశాచికంగా నవ్వసాగారు.

కొంతసేపటికి బాలకిష్టుడు మెలికలు తిరిగిపోతూ చివరికి వారి ఎదుటే ఆఖరిశ్వాసను వదలిలేశాడు. దాంతో వారి నవ్వులూ ఆగిపోయాయి.

"పాపం! బాలకిష్టుడు సచ్చిపూడిసినాడు'' అన్నాడు పాపయ్య.

"మున్రాజూ! ఈ సారాయి పారబోయించేసి ఈసారి బాగా కాయించు కల్తీ కొంచెం తగ్గించు. లేకుంటే తాగినోళ్ళంతా యీడి మాదిరిగానే సస్తారు తెలిసిందా?" బాలకిష్టుడి శవాన్ని పరిశీలిస్తూ అన్నాడు వరదయ్య.



అది వరదయ్య మామిడితోటలోనున్న సపారి కొట్టం.

ఆ కొట్టం లోపల గోడల పక్కన చుట్టూ ప్లాస్టిక్ సారా క్యానులు చాలా వున్నాయి. వాటిలో కొన్ని ఖాళీవి కూడా.

సారా నిషేధంతో దుకాణం మూసేసిన మునిరాజు వరదయ్య అండ దండలతో... కాచిన సారాను అక్కడ దాచిపెట్టి... రహస్యంగా వ్యాపారం మొదలుపెట్టాడు.

ఆ కొట్టం నడిబొడ్డులో... ఒక నులక మంచంపైన... అర్ధనగ్నంగా వెల్లికలా పడుకుని వుంది రంగసాని. ఆమె పక్కనే ఒక గ్లాసుతో సారా తాగుతూ... తన వడిలో తలపెట్టుకొని వున్న రంగసానికీ సారా తాగిస్తూ కూర్చొనివున్నాడు వరదయ్య.

మరొక చేత్తో ఆమె పొత్తి కడుపును నిమురుతున్నాడు. రంగసాని తన్మయత్వంలో మునిగి రుచిర స్వప్నాల్ని కంటోంది.

'నీ యబ్బడాలా... నా సేతిలో నుంచీ తప్పించుకునిందే ఆ మాతంగీ. వసే రంగీ! మనకు యిరద్ధంగా పొయ్యే శివదాసుగోన్ని ప్రేమించిందంటనే. వోడు కూడా దాన్ని పెండ్లి సేసుకుంటానని మాటిచ్చినాడంట్నే... నిజవా?" అడిగాడు వరదయ్య.

"అవును మావా... ఈ మద్దినే నాకూ తెలిసిందీ'' అతని మెడచుట్టూ చేతులు వేస్తూ గోముగా చెప్పింది.

"నన్ను గాదని అదెట్ట సుకపడుతుందో నేనూ సూస్తానే! వసే రంగీ! నా రంగసానీ... నువ్వొగ పంజేయాలే'

"ఏందో సెప్పు"

"మాట తప్పవు గదా!"

"నువ్వు సెప్పితే ఎప్పుడు కాదన్నా?"

"నువ్వు రేపు దేవత పూనినట్టు మళ్ళా ఊగాల"

"ఊగి!"

వంశపారంపరింగా వస్తావుండే బసివి ఆచారాన్ని ఆ రత్తిగోడు నిలబెట్ట లేదనీ అరవాల

మాతంగిని బసివిని చేసి వదలకంటే





మొత్తం ఊరు ఊర్నే మింగేస్తానని, దూము తగిలించి (ప్లేగు రప్పించి) ఎదరక పోతానని బెదిరించాల"

"అట్టసేస్తే నాకేంది లాభం" ఆశగా అంది.

"ఇద్దో" అని జేబులో నుంచీ రెండు ఇరవై రూపాయల నోట్లు తీసి ఆమె చేతికందించాడు.

వాటిని బొడ్లో దోపుకుని అతన్నింకా గాఢంగా పెనవేసుకుపోయింది రంగసాని.

"అదెంత పన్లే" అని ఒక్క క్షణం ఆగి తిరిగి చెప్పసాగింది.

"ఆ శివదాసు గోడు అడ్డమొస్తే"

"వోడెందుకుంటాడిక్కడే... నిన్ననే సెరువుముందర పల్లికి పోయినాడు. ఆడ యిటికి పనికి వప్పుకున్నాడు. ఇంక కొన్ని దినాలు రాడు. వాడొచ్చేలోపల ఈ పని జరిగిపోవాల"

అయితే ఇంగేం... పసుపు చీర రెడీ చేసుకో... శోభనం అయిపోతుంది'' అని తన అంగీకారం తెలిపింది రంగసాని.

అయితే ఆ మత్తులో మరి రెండు చెవులు ఆ రహస్యాన్ని విన్నాయన్న సంగతి వాళ్ళు గమనించనేలేదు.

★ ★ ★

ఆ మరునాటి రాత్రే అనుకున్న ప్రకారం మాతమ్మ ఆవహించినట్లు ఊగి అందర్నీ నమ్మించింది రంగసాని. ఎన్నోతరాల నుండీ అనూచానంగా వస్తున్న సాంప్రదాయాన్ని కాలదన్ని తన కర్పించాల్సిన కన్యను అర్పించకుండా మోసం చేసినందుకే అమ్మవారికీ కోపం వచ్చిందనీ, తత్ఫలితంగానే బాలకిష్టుడు చచ్చిపోయాడనీ, శివదాసు పందులు కూడా అందుకే చనిపోయాయనీ కరువు కాటకాలు వచ్చి ఈ ప్రాంతమంతా అరాచకమై పోయుండేదీ అందువల్లననీ గూడెం ప్రజల్ని నమ్మించింది.

ఇంకా ఆలస్యం చేస్తే ఊరే సర్వనాశనమై పోతుందనీ భయపెట్టేసింది.

దాంతో బెదిరిపోయిన గూడెం ప్రజలు ఆమె మాటల్ని పూర్తిగా నమ్మేశారు. ఫలితంగా రెండు రోజుల్లోపల మాతంగిని బసివిగా మార్చేయాలని నిర్ణయమైపోయింది.

స్వార్థపరులు, పురుషాధిక్య సమాజంలో స్త్రీని ఒక భోగవస్తువుగా మార్చేసారనీ ఇదీ అలాంటిదేననీ వారికి ఎవరు చెప్పగలరు?

చెప్పినా వారిని అర్థంచేసుకోనిస్తుందా ఈ సమాజం?

అజ్ఞానానికి ఆలవాలమైన ఆ ఊరికి దక్షిణవైపు చివర మాతమ్మ గుడికి సమీపంలో బసివిల కోసం కట్టించిన పాత గుడిసెను ఆ మరునాటి కంతా బాగుచేయించేశారు.

ఆ గుడిసె ముందర డప్పులు మోగుతున్నాయి. డుముకుల శబ్దం గుండెల్ని చీల్చేస్తోంది.

అక్కడ మేళతాళాలు ఘోషిస్తున్నాయి.

కొందరు యువకులు అడుగులు వేస్తున్నారు.

వారిలో ఆవేశం రెచ్చిపోతోంది.

చిన్నా పెద్దా అందరూ అక్కడ జరుగుతున్న వేడుకను చూస్తున్నారు.

కేవలం రవిక, పావడాతో మాత్రమే నడివీధిలో ఒక రాతి పలకపైన కూర్చొని వుంది మాతంగి.

ఆమె కళ్ళు మౌనంగా రోదిస్తున్నాయి. నిశ్చలంగా నిర్వికారంగా వున్న ఆమె చూపు శూన్యంలో ఎక్కడో నిలిచివుంది.

ఇంటింటినుండి తెచ్చిన పసుపు ముద్దలతో ముత్తయిదువులు ఆమెకు పసుపు పూస్తున్నారు.

కొందరు ఆడంగులు నలుగు పాటలు పాడుతున్నారు.

మరి కొందరు నలుగు పెట్టిన ప్రతిసారీ ఆమె నెత్తిన నీళ్ళ కడవ కుమ్మరిస్తున్నారు.

దూరంగా నిలబడి రత్తయ్య, ఆదెమ్మ మౌనంగా చూస్తూ... మనసులోనే దుఃఖాన్ని అనుభవిస్తున్నారు. వారి పక్కనే గౌరి నిలబడి రోదిస్తోంది.

కుల పెద్ద ఉప్పుతోళ్ల రాముడి ఆధ్వర్యంలో అన్నీ సాగిపోతున్నాయి.

ఒక కంచు తట్టలో పసుపులో అద్దిన ఒక కొత్తచీర, పసుపు తాడు చుట్టిన ఒక కొబ్బరికాయ ఎత్తుకొచ్చి రంగసాని మాతంగి చేతుల్లో పెట్టింది.

ఆ తడి బట్టల్తోనే మేళ తాళాలతో ఆమెను రచ్చబండ దగ్గరకు తీసుకువచ్చి ఆమెచేత కొబ్బరికాయ కొట్టించి, అక్కడినుంచీ మాతమ్మ గుడి దగ్గరికి తీసుకు వచ్చారు.

అప్పటికే ఆ విగ్రహం చుట్టూ శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టి వున్నాయి.

తలలేని ఆ మాతమ్మ నగ్న విగ్రహానికి స్నానం చేయించి పసుపు కుంకుమలు పూయించారు.

యోని భాగాన్ని పూర్తిగా కప్పేటట్లు పెద్ద కుంకుమ బొట్టు పెట్టారు.

చుట్టుపక్కల పల్లెలయిన మేకలోల్లపల్లి, మాలపల్లిలనుంచీ కూడా జనం ఆ తంతు చూడటానికి తరలి వచ్చారు. వస్తూనే వున్నారు.

ఆ ప్రదేశం క్రిక్కిరిసి వుంది. కొబ్బరికాయలు కొట్టేవాళ్లు, కోళ్లు కోసేవాళ్లు, వేపాకు, కల్లు ముంతలు మొక్కుబళ్లు అర్పించే వాళ్లు ముందు వరసలో నిలబడి వున్నారు.

కొందరు స్త్రీలు పూనకాలొచ్చి ఊగిపోతున్నారు. అక్కడ అంతా కోలాహలం!

అరుపులు... కేకలు... ఈలలు...

మేళ తాళాల హోరు!!

ఆ విగ్రహానికి ఎదురుగా వున్న రాతిపైన మాతంగి కూర్చోబెట్టబడి వుంది.

కొబ్బరికాయ కొట్టి కర్పూరం వెలిగించిన ఉప్పుతోళ్ల రాముడు "యింక మనువుకుత్తరువా?" అని గట్టిగా మూడుసార్లు అరిచాడు.

"సామి శెలవ!" అని ఆతడన్న ప్రతిసారీ అక్కడున్న వారంతా అంగీకరించినట్లు ఉచ్ఛరించారు.

"ఆ బిడ్డెను ముద్దరేసి బసివింజేయాల. ఇంక వరదయ్య పంపిన పసుపు చీర కట్టండి''

ఆజ్ఞ జారీ చేశాడు ఉప్పుతోళ్ల రాముడు.

ఆ మాటతో ఒక చీరను తెరలా పట్టారు ఆడవాళ్లు. అందరి ఎదుట ఆ చీర తెరమధ్యలో మాతంగికివున్న పావడా రవికా తీసి ఆమె చేత వున్న తట్టలోని పసుపు చీరను ఆమె వంటికి చుట్టారు. ఆ తర్వాత చీర తెర తొలగించారు.

కౌరవ సభలో వస్త్రాపహరణ వేళ ఏకవస్త్ర అయి నిలబడివున్న ద్రౌపదిలావుంది మాతంగి.

ఆ నిండు జాతరలో ఆమె నాదుకునే నాధుడే కనిపించలేదు.

ఆమె మెడలో వేప మండల తోరణం వేశారు.

ఆమె నడుముక్కాడ వేపమండలు చుట్టారు.

అందరికీ అక్షింతలు పంచారు.

సరిగ్గా అప్పుడే అక్కడికి వచ్చి అక్షింతలు తీసుకొని ప్రత్యక్షమయ్యారు వరదయ్య, మునిరాజు, పాపయ్య.

వారిని చూసిన రంగసాని ఒక చిరునవ్వు నవ్వింది. తమ ఎత్తుగడ పారినందుకు వరదయ్య ఆమె నవ్వుతో తన మందహాసం కలిపాడు.

ఉప్పుతోళ్ల రాముని సూచన ప్రకారం రంగసాని అంతవరకూ మాతంగి చేతవున్న తట్టను ఆమె తల్లిదండ్రుల చెంతకు తీసుకు వెళ్లింది.

తమ గుండెల్లో అగ్నిపర్వతాలు బద్దలవుతుంటే... ఏమీ చేయలేని నిస్సహాయతతో




అందులో వున్న కొబ్బరి కాయను కళ్లకద్దుకు న్నారు.

అక్కడినుండి తీసుకువచ్చి, దానికి మా తంగి దగ్గర నమస్కారం చేయించింది.

దాన్ని ఉప్పుతోళ్ల రాముడు తీసుకొని విగ్రహం దగ్గర పెట్టి కర్పూరం వెలిగించి మరొక కొబ్బరికాయ కొట్టి అందులోని నీటిని విగ్రహం పైన చల్లాడు.

ఆ నీళ్లు పడి కుంకుమ చెదరిన విగ్రహ కటి భాగాన్ని కర్పూరం వెలుగులో కళ్ల కద్దుకున్నాడు.

ఆ తర్వాత తట్టలో కొబ్బరి కాయకున్న పసుపు తాడు రంగసాని కందించి దాన్ని మాతంగి మెడలో కట్టమన్నాడు.

పెద్ద పెట్టున వాయిద్యాల శబ్దం మిన్ను ముట్టింది. కేకలు, అరుపులు, ఈలలు ఎక్కు వయ్యాయి.

మాతంగి శిరస్సున అక్షింతలు కురవసా గాయి.

ఆ సమయంలోనే రంగసాని మాతంగి మెడలో ఆ తాడు కట్టేసింది.

ఆ తర్వాత చెప్పాడు ఉప్పుతోళ్ల రాముడు, "వోయ్! పిల్లాజెల్లా, చిన్నాపెద్దా అందరూ యినండి. ఈ దినం రత్తయ్య, ఆదెమ్మల పెద్ద కూతురైన మాతంగిని మన కులదేవత మాతమ్మకు నిత్తె కన్నెగా ముద్దరేసి బసివిగా జేసి వదలడం జరిగింది. ఈ గెడివి నుంచీ ఈయమ్మ దేవత సొత్తై పూడిసింది'' అని ఆవేశంగా చెప్పి "రే! కోడిని తీసకరండ్రా! ఈయమ్మకు దిష్టి తీయాల!" కేకేశాడు.

ఆ పక్కనేవున్న వ్యక్తి కోడిని అందించా డు.

"పలక దిష్టి, మేళం దిష్టి, వచ్చినోళ్ల దిష్టి, ఆడ దిష్టి, మగదిష్టి, కోడి దిష్టి, కుక్కదిష్టి... ఓం... ఛ్ఛుఫ్.. దిగిపో... ఛ్ఛీఫ్... దిగిపో... దిగిపో' అని ఆ కోడి పుంజును మాతంగికి దిగదీశాడు ఉప్పుతోళ్ల రాముడు.

"ఇంక కొయ్‌రా''

అనగానే ఆ వ్యక్తి చేతనున్న చురకత్తితో దాని మెడ కోసేశాడు.

కారుతున్న రక్తంలో వేళ్లు తడిపి విగ్రహం యోని భాగానికి బొట్టు పెట్టి మాతంగి నుదట రక్త తిలకం దిద్దాడు ఉప్పుతోళ్ల రాముడు.

ఆ తర్వాత చెంబుతో నీళ్లు పోస్తూ... తలను పలికించాడు.

"అమ్మా! తల్లీ! సామితల్లీ! నువ్వు కోరిన ట్లే ఈ ఆడకూతుర్ని నీకు వొదిల్నాం. కోన్నికోసి గావిచ్చినాం! ఇంక మా కష్టాలు కడతేర్చు తల్లీ! దానికి రుజువుగా పలికించు తల్లీ పలుకు''

పలికించిన తలను ఆ చెట్లోకి ఎగురవేశా డు. అది అక్కడే ఆగిపోయేసరికి ఇక ఆ ఊరికి పట్టిన అరిష్టం తొలిగిపోయినట్లేనని అందరూ భావించారు.

ఆ తర్వాత మొక్కుబళ్లు చెల్లించేవారు ఎగబడ్డారు.

కోసిన కోడిని అక్కడే కాల్చి దాని గుండె ను కాలేయాన్ని తీసి, మాడ్చి, దాన్ని మా తంగికి తినిపించి, కల్లు తాగించి డుముకుల మధ్య ఊరేగించారు.

తనకు లొంగలేదన్న కక్షతో మాతంగి కుటుంబాన్ని సర్వనాశనం చేసి ఇక జీవి తంలో ఆమెకు పెళ్లి యోగం లేకుండా చేసినందుకు పొంగిపోయాడు వరదయ్య.

"ఎప్పుడో వొగప్పుడు శోభనం చేసే ఆ పుణ్యకార్యం గూడా మనవే చేసెయ్యొచ్చు లే' అని మునిరాజు చెవిలో ఏదో గుసగుసలా డుతూ క్రూరంగా నవ్వుకోసాగారు వరద య్య, మునిరాజు.

ఆవిధంగా ఆ తంతు శివదాసుకు తెలియ కుండానే ముగిసిపోయింది.

ఇక మంచి ముహూర్తం చూసి పసుపు చీర పంపిన వరదయ్యే కన్నెరికం చేసే ఆచారం మాత్రం మిగిలిపోయింది. ఆ ము

హూర్తం ఎపుడో చూసి వరదయ్యకు వర్త మానం పంపే బాధ్యత రంగసానికి అప్ప గించారు.

★ ★ ★

గ్రామంలో ఎన్నికల ప్రచారం వేగం పుంజుకుంటోంది.

పల్లెపల్లెలోను మైకులు మారుమ్రోగుతు న్నాయి. ప్రచార వాహనాల రాకపోకలతో ఎర్రటి దుమ్ములేచి పల్లెల్ని కప్పేస్తోంది.

సాంబయ్య మనుషులు వరదయ్యని, వరదయ్య మనుషులు సాంబయ్యని విమ ర్శిస్తున్నారు.

సాంబయ్యవైపు ప్రజలు మొగ్గు చూపిస్తు న్నారని భయపడిన వరదయ్య అభ్యర్థన ప్రకారం పార్టీ పెద్ద నాయకుడి పర్యటన కూడా ఏర్పాటు చేశారు.

ఇరు వర్గాల వారు ఎన్నికల్ని ప్రతిష్టాక రంగా తీసుకున్నారు.

మునిరాజు వరదయ్యకి ప్రచారంలో కుడి భుజంగా ప్రవర్తిస్తున్నాడు.

ప్రజల్ని ఎన్ని విధాలుగా ఆకర్షించాలో అన్ని విధాలుగానూ, ఇరు వర్గాల వారు ప్రయత్నిస్తున్నారు.

దొంగసారా కాచేవాళ్లకి, రాజకీయ దళారు లకు, చంచాగాళ్లకు గిరాకీ పెరిగింది.

పీపాల కొద్దీ సారా అందించబడుతోంది!

కట్టలకొద్దీ ధనం నీళ్ల ప్రాయంగా వినియో గించబడుతోంది.

గూడెంలో... బాలకిష్టుడి మరణంతో శివ దాసుతోబాటు అందరూ ఏకమయ్యారు.

అతి కష్టమ్మీద కిష్టుడు గూడెంవాళ్లకి నిజనిజాలు తెలియజేసి అందర్నీ ఒక తాటి పైకి తెచ్చాడు.

ఇప్పుడు గూడెం ప్రజలకి యువకులే మార్గ దర్శకులు, ఎన్నో సంవత్సరాల నుండీ తీరని తాగు నీటి సమస్యను పరిష్కరించుకో వడానికి ఇదే మంచి సమయంగా వారు భావించారు.

అందుకే తమ సమస్యలు తీరేంత వరకూ ఎవరికీ ఓటెయ్యకూడదనే నిర్ణయా నికొచ్చేశారు.

ఆ రోజు ఉదయం తమ పార్టీ నాయకుడు ప్రచారానికి రాబోతున్నాడన్న వర్తమానాన్ని వరదయ్య మనుషులు తమ ప్రచార వా హనం లౌడ్ స్పీకరులో అదే పనిగా అరిచి అరిచి చెబుతున్నారు.

మునిరాజు ముందుగానే నడివీధిలో కుర్చీలు, టేబులు వేయించి నాయకుడి ఉపన్యాసానికి హడావిడిగా ఏర్పాట్లు చేయి స్తున్నాడు.

ఇంతలో నాయకుడు వస్తున్నాడన్న వార్త వచ్చింది.

"మహాజనులారా! మన ప్రియతమ పార్టీ నాయకులు మన కష్టాల్ను సాయంగా సూసే దానికే వస్తావుండారు. కాబట్టి ఆయనిచ్చే అమూల్యమైన, అతి విలువైన మాటల్ని విని ఆ తర్వాత మీ కష్టాలు సెప్పుకోండి.. రాండి.. కదలిరాండి.. నాయకులు వచ్చేస్తు న్నారు''

అందర్నీ ఆహ్వానిస్తూ మైకు...చెవులు చిల్లులు పడేలా అరుస్తోంది.

కానీ కొందరు బాల బాలికలు అక్కడ చేరి కేరింతలు కొడుతున్నారు తప్ప మరెవ ర్రూ రాలేదు. ప్రజలంతా తమతమ గుడిసెల ముందు నిలబడి చూస్తున్నారు.

ఎలాగో ఒక లాగు మందని కూడేసి నాయకుడి దగ్గర... శభాష్ అనిపించు కుంటే... భవిష్యత్తులో తమ పనులు చే యించుకోవచ్చునని మునిరాజు ఆలోచన. మరి ప్రజలే రాకపోతే! తన పరువు గంగలో కలిసి పోతుందని భయపడుతూ వున్నాడు.

"అన్నా! నాయకుడు ఊరు ముందర కొచ్చేసినాడు. అందరూ ఆడనే వుండారు''

అని ఒక కార్యకర్త గసపోసుకుంటూ





వచ్చి చెప్పాడు.

దాంతో అక్కడున్న కార్యకర్తలంతా మిల్ట్రీ కమాండర్ ఫైర్ అనగానే తుపాకులు సర్దు కొని పరుగెత్తే సిపాయిల్లా కండువాలు సర్దు కుంటూ పరుగెత్తారు. అక్కడ ఒక టాప్‌లేని జీప్‌లో వరదయ్య నిలబడి వున్నాడు. పక్క నే పార్టీ నాయకుడు కూర్చోనున్నాడు.

జీపు కిరువైపులా కార్యకర్తలు నిలబడి వున్నారు.

జీపుకు ముందు దారికడ్డంగా రత్తయ్య గాడిదలు రెండూ నిలబడి వున్నాయి.

వాటి వెనుక కొన్ని వందల మట్టి కడవ లు పేర్చి వున్నాయి.

వాటి తర్వాత గూడెం బాలబాలికలు, కొందరు ముసలివాళ్లు కూర్చొని వున్నారు. వారి చుట్టూ స్త్రీలు, పురుషులూ నిలబడి వున్నారు.

వారిని చూడగానే జీపులోని మైక్‌లో నుండి నాయకుడికీ జై అని గట్టిగా అరుపులు వినిపించాయి.

ఎవ్వరూ జే కొట్టలేదు!! కానీ ఆ జనాన్ని, అరుపుల్ని చూసి బెదిరిన రత్తయ్య గాడిద ఒకటి అదే స్థాయిలో ఓండ్రించింది.

జీపులోని వారంతా దానివైపు వింతగా చూశారు. నాయకుడికి చెమట్లు పోశాయి!

వరదయ్యకు గుండెదడ ఎక్కువైంది. ఒక్కక్షణం ఆగి మైకు మళ్లీ అరిచింది, "వరదయ్యకే మీ ఓటు''

రెండో గాడిదా ఓండ్రపెట్టింది.

దాంతో ప్రజలంతా గొల్లున నవ్వారు. నాయకుడికీ, వరదయ్యకీ తల తీసేసినంత పనయింది.

ముందు వరుసలో నిలబడి చూస్తూ ము సిముసిగా నవ్వుకుంటున్న రత్తయ్య, కిష్టు డు, శివదాసులను చూస్తూ జీపులోవున్న ఒక కార్యకర్త "ఏందియ్యా ఇదీ?" అని అసహ నంగా ప్రశ్నించాడు.

"మాకు నీళ్లు గావాల! అని మా గాడిదలు సెప్పినాయి అంతే'' అన్నాడు రత్తయ్య.

ఆ మాట విన్న నాయకుడికి, వరదయ్యకి వళ్లు మండింది. కానీ పెదవి జారితే ఏ అనర్థం వస్తుందోనని లేని నవ్వుని తెచ్చుకో వడానికి ప్రయత్నించసాగారు.

"రోజూ లారీల్తో నీళ్లు తోలిస్తా వుండాంగ దా యింకా ఏమీ?"

అనునయంగా అన్నాడు వరదయ్య.

"ఈ వోట్లయి పోయిందాకానే గదా!" అన్నాడు కిష్టుడు.

"శాస్వితంగా మా ఊర్లో వొగ బావి తవ్వించండి. లేదా మంచి బోరింగయినా యేయించండి!" శివదాసు డిమాండ్ చేశా డు.

"మేము ఈ గుడిసెల్లోనే మగ్గిపోతా వుండాము. మాకు మంచి యిండ్లు కట్టించి కరెంటేయించండి'' కిష్టుడన్నాడు.

"మేము యిటిక కోస్తాం. ఆ యిటికను గవర్నమెంటు కొనేట్టుగా ఏర్పాటు చేసి మాకు బతుకు తెరువు సూపించండి'' శివదా సు తిరిగి అన్నాడు.

"అన్నీ సేయిస్తా! మేముండేదే మీ సే వకు. వొగ అర్జీ రాసియ్యండి సూస్తా'' జీపులో నుండే అసహనంగా అన్నాడు పార్టీ నాయకుడు.

"ఇట్లన్నోళ్లను శానామందిని సూసినాం లేవయ్యా! వోట్లయిపోగానే పోతారు. తర్వాత వోట్లు వచ్చే దాంకా ఈ పక్కకే రారు'' ఆ గుంపులో నుండి గట్టిగా ఎవరో అన్నారు.

ఇంతలో కిష్టుడు అందర్నీ తోసుకుంటూ వచ్చి నాయకుడి దగ్గరకు వెళ్లాడు.

"అయ్యా!" అని నాయకుడితో వరదయ్య ఏదో ఆతని గురించి చెప్పబోయాడు.

"నువుండయ్య! ఆయన్తో నేనే సెప్తా!"

కిష్టుడు అడ్డుపడి డోర్ పట్టుకొని చెప్పసా గాడు.

"ఎన్నో ఏండ్ల నుంచీ మేము మైళ్లు మైళ్లు పొయ్యి నీళ్లు తెచ్చుకుంటా వుండాము. వుండే వోళ్ల బాయిలకు బోతే మా ఆడోళ్లను అగుమానంగా మాటాడతారు. దీన్నెవురూ పట్టించుకోలా''

వరదయ్యను ఓరగా చూస్తూ ఆ మాట అనేసరికి ఎక్కడ తన అఘాయిత్యాలు చెప్పేస్తాడోనని లోలోపల బాధపడిపోతూ గతుక్కుమన్నాడు వరదయ్య.

"ఓట్లకంటే ముందే ఎవురు మా ఊర్లో బావి తవ్విస్తారో వోళ్లకే మేము ఓటేస్తాం. లేకుంటే ఎవురికీ ఎయ్యం" ముందుకొచ్చి అన్నాడు శివదాసు.

"అవును! ఎయ్యం"

ఏక కంఠంతో వారిని సమర్థించారు గూడెం ప్రజలు.

"అయ్యా! నాకు పార్టీ నాయకుడిపైనే నమ్మకంలేదు. మా పార్టీ పైనే నమ్మకంలేదు. చివరికి నా పదవిపైనే నాకు నమ్మకం లేదు. కానీ ప్రజల పైన మాత్రం బోలెడు నమ్మకం వుంది. మా మాదిరి మీరు దినానికొక మాట మార్చరు. వారానికొక పార్టీను మార్చరు. ఓ ప్రజలారా! మీరు ఆ మాటపైనే నిలబడండి. నేను మీకు బావి, బావితోబాటు తానాలాడే దానికి సెరువు కూడా తవ్వించమని గవర్నమెంటుకు రెకమెండ్ చేస్తా''

చేయి పైకెత్తి ఉపన్యాసమిస్తున్నట్లుగా గట్టిగా అరిచి చెప్పాడు.

"ఏందండీ... మీరే ఎవరికీ ఓటెయ్యొద్దంటా వుండారు? ఓరి నాయనో... కొంప ముంచినారు కదా!"

వణికిపోతూ అన్నాడు వరదయ్య. "నీకేం భయంలేదు. సాంబయ్యేగాదు. వీళ్లకు ఓట్లకు ముందే ఎవడూ బావి తవ్వించలేడు. అట్లముందే ప్రజలకు ఎవడూ బావి తవ్వించలేడు. అట్లముందే ప్రజలకు పంజేసేటోళ్లు మనకు ఇంగ్లీషోళ్ల కాలంలోనే పోయారు. వరే! యింక జీప్ ఎనిక్కి పోనీ'' అన్నాడు ధీమాగా నాయకుడు.

"మరి మీటింగూ!"

"మీటింగులా... గీటింగులా... వీళ్లెట్టాగూ ఎవరికీ వోటెయ్యరు కాబట్టి వీళ్లవల్ల ఏ కొంపా మునగదుగానీ. యింకో ఊరికి పదా!"

నాయకుడి సలహాతో కార్యకర్తలందరూ జీపెక్కేశారు.

దుమ్ము రేపుకుంటూ... ఆ జీపు అక్కడి నుండి వేగంగా వెళ్లిపోతుంటే.. అది రేపిన దుమ్ము మౌనంగ అటువైపే చూస్తున్న గూడెం ప్రజల శరీరాల్ని మేఘంలా కప్పేసింది.

★ ★ ★

సాయంత్రం సూర్యుడు పడమటి కొండల్లో దాక్కుంటున్నాడు.

వరదయ్య ఇటుక కోసేపని ఒప్పుకున్న గంగడు, నాగన్న ఇటుక శూలకు నిప్పు పెట్టడానికి అన్నీ సిద్ధం చేసుకుంటున్నారు.

అదే. సాయంత్రం రాజమ్మ గోంగూర కోసం వరదయ్య బావివైపుకు బయలుదేరింది.

చెరుకుతోటల సాలుల్లో వున్న గోగాకు దూసుకొని రావాలని ఆమె ఆలోచన.

వరదయ్య బావికి చుట్టూ తోటలు ఏపుగా పెరిగి మనిషి కనిపించనంత ఎత్తుగా వున్నాయి.

వ్యవసాయకూలీలు, వరదయ్య జీతగాళ్లు మధ్యాహ్నం విశ్రాంతి తీసుకునే కావలికొట్టం... బావిగట్టున ఆ తోటల మధ్య స్పష్టంగా కనిపిస్తోంది.

పంటమీదున్న వరిమడుల కానుకొని మునిరాజు వ్యవసాయం వుంది.

వరదయ్య చెరకుతోటల్లోకి వెళ్ళాలంటే మునిరాజు వరిమడులు దాటుకుని వెళ్ళాల్సి వుంటుంది. మళ్లకు మధ్యలో నిలువెత్తు గెనాలు ఉన్నాయి. అలాంటి ఒక గెనింపైన




ఒక గుంటనేలలో గుంపుగా కానగచెట్లు ఉన్నాయి.

చిత్తడిగా వుండే ఆ కానగ చెట్ల మధ్యగా ఆ గెనిందిగి గోగు చెట్లున్న చెరుకుతోటలోకి అడుగుపెట్టింది రాజమ్మ.

ఏపుగా పెరిగిన వరిపైరులో పడి ఆబగా మేసే లేగదూడలా లేత లేత గోగాకును కోసుకుంటూ తోట మధ్యలోకి వెడుతుంటే క్రమంగా ఆమె వడి కోసిన గోగాకుతో నిండి పోతోంది.

కనుక్కుంటే గొడవ చేస్తారన్న భయంతో గబగబ కోసుకుంటున్న సమయంలో హఠాత్తుగా వెనకనుంచి ఎవరో ఇద్దరు వచ్చి అరవకుండా నోరు మూసేసి అమాంతం ఆమెను ఎత్తుకొని వెళుతున్నారు.

ఏం జరిగిందో తెలుసుకునే సమయం కూడా ఆమెకు చిక్కలేదు.

క్షణంలో ఆమె కావలి కొట్టానికి చేర్చబడింది. కొట్టంలో వున్న అరుగుపైన కూర్చొని పార్టీ నాయకుడూ, వరదయ్యా, మునిరాజూ మందు కొడుతున్నారు.

పొరబాటున పులుల గుహలోకి చేరిన లేడికూనలా గోగాకుతో నిండివున్న వడిని గట్టిగా పట్టుకొని భయం భయంగా వారివైపు చూస్తోంది రాజమ్మ.

అందరి కళ్లు ఆమె అందాన్నే ఆస్వాదిస్తున్నాయి. ఒక్కసారి ఆమె గుండె జల్లుమంది.

వెనక్కి పారిపోదామంటే అంతవరకూ తనను మోసుకొచ్చినవాళ్లు గుమ్మం దగ్గరే యమకింకరుల్లా నిలబడి వున్నారు.

"మీ కోసరంవే పిటపిటలాడే ఈ పిట్టను పట్టుకొచ్చినాం" సవినయంగా చెప్పాడు వరదయ్యా, నాయకుడితో.

"ఎవరీ పిట్ట!" మునిరాజు అడిగాడు.

"పొద్దున్న గూడెంలో జీపుకు అడ్డంగా వచ్చి ఉపన్యాసాలిచ్చినాడే ఎర్రటి పిలకాయ కిష్టుడు. వోడి సెల్లెలు. ఆ దినం మాతంగికి అడ్డుపడినాడు. ఈ దినం ఎవురడ్డు పడతారో' వికటాట్టహాసం చేస్తూ చెప్పాడు వరదయ్య.

జరగబోయే ప్రమాదాన్ని పసిగట్టిన రాజమ్మ పరుగెత్తబోయింది. మునిరాజు అడ్డుపడ్డాడు.

నాయకుడు లేచి సారా, గ్లాసు అరుగుపైన పెట్టి ఆమెను సమీపించాడు.

"ఎక్కడికి పోతావే పిల్లా! మీయన్న మాకే నీతులు చెబుతాడటే. నా జీపుకే అడ్డొస్తాడా!" అంటూ ఆమె బుగ్గమీద చిటికేశాడు.

దాంతో వళ్లుమండిన రాజమ్మ తుపుక్కున అతని ముఖాన ఉమ్మేసింది.

దాంతో మునిరాజు ఒక్క ఊపున ఆమెను నాయకుడి పైకి తోసేశాడు. ఆ ఊపుకు చేతిలోని సారాగ్లాసు కిందబడి ముక్కలైపోయింది. అదే సమయంలో కింద పడబోతున్న ఆమెను తన రెండు చేతులతో లేవనెత్తి అలాగే గట్టిగా కావలించుకున్నాడతను.

అతని కౌగిట్లో ఆమె గింజుకుంటోంది.

ఇంతలో వరదయ్య లేచి ఆమె పైటను లాగేశాడు.

ఆ దెబ్బకు ఆమె వడిలో వున్న గోగాకు మొత్తం ఆ పాక మధ్యలో కుప్పగా పడిపోయింది.

ఆమె అందాల్ని చూసిన నాయకుడికి మతిపోయినట్లనిపించింది.

"వద్దు వద్దు నన్నేంవీ సేయొద్దు. మీకు దండం పెడతాను'' అని నాయకుడి కౌగిట్లో చిక్కిన ఆమె చేతులెత్తి ప్రాధేయపడింది.

అందరూ పెద్దపెట్టున నవ్వసాగారు.

రెచ్చిపోయిన నాయకుడి చేయి కొరికి తప్పించుకుని మరొక మూలకు పరుగెత్తబోయిన ఆమెకు తన కాలు అడ్డం పెట్టి కిందపడదోశాడు వరదయ్య. దాంతో గోగాకు కుప్పపైన కూలిపోయిందామె.

నాయకుడు పులిపిల్లలా విజృంభించాడు.



అందరూ కొట్టం బయటికొచ్చారు.

లేతగోగాకు మెత్తగా నలిగిపోయింది. కొంతసేపటికి నాయకుడు వెలుపలికొచ్చాడు. ఆ తర్వాత వరదయ్య, మునిరాజు, మళ్ళీ నాయకుడు, ఆ తర్వాత కార్యకర్తలు తమ దాహాన్ని వరుసగా తీర్చుకున్నారు.

కుక్కలు చింపిన విస్తరిగా మారిన ఆమెను చూడలేక సూర్యుడు ఎప్పుడో పడమటి కొండల్లో దాక్కున్నాడు.

★ ★ ★

అన్నీ చూసుకొని వరదయ్య ఇంటి కొచ్చేసరికి ఆ రాత్రి చాలా పొద్దుపోయింది.



తాను వస్తూనే సందులోనుండీ పరుగెత్తుకుంటూ వచ్చే మునెప్ప ఆరోజు ఎందుకో రాలేదు.

"పగలంతా పంజేసి వొళ్లు మరసి నిద్దర బోతావుంటాడు పాపం పోనీలే"

ఎప్పుడూ లేనిది ఆ రోజెందుకో అతని పైన జాలేసింది వరదయ్యకు.

గేటు తెరచి, శబ్దం చేయకుండా మళ్ళీ మూసితెరచి వున్న వెలుపలి గుమ్మం గుండా లోపలికి అడుగుపెట్టాడు.

లోపలి గుమ్మం మూసేవుంది.

అతనెక్కడికైనా వెడితే తిరిగి వచ్చేంతవరకు వెలుపలి గుమ్మం తెరచి వుండడం మామూలే.

పైనున్న గదుల తాళాలు తన చేతిలోనే వుండడంతో వెలుపలి గుమ్మానికీ, లోపలి గుమ్మానికి మధ్యగా వున్న మెటికలగుండా పై అంతస్తులోకి నడిచాడు.

పై అంతస్తులో మూడు గదులున్నాయి. మొదటి గదిలో ఒకప్పుడు అతని రెండో కూతురుండేది. ఇప్పుడది ఖాళీగా వుండడంతో పొద్దుపోయి వచ్చినప్పుడు వరదయ్య ఆ గదిలోనే పడుకుంటాడు.

చివరి గదిలో త్రిపురసుందరి... మధ్య గదిలో అతని భార్యా పడుకొనివున్నారు.

లోపలిగుండా మెటికల దారివుండి అది అన్ని గదుల్ని కలుపుతూ కిందికి వెళ్తుంది.

ఆ గదుల ముందుగా బారెడు వెడల్పుతో వున్న దారి అలాగే వెళ్లి కడపటి గదిని చుట్టి అంతమౌతుంది.

మొదటి గది దాటుకొని తన గది ముందర నిలబడి తలుపు తట్టబోయాడతను.

ఇంతలో పక్కగదిలో అస్పష్టంగా ఏదో మాటలు వినిపించడంతో ఆ ప్రయత్నాన్ని ఆపుకొని అటువైపుకు నడిచాడు.

ఆ పక్కనే తెరచివున్న కిటికీగుండా తన గదిలోకి చూశాడు.

ఎర్రటి జీరో బల్బు వెలుతురులో విశాలమైన పట్టె మంచంపైన గాఢంగా నిద్రపోతోంది అతని భార్య.

శబ్దం చేయకుండా యింకొంచెం ముందుకు వెళ్లి సగం మూసివున్న కిటికీలో నుండి త్రిపురసుందరి గదిలోకి చూశాడు.

అక్కడి దృశ్యం చూసి అవాక్కయిపోయాడతను. అది అతను కలలో కూడా ఊహించని సంఘటన.

నీలిరంగు జీరో బల్బు వెలుతురులో పెనవేసుకున్న రెండు మానవశరీరాలు నగ్నంగా రెచ్చిపోతున్నాయి.

అవి ఒకదాని కౌగిట్లో మరొకటి పరస్పరం కరిగిపోతూ!... మత్తుగా!... మూల్గుతూ... గుసగుసలాడుకుంటున్నాయి.

వస్తున్న కోపాన్ని క్షణంసేపు ఆపుకొని వారి మాటలు వినసాగాడతను.

"నీకేం భయం లేదయ్యా! నువ్వు ఊఁ అను, నగలు నట్రా, దుడ్డు ఎత్తకొచ్చేస్తా. దూరంగా పొయ్యి ఎవురికీ తెలీకుండా పెండ్లి చేసేసుకుందాం"

"వద్దు వద్దు... ఇంతకుముందు బుడ్డన్నను మీ నాయన సంపేసినాడు. మీరు పెద్దోళ్లు. మేము మీకాళ్ళ కాడ బతికేటోళ్లం, ఈరోజునుంచీ నువ్వు నన్ను మర్చిపో. మీ నాయనకు తెలిస్తే నన్ను గూడా...!" "వారే నా కొడకా! ఎంతకు తెగించినావురా"

మనసులోనే తిట్టుకున్నాడు వరదయ్య.

"తెలిస్తే తెలీనిలే. మనం వాళ్ళకు సిక్కకుండా దూరంగా వెళ్ళిపోదాం"

"మీ యబ్బబలేటోడు. మా ఇంట్లో దొంగతనం సేసి దుడ్డు దుగ్గాణమంతా ఎత్తుకొని పూడిసినాడు అని నామింద కేసుపెట్టి యక్కడున్నా పట్టించేస్తాడు"

"అమ్మ నా కొడకా! నీ యమ్మ జిగుడా! అంతవరకూ నిన్ను బతకనిస్తేగదా"

మళ్ళీ మనసులోనే తిట్టుకున్నాడు వరదయ్య.

"ఆ భయమేమీ వద్దయ్యా! నాకు మైనీరు తీరిశానా ఏండ్లయింది. మేమిద్దరం నచ్చుకునే వచ్చేసినామని వాళ్ళ నోళ్లు మూయిస్తాన్లే. నువ్వు ఊ... అను"

బలవంతం చేసిందామె.

"సరే నీ మాట పకారంవే కానీ"

తన ఆవేశమంతా చల్లారిపోగా పక్కకు జరుగుతూ వప్పేసుకున్నాడా వ్యక్తి.

"ఇంకా మూడు రోజులుంది ఎలక్షన్. ఆ





దినం మా ఇంట్లో వోళ్లంతా ఎలక్షన్ గొడవల్లో వుంటారు. సరిగ్గా అర్ధరాతిరి మనక్కావాల్సిందెత్తుకోని వచ్చేస్తా. నువ్వు రెడీగా వుండు''

తన నిర్ణయం చెప్పేసిందామె.

''ఊ... కానీ'' అంగీకరించాడతను.

''మరిచిపోవద్దయ్యా''

తిరిగి హెచ్చరించింది ఆమె.

''సరే! ఇంకమీ నాయన వచ్చే టయిమయింది. నేనొస్తా'' ఆ వ్యక్తి లుంగీ సర్దుకొని పైకి నిలబడ్డాడు.

"ఊc!"

అనిపైకి లేచి అలాగే మరోసారి అతన్ని పెనవేసుకుపోయింది.

"రేపొస్తాలే... తెల్లారే లెయ్యాల"

అని ఆమె బుగ్గమీద ఒక్క ముద్దుపెట్టి వెనుకనే తెరచివున్న కిటికీగుండా వెలుపలికి వెళ్లిపోయాడతను.

ఆ కిటికీ కానుకొని వున్న వరిగడ్డి పందిరి మీదుగా దిగి దానికి ఆన్చి వున్న నిచ్చెన ద్వారా కిందికి వెలుతున్న ఆ వ్యక్తి ఎవరో ఆ గది పక్కకు వెళ్ళి చూసిన వరదయ్యకి తెలిసిపోయింది.

"ఇంత బరితెగించింద దొంగముండ... అయినా ఆనాకొడుక్కి ఎంత ధైర్యం. నా ఉప్పూ పులుపూ తిని నాకే ఎసురు పెడతాడా వోడు. ఎంత మోసం. దీన్నిట్టే యిడిసిపెట్టేస్తే యట్లా?"

చేష్టలుడిగిన వరదయ్యా పరిపరివిధాల ఆలోచించసాగాడు.

త్రిపురసుందరి అతనితో అన్న మాటలే అతని చెవిలో మారుమోగుతున్నాయి.

"నీకేం భయం లేదయ్యా! నువ్వు ఊ... అను నగలు నట్రా.. దుడ్డు ఎత్తుకొచ్చేస్తా... దూరంగా పొయ్యి ఎవురికీ తెలీకుండా పెండ్లి చేసుకుందాం"

అసహనంగా తలపట్టుకున్నాడు.

"ఇంక మూడు రోజులుంది ఎలక్షన్. మా ఇంట్లో వాళ్ళంతా ఎలక్షన్ గొడవల్లో వుంటారు. సరిగ్గా అర్ధరాతిరి మనక్కావాల్సింది ఎత్తుకోని వచ్చేస్తా. నువ్వు రెడీగా వుండు''

అతని చెవుల్లో అదే మాటలు పదేపదే గింగురుమంటున్నాయి.

"లేదు. ఈల్లేదు. అట్ట జరిగితే నా పరువు బజారుకెక్కుతుంది. తరతరాల మా వంశగౌరవం గంగలో కలిసిపోతుంది. ఆపైన బతికి నా సచ్చినా వొగటే''

అక్కడే చాలా సేపు ఆలోచించిన పిదప త్రిపుర సుందరి గదివెనుక వైపుకు వెడుతున్న వరండా దారి గుండా వెళ్ళి కిందికి చూశాడు.

అప్పటికే మునెప్ప గాఢంగా నిద్రపోతూ గుర్రు పెడుతున్నాడు.

అతని ముఖంలో రంగులు మారాయి. ఏదో ఒక నిర్ణయానికొచ్చినట్లు మేడదిగి శబ్దం చేయకుండా గేటు తెరచుకొని వచ్చి పరుగున మునిరాజు ఇంటికి చేరుకున్నాడు.

జరిగిన విషయం క్షుణ్ణంగా చెప్పి అతన్ని తన వెంట తీసుకువచ్చాడు వరదయ్య.

ఇద్దరూ నిద్రిస్తున్న మునెప్పను సమీపించారు. యమపాశంలా వున్న బారెడు తాడు చేతబట్టుకోని వున్నాడు మునిరాజు.

నిద్రపోతున్న మునెప్పను ఒక్కసారి ఆపాదమస్తకం చూశారిద్దరూ.

గుండెలపై రెండు చేతులూ పెట్టుకొని నిర్భయంగా నిద్రపోతున్నాడు మునెప్ప.

అంత చీకటిలోను... అతని ముఖం స్పష్టంగా కనిపిస్తోంది. చుట్టూ ఒక్కసారి చూసి అతని కభిముఖంగా నిలబడి; ఒకకాలు ఆవలివైపుకు వేశాడు మునిరాజు.

అతనిలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తప్ప మరే చలనమూ లేదు.

వెంటనే వరదయ్య అతని తలదగ్గర నిలబడ్డాడు

ఎక్కడా ఏ అలికిడీ లేదు.

అతనిలాగే ప్రకృతీ నిశ్శబ్దంగా నిద్రపోతోంది. అంతే ఒక్కసారిగా మునిరాజు మునెప్ప రొమ్ముపైన కూర్చొని తని చేతిలోని తాడును అతని మెడకు ఏక కాలంలో చుట్టేసి గట్టిగా బిగదీశాడు.

అదే సమయంలో వరదయ్య మునెప్ప చేతుల్ని కదలకుండా పట్టేశాడు.

మునెప్పకు ఏం జరుగుతోందో తెలుసుకునే అవకాశం కూడా లేదు. కొంతసేపు గింజుకున్న తర్వాత అతని శరీరానికి, ప్రాణానికి మధ్య వున్న లంకె తెగిపోయింది.

అతనిలో చలనం ఆగిపోయింది.

ఒక్క క్షణంలో అతని ఆయువు అనంతవాయువుల్లో కలిసిపోయింది.

మునిరాజు అతని గుండెపైన చెవిపెట్టి విని, ముక్కు దగ్గర చూపుడువేలు అడ్డంగా పెట్టి పరిశీలించి చనిపోయాడని నిర్ధారించుకున్న తర్వాత మునెప్ప కళేబరం ఒక గోనేసంచిలోకి వదిగిపోయింది.

కట్టివున్న సంచి మూతలో గడ్డపార దూర్చి ఆ మూట మధ్యలో వ్రేలాడేటట్లుగా చేసి ఒక సలక పారను దానికి తగిలించుకొని దాన్ని మోసుకుంటూ వీధిలోకి అడుగుపెట్టారు.

ఆ రాత్రివేళ వీధి నిర్మానుష్యంగా వుంది.

పిల్లల్ని తన రెక్కలకింద దాచుకుని నిద్రిస్తున్న నల్లకోడి పెట్టలా మనుషుల్ని దాచుకుని నిండుగర్భిణీలా కనిపిస్తోంది జమిలిగడ్డ!

బచ్చనకుంట్లో గొయ్యి తవ్వి శవాన్ని పూడ్చేయాలని వారి ఆలోచన.

బచ్చనకుంట్లో... వరదయ్య తన ఇంటికి కోయిస్తున్న ఇటుక శూల ఆరోజే అగ్గి పెట్టబడి వుంది.

అది అగ్నిపర్వతంలా నిగనిగమండుతూ కనిపిస్తోంది. దాని కిరువైపులా వున్న పెద్ద పెద్ద పొయ్యిల్లో పెద్ద పెద్ద చింత తుండ్లు చిటపటమని శబ్దంచేస్తూ విరగకాలుతున్నాయి.

అగ్గి ఎగదోసి శూలకు నిప్పుపెట్టాకగూడెం వాళ్లు అప్పుడప్పుడే తమ ఇండ్లకు వెళ్ళినట్టుంది.

అక్కడెవ్వరూ లేరు.

పూర్తిగా అంటుకొని వుంది శూల!

ఆ పొయ్యి కల్లింత దూరంలో ఇంకా మిగిలిపోయిన కట్టెలు కుప్పలు కుప్పలుగా కనిపిస్తున్నాయి. అక్కడికి చేరుకోగానే మునిరాజుకు మహత్తరమైన ఐయిడియా తట్టింది.

"అన్నా! శవాన్ని పూడిసేకంటే ఈ శూల్లో ఏసి కాల్చేస్తే" నొప్పికి భుజం మార్చుకుంటూ సాలోచనగా అన్నాడు.

వరదయ్య ముఖం వెయ్యి క్యాండిల్స్ బల్బులా వెలిగింది.

"అబ్బ! సమయానికొచ్చినామయ్యా! పూడిస్తే ఎప్పుడైనా బయట పడొచ్చు. కాల్చేస్తాం. ఆనబాలి లేకుండాపోతుంది"

శవాన్ని దించుతూ అన్నాడు వరదయ్య. అనుకున్న ప్రకారం ఇద్దరూ అక్కడే వున్న కట్టెల కుప్పల్లోనుండి పొడుగాటి కట్టెలు తీసికొని ఒక పొయ్యిలోనుండి కాలుతున్న అగ్గినిప్పుల్ని గబగబ బయటకు తోడారు.

విశాలంగా వున్న ఆ పొయ్యిలో మనిషిని సులభంగా తోసేసేంత సందు చేశారు.

ఇంతలో వారికేనో మాటలు వినిపించాయి. వారి గుండెలు జల్లుమన్నాయి.

ఈసారి మళ్ళీ జాగ్రత్తగా విన్నారు. రాను రాను వారి మాటలు దగ్గరవుతున్నాయి అటే వస్తున్నారు.

కల్లూరు వెళ్ళే కాలిబాట ఆ శూల పక్కగానే పోతుంది.

ఆ రోజు కల్లూరు సంత!

ఎవరో సంతకు వెళ్ళి సరుకుల మూటల్ని





నెత్తిన పెట్టుకొని అటే నడిచి వస్తున్నారు.

ఈసారి వరదయ్య బుర్ర వేగంగా పని చేసింది.

అంతే వెంటనే ఆ మూటను కట్టెలకుప్ప వెనక్కి చేర్చి తామూ అక్కడే నక్కి కూర్చొని వారి మాటల్ని వినసాగారు వరదయ్య. మునిరాజు.

"వొరే! ఎవురో శూలకు అగ్గి పెట్నారే"

"ఆ... పదా సూతాం!"

"వారు అటే వస్తున్నారు!"

ఇంక తెలుసుకున్నట్లే... అనుకొని వారి శరీరాలు భయంతో జివ్వున చల్లబడినట్లనిపించింది.

శ్వాస కూడా వదలకుండా గమనిస్తున్నారు. నిప్పుల్ని చూసి బీడీలు ముట్టించుకొని మళ్ళీ అక్కడినుండీ మాట్లాడుకుంటూ వెళ్ళిపోయారు వాళ్ళు.

హమ్మయ్య అనుకుంటూ హాయిగా గాలి పీల్చుకున్నారు వరదయ్యా, మునిరాజు.

ఆ తర్వాత సంచితోసహా మునెప్ప శవాన్ని అలాగే పొయ్యిలోకి తోసి, మంచి మంచి చింతమొద్దులు, కట్టెలు కూరి నిప్పులు ఎగదోసి దాన్ని కాల్చేశారు.

అది పూర్తిగా కాలి బూడిదయిందని నమ్మకం ఏర్పడ్డాకా ఇద్దరూ జమిలిగడ్డవైపు బయలుదేరారు.

సరిగ్గా అప్పుడు తొలి కోడి కూసింది!

★ ★ ★

ఆ మరునాటి ఉదయం బారెడు పొద్దెక్కకముందే రాజమ్మ, మునెప్ప లేచిపోయారన్న వార్త ఆ పల్లెలోని ఆబాలగోపాలాన్ని పట్టి కుదిపేసింది.

"మొన్న రెడ్డన్న, నాగమ్మ!"

"ఈ దినం మునెప్ప, రాజమ్మ!"

ఈళ్ళకేం పొయ్యేకాలమొచ్చిందో. ఈడనే పెండ్లి సేసుకోవచ్చు గదా!

లేసిపోవడం అగమానం గాదా!

"అదెట్లా? పోయినోళ్ళు నాలుగు మంది లోను వొగరు ఉప్పు తోలోళ్ళు, యింగొగరు మట్టోళ్ళు"

"ఇబ్బుడు బాగుందో రైతుల సందన!"

ఎవరి నోట విన్నా యివే మాటలు. యిదే ధోరణి! గూడెం అల్లకల్లోలంగా వుంది!

"మీ ఆడదే మా మొగ పిలకాయను వల్లో ఏసుకోని లేపుకొని పూడిసింది రా! దొంగ నాకొడుకుల్లారా!" అని ఒక తెగ వాళ్ళంటే...

"అదేం గాదు... అన్నెం పున్నెం ఎరుగని మా పిల్లను మీ పొగరుబోతు నాకొడుకే నమ్మించి ఎత్తుకోని ఎళ్లి పూడిసినాడురా యభిసారి నా కొడుకుల్లారా! మీరంతా అన్నెకారి నా బట్టి గుంపు" అని మరొక తెగ ఆడవాళ్ళు తిట్టసాగారు.

ఊరంతా తిరిగి రెండు తెగలుగా చీలిపోయింది.

ఆ రోజు రాత్రి సుమారుపాటి దొమ్మీ జరిగింది. దాంతో ఆ ఊరి ఐకమత్యం మరోసారి దెబ్బతింది.

ఆ గ్రామం నాయకులకిది మంచి అవకాశంగా తోచింది.

దాంతో ఒక వర్గంవారు వరదయ్యని, మరోవర్గంవారు సాంబయ్యాని ఎలక్షన్‌లో సమర్థిస్తూ తిరిగి తాగి తందనాలాడడమే కాకుండా ఇరువర్గం వారు పోటీలు పడి దొంగ సారా కాచడానికి పూనుకున్నారు. వారి అనైక్యతను నాయకులు బాగా ఉపయోగించుకున్నారు.

దీంతో తమ పాచిక పారి దానివల్ల ఎక్కువ లబ్ధిపొంది లోలోపలే సంతోషపడిపోయారు వరదయ్యా, మునిరాజు.

★ ★ ★

రెండు రోజులపిదప...

పందిగున్నను తోలుకొని ఒక గొడ్డలి, తట్ట భుజాన వేసుకొని సుబ్బరమణితో బచ్చన కుంటకు బయలుదేరాడు శివదాసు. బచ్చన

కుంట్లో సుబ్బరమణి పందిగున్నను కాస్తు న్నాడు.

అక్కడ బావుల గట్టున మడిసందుల్లో వున్న మాన్లలో ఎండిన మొక్కల్ని వెదుకు తూ కనిపించిన వాటిని గొడ్డలితో కొట్టి తట్టలో వేసుకుంటూ. వెళుతున్నాడు శివదా సు.

"ఏమి శివదాసా! నువ్వా! యింకా ఎవురో ననుకున్నా. బాగుండావా?"

అక్కడే మళ్ళకు నీళ్ళు కడుతున్న కదిర ప్ప పలుకరించాడు. కదిరప్ప మునిరాజు వ్యవసాయం చూసుకునే... జీతగాడు.

"బాగుండానన్నా! నువ్వు బాగుండావా?"

"ఆ! బాగుండానబ్బా యాడ ఈ మద్దెన కనబడలేదే''

"యాడన్నా తీరుబాటు ఈ కరువుకా లంలో ఊరికేనే వుంటే పొట్ట గడవద్దా. పొయ్యిలోకి కట్టెల్లేవని మాయమ్మ వొకటే సతపోరతావుంటే యిట్లొస్తి''

ఏపుగా పెరిగి పంటపైనున్న వరిమళ్ళ వైపు చూస్తూ... అన్నాడు శివదాసు.

"కట్లుంటే... వున్నీగానీ... యింగో పంజె ప్తా సెయ్యి?"

"ఏందో సెప్పన్నా!"

"యాడుండే ఎలకలు ఈ గెనేల్లో వచ్చి సేరుకోని మడి కొట్టేస్తా వుండాయి. అవిట్ని పట్టెయ్యి రెండు శ్యాట్ల వడ్లు, అంత సింత పండు, మిరపకాయలు పెట్టిస్తా. ఇంకా వాటి బొక్కల్లో వుండే వడ్లు తోడుకున్నా రెండుది నాల బత్తెం దొరుకుతుంది ఏమంటావు?" అన్నాడు కదిరప్ప.

"సరే! దిక్కడే మా యబ్బోడుండాడు. యింటికి పొయ్యి ఊదర సట్టి, సలంకపార తెమ్మంటా'' అంటూ అక్కడినుండి వచ్చి బచ్చనకుంట కట్టపైనున్న సుబ్బరమణిని కేకేశాడు శివదాసు.

ఒక చెట్టుకింద కూర్చొని కుంటల్లోని నీళ్ళలో మునిగిమేస్తున్న పంది గున్నను చూసుకుంటూ ఒక కట్టె పుల్లతో నేలను తవ్వుకుంటున్న సుబ్బరుమణి తలపైకెత్తి

"ఏవన్నా!" అని సమాధానమిచ్చాడు.

"ఇట్లరా!" దగ్గరకు పిలిచాడు శివదాసు. సుబ్బరమణి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు.

"ఇంటికి పొయ్యి సలంక పార, యింటెన కుండే కొమ్మన తగిలించిండ్లా ఊదర సట్టి, దాన్నెత్తుకొనొచ్చెయ్. వచ్చేటప్పుడు ఎండి నుగ్గులు, దాన్నిండా ఏసుకోని కాసింత అగ్గే సుకోన్రా పో' పురమాయించాడు.

"ఆ సరేలే..." అనేసి ఎలుక మాంసం దొరకబోతున్నందుకు సంబరపడిపోతూ వె ళుతున్న సుబ్బరమణిని

"అట్లే... వొగ సంచి తీసుకోని రా... ఇక్కడ ఉన్నట్లే వచ్చేయాల" అని హెచ్చ రించాడు శివదాసు.

గంతులేసుకుంటూ సుబ్బరమణి గూ డెంవైపుకు దారితీశాడు.



ఎలుకల వేట ప్రారంభమైంది.

బొరియలకు ఊదరపెట్టి పొగ వచ్చిన చోటంతా తవ్వి ఎలుకల్ని పట్టుకుంటున్నాడు శివదాసు.

అవి సేకరించిన వడ్ల గింజల్ని, గొలకల్ని మట్టితోసహా తోసుకుని ఒక చోట కుప్పపోస్తు న్నాడు.




చంపి చేతికిస్తున్న ఎలుకల్ని సుబ్బరమ ణి సంచిలో వేసుకుంటున్నాడు.

అన్నివైపులా తిరిగి తిరిగి ఎలుకల జాడ ల్ని, బొరియల్ని వెదికి వెదికి పడుతున్నాడు శివదాసు.

దాదాపు అన్ని కన్నాలు అయిపోయిన తర్వాత చివరగా మునిరాజు మడికి, వరద య్య మడికిమధ్యన వున్న కానగచెట్ల గుంపుకు సమీపంలో ఒక పెద్ద బొరియను చూసి కొంచెం తవ్వి బంకమట్టిని తీసి ఊదర బట్టి పెట్టి, తీసిన బంకమట్టిని పొగ బయట కురాని విధంగా, దాని కంఠానికి మెత్తించి వెనుక రంధ్రం గుండా వెలుపలికి వస్తున్న పొగను 'ఊఫ్... ఊఫ్..." మని ఊదసాగా డు.

కదిరప్ప దూరంగా నిలబడి మడి పారిందో లేదో గమనిస్తున్నాడు.

ఆయాసంతో రొప్పుతూ ఊపిరి పోస్తున్న శివదాసు శరీరం చెమట్లతో తడిసిపోతోంది.

సుబ్బరమణి గెనిములో రాబోయే పొగని గమనిస్తున్నాడు. కానీ యెక్కడా పొగ జాడ కనిపించడంలేదు.

చివరికి విసుగుపుట్టిన అతను ఎలుకలు లేవేమొ. వున్నా పొగకు చచ్చుంటాయి. తవ్వితే తెలుస్తుంది గదా అనుకుంటా వున్నంతలోనే "అన్నా... యిద్దో ఆ కానగ చెట్లల్లో పొగ వస్తావుండాది సూడో' అని కేకేశాడు సుబ్బరమణి.

అటువైపు చూశాడు శివదాసు.

చెట్లమధ్య ఒక చోట సన్నగా పొగ వస్తోంది.

"వారేబ్బా నువ్వాదరా నేం జూస్తా!"

పార తీసుకుని అక్కడికి వెళ్ళాడు శివదా సు. సంకనున్న సంచి తీసి పక్కనపెట్టి, చట్టిపైన మూతిపెట్టి వేగంగా ఊదసాగాడు సుబ్బరమణి.

సుబ్బరమణి ఊపిరూదిన ప్రతిసారీ గుప్ గుప్మని అక్కడక్కడ పొగ వస్తోంది.

ఆ పొగతోబాటు ఏదో ఒక విధమైన కుళ్ళు వాసన వస్తుండడం కూడా గమనించా డతను.

చిత్తడిగా కొంచెం ఉబ్బెత్తుగా వున్న ఆ ప్రదేశంలో కాలుపెట్టి కొద్దిగా తొక్కి చూశా డు.

ఎవరో నేలను తవ్వి యధావిధిగా తిరిగి గడ్డితోనే ఆ నేలను కప్పేసినట్టు కొంచెం మెత్తగా వున్నట్లనిపించి పొగ వచ్చినచోట తవ్వసాగాడు.

పార ఆ ప్రదేశంలో మెత్తగా దిగిపోతోంది. పారతోనే చెక్కి మట్టిని అలాగే దూరంగా పార వేస్తున్నాడు. ఇలా వుండగా ఒకసారి నేలలోకి దిగిన పార... భూమిలో ఏదో తగులుకోవడంతో ఎంత లాగినా పైకి రాలే దు.

గట్టిగా బలవంతంగా తన బలమంతా ఉపయోగించి ఒక్కసారిగా పైకి లాగాడు.

అంతే పార వెంట వచ్చిన వస్తువును చూసి కెవ్వున కేకవేయబోయి తిరిగి తనకు తానే సంబాళించుకొని అదేమిటోనని పరిశీల నగా చూశాడు.

అతని గుండె ఆగినంత పనయింది.

పారతోబాటు పైకి వచ్చింది ఒక చీర!

ఆ చీర లేచిన చోట కనిపించింది ఒక స్త్రీ శవం!!

అతని మనసులో ఏదో అనుమానం.

పరిశీలనగా చూసి ధైర్యం చేసి చుట్టూవు న్న మట్టిని యింకొంచెం తవ్వి ఈసారి బాగా చూశాడతను. అది రాజమ్మ శవం!!

"రాజీ'' ఒక్క కేక వేశాడు శివదాసు.

ఆ కేక విని అదిరిపడ్డాడు సుబ్బరమణి.

"ఏందయ్యా'' అంటూ పరుగెత్తుకొని వచ్చి శవాన్ని చూసి నిర్ఘాంతపోయాడు కదిరప్ప.

రాజమ్మ మునెప్పతో లేచిపోలేదనీ ఎవరో చంపి అలా పుకారు పుట్టించారనీ శివదాసు గ్రహించాడు.

"మరి మునెప్ప ఏమైనాడో?"

అన్న ప్రశ్న మెరుపులా మెరిసి అలాగే నిశ్చేష్టుడై నిలబడిపోయాడు శివదాసు.

★ ★ ★

"అన్నా! ఈ మాటిన్నావా?"

"ఏ మాట"

"మనం పూడిసేసిన రాజమ్మ శవాన్ని ఆ శివదాసుగోడు కనుక్కోని పైకి తీసినాడంట"

"వోడేమిరా నాయనా వోడెమ్మ జిగుడు పాతాళంలో వున్నా కనుక్కునేటట్టుందే"

"అట్లే వుంది మళ్ళ"!

"ఆ కనుక్కోనీ ఏమైందీ?"

"మనమే సంపేసి ఆడ పూడిసినట్టు తెలిస్తే ఆ కూలి నాకొడుకులు బతకనిస్తారాని అసలు పోలీసోళ్ళు ఊరికే ఉంటారా?"

"ఏం జేస్తారేంది ఇట్టాంటివి యింతకు ముందు ఎన్ని సేయించలా. డాక్టరు సర్టిఫికెట్లే కాదు పోలీసోళ్ళ ఎంక్వయిరీ ఫారాలే మార్చేయించలేదా ఏందీ. ఇదేంది బూసడా!"

అసలిదంతా జరిగింది మన నాయకుడి వల్లనే గదా! తీగె పెరికితే డొంకంతా కదల్తాది. ముందొచ్చేది ఆయనకే గదా! అదంతా నే జూసుకుంటాలే. అయినా ఈ అలగా జనవు మనల్నేం జేసుకుంటారు. నా బుసపత్తిరి తుంగా! తుసుకా!"

"ఏమొ అన్నా! నాకంతా దిగులుగా వుండాది. పైగా ఆ గూడెం వాళ్ళంతా కలిసిపోయి ఎవురు సంపిందీ ఆరా దీస్తా వుండారంట. అట్లసేస్తే బుడ్డగోనికాడి నుంచీ మునెప్పకాడికి మనం జేసిండేటివన్నీ తెలిసిపోతుందో ఏమొ!"

"ముందే ఆ శివదాసుగోడు కొంతేగాలం నా కొడుకు"

"వోనికి సరిగ్గా సేసినాం గదా! వోడు ప్రేమించిన మాతంగిని ఎవురికీ దక్కకుండా సేసేసినాం.

ఇంక వోడేం జేస్తాడు. బుస పత్తిరి. ఈసారి ఏదన్నా అంటే... ఎలక్షనైపోనీ... వోనింటికే ఎసురు పెడదాం.

నువేం భయపడమాకా. నేనుండాగానీ"

"ఆ ధైర్యంతోనే వుండా"

"అయన్నీ మళ్ళ మాట్లాడుకుందారి గానీ... యిబ్బుడు జరిగే పంజూడు. యట్టదిరిగీ మనవే గెల్సిపోవాల అంతే"

"గూడెం వోళ్ళకు, మాలపల్లె వోళ్ళకు, మేకలోల్ల పల్లె వోళ్ళకు వుండే సారాయంతా పంచేసానా. ఇంటింటికీ రెండు సారాయి పొట్లాలు, రెండుశేర్ల బియ్యం యిప్పిచ్చినా. ఇంకా సందేలకు అడివిలో దిగుండే సారాయి గూడా... గంగడు, తిమ్మడు ఎత్తుకోనొచ్చేస్తారు. అది గూడా పంచేస్తా"

"రేపు నాయకుడు పదిమంది కాకల్దీరిన రవుడీల్ను పంపిస్తాడు. యాడ మనకు వోట్లు పడవనుకుంటే ఆడ వోళ్ళు దొంగోట్లు యేసేస్తారు.

ముక్కిసంగా గూడెపోళ్ళను, మాలపల్లోళ్ళను బూతుల కాడికే రానీకుండా వోళ్ళే యేసేస్తారు. సచ్చియాడుండాదో ఆ రాజమ్మ దాని పున్నెమే యిదంతా..."

"అంతా బాగానే వుండాదన్నా... వోళ్ళను రానీకుంటే ఆ శివదాసుగోడు, కిష్టుడు ఊరికే వుంటారాని"

"ఏం చేస్తారు నా బుసపత్తిరి. లఫంగి నాకొడుకులు ఇట్టాంటి వొగరిద్దరివల్లా ఏమవుతుంది. అసలు ఇప్పుడు ప్రభుత్వాలన్నీ... నిజమైన ఓట్లతో వచ్చినవి అనుకుంటుండావా ఏందీ? సారాయి పొట్లాలకి, రిగ్గింగులకీ గెల్చినవే గదా!"

"సరే అన్నా! ఇప్పుడు ఏంది కార్యం!"

"ఏం లేదబ్బా! శివదాసుగోన్ని, కిష్టున్ని,




నారాయున్ని ఎత్తకొచ్చి మన సారాయి గోడ వున్లో ఏపించేస్తాం. ఎలక్షన్ అయిపోయిన్దాకా పెట్టుకోని రెండు తన్ని పంపిస్తే సరిపాయ. అందుకే ఆ రౌడీలు వస్తావుండేది''

"అబ్బా! నీ బుర్రే బుర్రన్నా''

"ఏమనుకున్నావు మళ్ళా!"

"ఏమొ అన్నా! ఆ గూడెపోళ్ళు రాజమ్మ శవాన్ని కనుగున్నట్లు మనం మునెప్పను ఇటుక శూల్లో ఏసి కాల్చేసిండేది మంగమ్మను పాడుసేసిండేదీ కనీసం ఎలక్షన్‌లు అయిపోయిందాకానైనా బయట పడకుండా సూసుకుంటే చాలు''

"ఆ సంగతి నా కొదిలేయ్''

సారా గోడవున్లో ఆనాటి రాత్రి వరదయ్యకు మునిరాజుకూ జరుగుతున్న సంభాషణ అది.

అప్పటికే అడవినుండి దొంగ సారా మోసుకొచ్చి అక్కడ పెట్టిన గంగడు అంతా విన్నాడు.

ఆ సంభాషణ పూర్తయ్యేదాకా వారతన్ని గమనించనేలేదు.

సారా వాళ్ళకు అప్పజెప్పిన గంగడు వేగంగా గూడెంవైపు బయలుదేరి వెళ్ళాడు.

ఆ తరువాత మునిరాజు వెళ్ళిపోయాడు. అతను అటు వెళ్ళగానే ఇటు వచ్చింది రంగసాని.

"మామా ఈ రోజే మంచి మూహూర్తం. ఊరు సద్దుమణిగాక బసివి గుడిసెకి పొయ్యి శోభనం జరిపేసుకో' అని తను వచ్చిన విషయం చెప్పింది.

ఆ వార్త విని వరదయ్య ఎగిరి గంతేసినంత పని చేశాడు.

ఆ మాటల్ని మరి రెండు చెవులు వింటున్నాయన్న సంగతి వారు గమనించనే లేదు.

★ ★ ★

ఆ మరునాటి రాత్రి పదిగంటలప్పుడు పల్లె నిర్మానుష్యంగా ఉంది.

ఆ పల్లె గాఢనిద్రలో మునిగిపోయి వుంది ఎక్కడా ఏ అలికిడి లేదు.

కొందరు రహస్యంగా అక్కడ సంభాషించుకుంటున్నారు.

ఆ సంభాషణ గాలిని చీల్చుకోని వినిపిస్తున్నట్లు మంద్రస్థాయిలోనే సాగుతోంది.

"వొరే! దిగిండే సారాయంతా ఎత్తుకొచ్చేయండి. ఎట్ట ఈడ ఉన్నిట్టే ఉండాల... ఈ రోజుతో బట్టీ నిలిపేసి ఎత్తకొచ్చేయండి. పోండి... భద్రం ఎవరికంటా పడకూడదు. తెల్లారితే ఇంకా రెండురోజులే ఎలక్షన్లు. సానా పనుంటుందిరా నీయమ్మ జిగుడా! బిర్నే వచ్చేయండి''

ఒక కంఠం పురమాయించింది. ఆ మాటలు ముద్దగా నత్తినత్తిగా వినిపిస్తున్నాయి. అతను తాగేసి మాట్లాడుతున్నట్లు అతని మాటలనుబట్టి అర్థమవుతుంది.

"సరేలే సామీ! తెల్లారేసందికి వచ్చేస్తాములే. పోయి వస్తాం"

ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

ఆ తర్వాత మూడు ఆకారాలు అడవిలోకి వెళ్లే దారిగుండా కదిలి వెళ్లిపోయాయి.

ఆ వెళ్లినవారు తిమ్మడు, కర్రోడు, గంగడు.

మరికొంతసేపటికి అంతవరకు అర్ధర్లేసిన ఆ ఆకారం అడుగులు వేసుకుంటూ గూడెం మొగదాల వెలివేసినట్లు ప్రత్యేకంగా కనిపిస్తున్న మాతంగి గుడిసె వైపుకు బయలుదేరింది.

ఆ ఆకారం వరదయ్యే!

అలా మెల్లగా వెళ్లి మాతంగి గుడిసె ముందర నిలబడ్డాడు.

గుడిసెలో నుంచీ సన్నని వెలుగు కనపడుతోంది. దాన్ని చూసి ఒక నవ్వు నవ్వుకొని, 'ఒసే నీ యబ్బుడాలా! నేను మొనుసు పడి రంగసాని దగ్గర రాయబారం పంపిస్తే

కాదంటావా! ఇబ్బుడు సూడో బసివిదానివి అయిపోతివి. అప్పుడే నా మాట వినింటే నిన్ను పువ్వుల్లో పెట్టుకొని సూసుకోనంటే. ఇబ్బుడు ఈ వాడకంతా వదినవై పోతివి. నన్ను కాదని మంగి ఏమాయ? రాజీ ఏమాయ? అయినా పరవాలేదులే. ఎట్టాగైనా నీకు కన్నెరికం చేసేది నేనే గదా. ఇబ్బటికై నా నన్ను మంచిగా సూసుకో. నీ మీద ఈగ వాలనీయను. కాదంటివా రేపుట్నుంచీ కుక్కలు చింపిన పుల్లాకు మాదిరి అయిపోతావు. ఇప్పటికైనా తలుపు తీయ్. తీసి నన్ను పిల్చుకోయే లోపలికి. ఏయ్ తియ్ తలుపు''

తలుపు తెరుచుకోలేదు.

"తియ్యే తలుపు'' అంటూ గద్దించాడు. అయినా తలుపు తెరుచుకోలేదు. దాంతో రెచ్చిపోయిన వరదయ్య "ఓసే లమ్డీ బసివి దానా తియ్యే నీయమ్మ'' అంటూ కోపంగా తలుపును ఒక తన్ను తన్నాడు.

ఆ దెబ్బతో భళ్లున తెరుచుకుంది తలుపు.

దాంతో ముందుకు తూలి పడబోయి నిలదొక్కుకొని "అమ్మా! నా బుసపత్తిరి! తలుపు తీసే పెట్నావా'' అంటూ అంతలోనే ప్రేమను వలకబోసి ఆమెవైపు చూశాడు. గోడవైపుకి తిరిగి ఉన్న ఆమె సన్నగా వెలుగుతున్న నూనె దీపపు కాంతిలో తాను పంపించిన పసుపుచీరతో వెలిగిపోతూ కనిపించింది.

తల స్నానం చేసింది కాబోలు ఆమె వెంట్రుకలు నల్లగా, పొడవుగా చెలియలికట్టను తాకి పల్చగా నలుదిక్కులకు పరచుకున్న సముద్రకెరటంలా మనోహరంగా కనిపిస్తున్నాయి.

మెల్లగా అడుగులు వేసుకుంటూ వెళ్లి వెనకనుంచే ఆమె భుజాల్ని పట్టుకొని "ఇంకా నా పైన కోపమా! దా... దా.. నీకేమి పరవాలేదులే. నేనుండాగానీ.. దా...దా'' అంటూ ప్రేమగా ఆతని వైపుకు తిప్పుకున్నాడు ఆమెను.

అంతే...

ఆమె ముఖం చూసిన అతనికి గుండె ఆగిపోయినంత షాక్ తగిలింది.

బసివిగా ముద్దరేసి వదిలేసిన మాతంగి స్థానంలో త్రిపురసుందరి?

మాతమ్మను బసివిని చేయమని రంగసానికి చెప్పేటప్పుడు, రంగసాని మాతంగిని కన్నెరికం చేయమని వరదయ్యకు వర్తమానం తెచ్చినప్పుడు విన్న అజ్ఞాత చెవులు ఆమెవే.

తన తండ్రి చేసే అక్రమాలకు ఎలా అడ్డువేయాలో ఇన్ని రోజులు తెగ మధనపడి చివరికి తన స్నేహితురాల్ని రక్షించుకోవడానికి తన నగలు, బట్టలు అన్నీ ఆమెకు ఇచ్చి, ఆమెకు పంపిన పసుపుచీర తాను కట్టుకొని పది నిముషాలు ముందే శివదాసుతో ఊరొదలి వెళ్లిపొమ్మని మాతంగిని పంపి ఆమె స్థానంలో తండ్రికోసమే ఎదురు చూస్తూ కూర్చుంది తను.

ఈ విషయమంతా చెప్పి శివదాసును తీసుకురావడానికి ఆతనింటికి బయలుదేరి వెళ్లింది మాతంగి.

ఈ విషయం అతను గ్రహించలేకపోయాడు. అక్కడ... తన కూతురు ముఖం చూసిన వరదయ్యకు క్షణంలో తాగిన మత్తంతా దిగిపోయి అక్కడే కుప్పలా కూలిపోయాడు.

అలా కొంతసేపు గడిచాక ఇంకా అక్కడ నిలబడలేక బయటికి వచ్చేశాడు.

కానీ తనకీ విధంగా గుణపాఠం చెప్పిన మాతంగిని అంత సులభంగా వదలకూడదనుకుంటూ ఏదో స్ఫురించినట్లు ఆమెను వెతుక్కుంటూ మాతమ్మ గుడివైపు బయలుదేరాడు.

అప్పటికే అందరి యిండ్లలోను దీపాలు ఆర్పివేశారు. శివదాసు యింట్లో మాత్రం బుడ్డీదీపం వెలుగుతోంది.

ఇంట్లో చుక్కమ్మ, సుబ్బరమణి నేలపైన గాఢంగా నిద్రపోతున్నారు. శివదాసు తల్లి




మేలుకొని పెరట్లో ఏదో పని చేసుకుంటోంది. ఆ పని ముగించి త్వరగా పడుకోవాలని ఆమె ప్రయత్నం.

ఇంట్లో వెలిగే బుడ్డీ వెలుతురు పడుతున్న ఒకచోట ఇంటి ముందర ఒక సానరాయి వేసికొని కొడవలి నూరుతున్నాడు శివదాసు.

చుక్కమ్మను పిల్చుకుని ఉదయమే అడవికి కట్టెలకు పోవాలని ఆతని ఆలోచన.

అందుకే ఎప్పుడో మూలపడివున్న మచ్చుకత్తిని తీసి పదును పెడుతున్నాడు.

కత్తి కర్ర్కర్ర్‌మని శబ్దం చేస్తోంది.

అయితే అతని మెదడులో గంగడు చెప్పిన విషయమే మెదులుతోంది.

"మా అన్నను సంపేసినారు, మంగినీ సంపేసినారు, సారాయి తాపి బాలకిష్టున్ని సంపేసినారు. అబ్బ! ఎంత రాక్షసులు. రాజమ్మను చెరిపేసి, మునెప్పను కాల్చేసి వోళ్లిద్దరూ లేసి పూడిసినారని పుకార్లు పుట్టించినారు దొంగ నాకొడుకులు. నన్నేమీ సేయలేక నేను లేనప్పుడు సూసుకోని మాతంగిని బసివింజేసేసినారు. నన్నూ, కిష్టున్ని, నారాయున్ని ఎత్తకపొయ్యి గొడవున్లో యేసి కొట్టిస్తారంట. సూస్తా! అదీ సూస్తా! ఏ నా కొడుకు అడ్డమొస్తాడో'

ఆలోచించేకొద్దీ ఆతనిలోని ఆవేశం పొంగి పొరలుతోంది.

సాన దేలుతున్న మచ్చుకత్తి తెల్లగా మెరుస్తోంది. ఆలోచించే కొద్దీ చిన్నప్పుడు తెలుగు పుస్తకంలో చదువుకున్న క్షీర సాగర మథనం గుర్తుకొస్తోంది శివదాసుకు.

దానికి తోడు ఎప్పుడూ సారాకాచి బతుకుతున్న ఆ గ్రామమే ఒక సురసాగరంగా తోచిందతనికి.

ఆనాటి క్షీరసాగర మథనంలో మంటలతో కూడిన హాలహాలం పుడితే ఈనాటి ఈ సురసాగర మథనంలో బాధలు, కన్నీళ్లు, కష్టాలు అణచివేతలు, అవమానాలతో కూడిన హాలాహాలంలాంటి శోకం పుట్టింది.

ఆనాటి హాలాహాలం హరుడు మింగి అరాయించుకుని దేవ దానవులకు ఆనందాన్ని ప్రసాదించాడు.

ఈనాటి ఈ సురసాగర మథనంలో హాలాహాలాన్ని మించిన బాధల్ని మింగి అరాయించుకుని మమ్మల్ని కన్నారు మా పెద్దోళ్లు.

ఆ శోకాన్ని మింగి అరాయించుకునే శక్తీ ఓపికా ఇంక మాకులేవు''

ఆలోచించేకొద్దీ ఆతని రక్తం వేడెక్కుతోంది. ఆవేశం కట్టలు తెంచుకుంటోంది.

సాన దేలిన మచ్చుకత్తి మిలమిల మెరుస్తోంది.

ఇంతలో ఆతని ఆలోచనలకడ్డు తగుల్తూ పందుల గుడిసెలో నుండి పందిగున్న ఎలాగో వెలుపలికి వచ్చి యింటి వెనక గుండా చేన్లోకి పరుగెత్తింది. ఆ విషయం గమనించిన శివదాసు తల్లి...

"అర్రర్ర్... యిదెట్లో బయటికొచ్చేసిందే... కుక్కలు సంపేస్తాయే'' అనుకుంటూ "శివుడూ గున్న చేన్లోకి తప్పించుకొని పోయింది సూడ్రా'' అంది.

దాంతో చేతనున్న కొడవలిని అలాగే చేతబట్టుకోని "వో దా...దా... ద గూచీ.. గూచ్.. నిలే నీ యబ్బడాలా!" అంటూ దాన్నివెంబడించాడు.

కానీ అది ఆగింది కాదు.

అది అలాగే గూడెం వెనుక చేన్లలోపడి దక్షిణం వైపుకు యింకా వేగంగా పరుగెత్తసాగింది.

"థూ, నిన్నుకోసి బండకెయ్య. నిన్ను నక్కలు దినా, మబ్బులో యాడికే? మల్లుకో థూం" పచ్చి బూతులు తిడుతూ రాళ్లు విసురుతూ కిరాతార్జునీయంలో మాయా వరాహాన్ని వెంబడిస్తున్న కిరీటిలా... దాని వెంట పరుగెత్తుతున్నాడు.

అది రెట్టించిన వేగంతో గుర్‌గుర్ శబ్దం

చేసుకుంటూ పరుగెత్తి పరుగెత్తి ఆనాడు తిన్నడు వెంబడించిన మాయా వరాహం శివలింగం పక్కన మాయమైనట్లు అది మాతమ్మ విగ్రహం వెనుకనున్న కానగ చెట్లల్లో మాయమైపోయింది.

"అయ్యో కుక్కలు చూస్తే చీల్చేస్తాయే గున్నముండా!"

అనుకుంటూ ఆ చీకట్లో చెట్ల మధ్యలోకి వెళ్లడానికి తటపటాయిస్తూ అక్కడే నిలబడ్డాడు శివదాసు.



త్రిపురసుందరి నుంచి సెలవు తీసుకొని వచ్చిన మాతంగి నేరుగా శివదాసు ఇంటికి వచ్చింది.

ఆ సమయంలో శివదాసు తల్లి పడుకోవడానికి సిద్ధపడుతోంది.

అంత అర్ధరాత్రి వేళ మాతంగి తమ యింటికి ఎందుకు వచ్చిందోనని ఆమె చాలా ఆశ్చర్యపోయి "ఏమే మాతా! ఈ యేలప్పుడు వస్తివి?" అని ప్రశ్నించింది.

"అత్తా! మీ శివుడు వుండాడా?" ఆత్రంగా అడిగింది.

"ఇప్పుడే పందిగున్న తప్పించుకొని సేన్లలో పడిబోతే దాన్ని తోలుకొని వచ్చేదానికి అట్లాపోయినాడు'' బెంబేలు పడిపోతూ చెప్పింది శివదాసు తల్లి.

అంత అర్ధరాతిరి వేళ మాతంగికి శివదాసుతో ఏమి పనో అని లోలోపలే అనుమానపడింది.

"ఇంత పొద్దుకాడ శివుడ్ని అడగతుండావే ఏమి'' సూటిగా ప్రశ్నించింది.

"ఏమిలేదు యెట్టాబోయా!"

"మాతమ్మ గుడికల్లానే పోయినట్టున్నాది ఏమి?"

"ఏంలేదులే. వస్తా అత్తా వస్తా''

అక్కట్నుంచీ గబగబ ఇళ్ల వెనుక చేన్లోకి పరుగెత్తినట్లు హడావిడిగా నడుచుకుంటూ వెళ్లిపోయింది మాతంగి.

ఆమె వాలకం అర్థంకాక అలాగే చూస్తూండిపోయింది శివదాసు తల్లి.

మాతంగి అలా చేన్లలో నడిచి వెలుతుండగానే ఆమెకు ఎదురుపడ్డాడు వరదయ్య. ఆమెను గుర్తుపట్టిన వరదయ్యకు కోపం రెట్టింపయ్యింది.

"ఏమే బసివి ముండా! నీ గుడిసెలో నా కూతుర్ని పెట్టి నాకే బుద్ధిసెప్పుతామనుకుంటివా. ఈ దినవు నా సేతిల్లోనే నీ చావు'' అంటూ మీదపడబోయాడు.

మాతంగి తప్పించుకొని మాతమ్మ గుడివైపు పరిగెత్తసాగింది.

అయినా అతను వదల్లేదు, వెంబడించాడు. మాతంగి అలా వెళ్లి మాతమ్మ గుడి పీఠం వెనుక చంద్రచెట్టు క్రింద చీకట్లో దాక్కుంది.

తలలేని మాతమ్మ విగ్రహం చీకట్లో స్పష్టంగా కనిపిస్తోంది.

వరదయ్య ఆ గుడి ముందరికొచ్చి చుట్టూ చూశాడు. అంతా చీకటే.

ఆ చీకట్లో... మాతమ్మ విగ్రహం చూసిన ఆతనికి ఉన్నట్టుండి భక్తి ముంచుకొచ్చేసి




చేతులు జోడించాడు.

"తల్లీ! నన్ను సెమించు. నీ కోసవే నేను మాతంగిని బసివి జేయిస్తి. కన్నెరికం చేయాలని వస్తే అది తప్పించుకొని యిద్దో ఆ చెట్లలోనే ఎక్కడో దాక్కుంది. దీని కత రేపు సూస్తా. దానికి రేపు నేను సేసేది కన్నెరికం కాదు. నీకు బలిదానం" అని స్వగతంగా అనుకున్నా ఆ మాటలు పైకే వినిపించాయి.

ఆ చీకట్లో.... మరో వైపు... పందిగున్నను వెతకడానికి వచ్చి ఒక చెట్టు చాటున నిలబడి వున్న శివదాసు చెవిలో ఆ మాటలు పడనే పడ్డాయి.

★ ★ ★

మరి కాసేపట్లో తెల్లవారబోతోందనంగా ఆ గ్రామంలో ఉన్నట్టుండి అల్లకల్లోలం బయలుదేరింది.

ఎలక్షన్ సందర్భంగా పంచిన సారాతాగి ఉప్పు తోళ్లరాముడు, గంగడు మరికొందరు నెత్తురు కక్కుకోని చచ్చిపోయారు.

వాళ్ల శవాల్ని ఊర్లోని సత్తెమ్మ రచ్చబండ దగ్గర చేర్చారు.

ఆబాలగోపాలం అక్కడ చేరిపోయి శోక సముద్రంలో మునిగివున్నారు.

చనిపోయిన వారిలో స్త్రీలుకూడా లేకపోలేదు. గూడెం గూడెమే గోడుగోడున ఏడుస్తోంది.

కొడుకుల్ని పోగొట్టుకున్న తల్లులు, తమ్ముళ్లను అన్నలను పోగొట్టుకున్న అక్కాచెల్లెళ్లు, బిడ్డల్ని పోగొట్టుకున్న తండ్రులు, ఆ రోజుతోనే అనాధలుగా మారిపోయిన ఎందరో... కడుపు చెరువయ్యేలా ఏడుస్తున్నారు.

ఆ కల్తీసారా తాగి ఆ గ్రామంలోని ఇతరపల్లెల్లో కూడా చచ్చిపోయిన వాళ్లు ఆసుపత్రిల పాలయిన వాళ్లు ఎందరో ఉన్నారనీ తెలిసింది.

ఈ సంఘటనతో ఆ గ్రామంలోని ప్రజల గుండెలు ప్రతీకారంతో రెచ్చిపోయాయి.

ప్రతి పల్లె ఆవేశంతో ఊగిపోతోంది!
ప్రతి గుండె కోపంతో ఉడికిపోతోంది.

"వొరే ముండనా కొడుకుల్లారా! ఇంకా తెలీలేదంట్రా మీకు. పోయినసారి బుడ్డన్నను సంపేసినారు. బాలకిష్టున్ని, మునెప్పను, మంగమ్మను, రాజమ్మను అందర్నీ మొన్ననే పొట్టన బెట్టుకున్నారు.

మన ఆడబిడ్డల్నెందర్నో మానభంగాలు సేసి నాశనం సేసేసినారు'' కళ్ళనీళ్లు తుడుచుకుంటూ నొప్పిగా బాధగా చెప్పాడు కిష్టుడు.

అతని కళ్లు ఏకధారగా వర్షిస్తుంటే ఇంకా చెప్పుకుపోతున్నాడు.

నా సెల్లెల్నీ అన్నాయంగా సంపేసినార్రా. అన్నెం పున్నెం తెలీని మాతంగినీ లొంగలేదని ముద్దరేసి బసివిగా మార్చేసినార్రా.

మన నమ్మకాల్ని ఆశారాల్ని, మనలో వుండే ఎస్తక్కువల్ని అడ్డం పెట్టుకోని మన్లో మనకే గాకుండా సేసినారు. ఇది తెలీక మనంవేమొ ఉప్పుతోళ్ళమనీ, మట్టితెగోళ్లమనీ కొట్టుకోని సస్తావుండాం. ధూం దొంగనా కొడుకుల్లారా! సిగ్గూ, సెరం లేదంట్రా మీకు?"

"వొరే ఇంత జరిగినా మీకు రోసం పాసం లేదా? మీకసలు మగతనమే లేదా? మీరంతా మొలతాళ్లు కట్టిన మొగోళ్ళేనాని అనుమానం!

ధూం... మీ బిడ్డలమని సెప్పుకునేదానికే సిగ్గుగా వుండాదిరా మాకు'' తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు రామకృష్ణుడు.

"వొరే! ఎందుకురా యింకా భయం. ఈ తెగలు, ఈ కులాలు ఈ మడుసులు బెట్టుకున్నివేరా? ఈ గాలి, నేల, ఈ నీళ్లు, ఆకాశం అన్నీ అందరికీ సమానమేరా. పుడతానే

ఎవురూ లబ్బెతో పుట్లేదురా. మద్దెలో మన్లాంటోళ్ళను కులాల పేరుతో, మతాల పేరుతో, ఆశారాల పేరుతో యింకా ఎన్నెన్నో రీతులుగా యేరుసేసి, దోచుకోని కొందరు మాత్రమే సావుకార్లయి పోతావుండారు. మన్లాంటి పేదోళ్ళంతా కులాల అడ్డుగోడలు పగులగొట్టుకోని వొగిటిగా ముందుకు రావాల్రా. శివదాసు ముందుట్నుంచీ సెప్తావుంటే మీకు తెలీలా ధూc..." రెచ్చిపోతూ తిరిగి అన్నాడు కిష్టుడు.

"ఇప్పుడు నేను సెప్తావుండా! నిజంగా నిజంగా మీ మూతిమీద మీసాలుంటే అన్నీ మరిసిపోయి వొగటిగా రాండ్రా! మనల్ను ఈ మాదరి సేసినోళ్ల తలలెత్తుకోనొద్దాము. రాండ్రా రేయ్'' ఆవేశంతో ఎర్రబారిన కళ్ళతో అన్నాడు రామకిష్టుడు.

"వొరే! మీరు సెప్పింది నిజcవే. ఇంత జరిగినా మేము ఊరికేనే వుంటే యింక మేము మడుసులమే గాదు.

అందుకే మనమూ మడుసులమేనని నిరూపిద్దాం. పదండ్రా? మన బండబతుకులు తిరగబడితేగానీ బాగుపడవు. మనమేమి మట్టి మడుసులంగాదు. రాండ్రా! రేయ్!" పొలికేక పెట్టాడు. అంతవరకూ మౌనంగా వున్న వెంకటస్వామి.

"మట్టిపిసికే ఈ సేతుల్తో మన బతుకుల్ని ఇట్టు కూల్చేసిన ఆ నా కొడుకులకు ఇదే తావనపాడె కట్టేద్దాం. నడవండ్రా!" కసిగా అరిచాడు రత్తయ్య.

వారి మాటల్తో రెచ్చిపోయిన యువతీ యువకులు, ముసలీ ముతక, పిల్లా జల్లా ఏది చేతికి దొరికితే దాన్ని తీసుకుని రొప్పుతూ ముందుకు ఉరకసాగారు పైకి లేచిన ప్రభంజనంలా వారిలో రగిలిన ఆ కసి ఆ గ్రామంలోని ప్రతి పల్లెలోను ప్రతిధ్వనించింది.

కొడవండ్లు, దుడ్డు కర్రలు, రోకండ్లు, పారకలు, చేటలు, గొడ్డళ్లు యింకా... ఎన్నెన్నో వారి చేతుల్లో వదిగిపోయి ఆకాశంలోకి లేచాయి.

పొంగి వచ్చే ఉప్పెనలా ఆ జనప్రవాహం జమిలిగడ్డ వైపుకు కేకలతో, అరుపులతో కోలాహలంగా ఆవేశంతో సాగిపోతోంది.

సరిగ్గా అప్పటికే మాతమ్మ విగ్రహంపైన చండ్ర చెట్టులో ఎవరిదో తల నెత్తురోడుతూ వేలాడుతోందన్న వార్త ఆ గ్రామంలో దావానలంలా వ్యాపించింది. అప్పటికే కట్టెలకు అడవిలోకి బయలుదేరిన వాళ్లు ఆ దృశ్యాన్ని చూడనే చూశారు.

"ఎందరో కోళ్లకోసి తమ కోర్కెలు నెరవేరాలని వాటి తలల్ని చండ్ర చెట్లో వేస్తారు. కానీ ఈ దినం ఈ గ్రామానికి పట్టిన గ్రహాలు వదిలిపోవాలని ఏ మహానుభావుడో ఆ దుర్మార్గుడి తలను నరికి అక్కడ వేశాడు'' అనుకున్నారు అక్కడ చేరిన వాళ్ళంతా.

అది అన్ని ఏళ్లుగా ఆ గ్రామాన్ని పట్టి పీడించిన వరదయ్య తల!

అయినా ప్రజా ప్రవాహం తమవాళ్ల చావుకు కారణమైన వారందరి కోసం జమిలి గడ్డవైపు పరుగులెత్తుతోంది.

అప్పటికే చీకటి ప్రసవించిన కాంతి శిశువులా నెత్తురు ముద్దలా ఎర్రగా స్వేచ్ఛగా కొత్త వెలుగుల్తో ఆ నేలను పునీతం చేసే తొలి కిరణాల్ని ప్రసరింపచేస్తూ తూర్పున సూర్యుడు ఉదయిస్తున్నాడు.

ఆకాశంలో పక్షులన్నీ, హాయిగా ఎగురుతూ కనిపిస్తున్నాయి. అప్పటికే ఆ వార్త తెలిసి కాబోలు ప్రభుత్వాధికారులు, పోలీసులు వున్న వాహనాలు వేగంగా దుమ్ము లేపుకుంటూ ఆ మట్టిరోడ్లో అటువైపుకు దూసుకువస్తూ కనిపిస్తున్నాయి.

కానీ ఎవరికీ కనిపించనిది మాతమ్మ చెట్లోకి వరదయ్య తలను ఎగురవేసిన శివదాసూ, ఎన్నో అవమానాలు భరించి చివరికి బసివిగా మార్చబడిన మాతంగి మాత్రమే.







# 'ఊరు' పై సమీక్షలు

అక్టోబర్ 'చతుర'లో ప్రచురితమైన నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన వసంతరావ్ దేశ్‌పాండే నవల 'ఊరు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## 'అడవి' మార్గంలో 'ఊరు'

(ప్రథమ బహుమతి

రూ. 100/- పొందిన సమీక్ష)

నడుస్తున్న చరిత్రను రికార్డు చేసింది 'ఊరు'. గతంలో 'అడవి' నవల రాసి ఆలోచన రేకెత్తించిన వసంతరావ్ దేశ్‌పాండే అదే మార్గంలో ఒకడుగు ముందుకేసి సమగ్రమయిన ఫీల్డు స్టడీతో 'ఊరు' నవల నిర్మాణానికి రూపశిల్పిగా నిలిచారు. అడవిపైన, అడవుల్లో నివశిస్తున్న ప్రజల జీవన విధానంపైన దేశ్‌పాండేకు చక్కటి అవగాహన ఉన్నట్టు 'ఊరు' చదివితే అర్థమవుతుంది.

'తుపాకి గొట్టంతో రాజ్యాధికారం చేజిక్కించుకోలేరన్నవారికి "తుపాకి గొట్టంతో మీరు రాజ్యాధికారం చేయలేరని చెప్పిన ఊరది' అనటంలో రచయిత రాజకీయ పరిణితి సుస్పష్టం. 'తమ సంప్రదాయ వృత్తిని, పల్లెను వదిలి పట్టణానికి వెళ్లటానికి ఇష్టపడని ఈ దేశపు వెన్నుముకలోని ఒక పూస ఆ ఊరు' అని చెప్పడంద్వారా ఒక నూతన సంస్కృతిని రచయిత మన కళ్ళకు చూపిస్తాడు.

ఆదిలాబాద్ జిల్లాలోని అడవి బతుకులు, గోండులు ఎదుర్కొంటున్న దోపిడీ విధానాలు 'ఊరు' నవలలో చూడగలుగుతాం. గిరిజనులు నివశిస్తున్న నోటిఫైడ్ ఏరియాలోనూ చట్టాల అమలులో వైఫల్యం, సంస్కరణ భ్రమలు, జనాకర్షక పథకాలు, రాజ్యహింస, గిరిజనులకు మేలుచేద్దామని నడుం బిగించిన కొంతమంది చిత్తశుద్ధి గల అధికార యంత్రాంగానికి ఎదురయిన 'చేదు' అనుభవాలు 'ఊరు' నవలలో మిళితమయి వున్నాయి.

-సన్నశెట్టి రాజశేఖర్
మందస

## ఊరు కాదు పల్లె!

(ద్వితీయ బహుమతి

రూ. 75/- పొందిన సమీక్ష)

కథావస్తువు బాగున్నా పాత్రల చిత్రణలో ఒకదానికొకటి సంబంధం లేని అంశాలు కొన్ని చోటుచేసుకొన్నాయి.

డాక్టరు సిద్ధార్థ పాత్ర మొదట ఆసక్తి కలిగించి తీరా ఆ తర్వాత మరుగునపడింది. రిసెర్చ్‌కై వచ్చిన భగీరథ పరిశీలనలో అదనంగా గిరిజన జీవితాల గురించి తెలియజేయబడిన అంశాలు ఏవీ లేవు. ప్రియాంక పాత్ర పేలవంగా మిగిలిపోయింది.

నక్సలైటు ఉద్యమ ప్రభావం ఏమేరకు గిరిజన జీవితాలకు ఉపయోగపడిందో స్పష్టత లేదు. పోలీసుల అత్యాచారాలు, భూపంపకం, గిరిజనుల స్పందన కలిపి గజిబిజి చేయబడ్డాయి. ఉద్యమ ప్రభావంవల్ల గిరిజనులు చైతన్యవంతులైనట్లా? డాక్టరు సిద్ధార్థ కృషివల్లనా? ప్రభుత్వంవారి ఐ.టి.డి.ఎ. కార్యక్రమాల ప్రభావమా? ఇదేదీ గాక కుల పెద్ద డప్పు వాయింపుతో ఊరిలో చైతన్యం వెల్లివిరిసి దోపిడీ కుటుంబాలకు ప్రత్యక్షంగా పాఠం నేర్పినట్లు చిత్రించడం వాస్తవానికి, ఆచరణకు చాలా దూరంగా వుంది. పైగా వారి సాంప్రదాయాలకు వారినే వదిలివేసినట్లున్నది.

దళంలో సీతక్క ఏమైనట్లు? ఆమె కూతురు రేలకు భవిష్యత్తులో ఏం జరిగింది? నారాయణ దళం ఎటు వెళ్లింది? ఎన్నికలపట్ల చైతన్యం వెల్లివిరిసిన ఆ 'ఊరు' గిరిజనులు ఏ నిర్ణయం తీసుకున్నారు? స్పష్టత లేదు. రచయిత పాత్రల పోషణను పొడిగించి వివరించడానికి భయపడ్డాడా? లేక కథను త్వరగా ముగించడానికి పాత్రల పోషణను త్వర త్వరగా కుంచించుకుపోయాడా? అర్థంకాదు. ఏదైనా కాలక్షేపానికి కథ పనికివచ్చింది.

-కల్వాల నాగార్జునరెడ్డి
జనగామ

## సజీవ చిత్రం

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'**జీ**వితంలో ఒక్కసారైనా పోలీసు దెబ్బో, ఎక్సైజ్ దెబ్బో, ఫారెస్ట్ దెబ్బో, రెవెన్యూ దెబ్బో... తినని అడవితల్లి బిడ్డ లేడు' అంటే అతిశయోక్తి కాదు.

నగ్నసత్యమైన ఈ కఠోర వాక్యమే వసంత్‌రావ్ దేశ్‌పాండేను ఆనాటి అడవి నుండి ఈనాటి ఊరుకు పయనింపచేసి అడవిబిడ్డల దీనగాథలను 'చతుర' వేదికగా పాఠకులకు కళ్ళకు కట్టినట్లు వివరించటానికి మూలమై నిలిచింది.

ఏ గిరిజనుడి క్షేమంకోరి అన్నలు ఉద్యమాలను లేవనెత్తుతున్నారో సరిగ్గా అవే... ఆ అభాగ్య అడవి బిడ్డల పాలిటి యమపాశాలు, శాపాలై యిటు పాలిత సర్కారుపట్ల, అటు నక్సలైట్లపట్ల విముఖతను క్రమంగా పెంచుతున్నాయని ఈ నవలలో రచయిత నర్మగర్భంగా హెచ్చరించిన మాటలు ఉభయులకూ ఆలోచించదగ్గ ఉద్బోధలే.

నవలలో సిద్ధార్థ పాత్రను రచయిత అసమగ్రంగా చిత్రించారు. చుక్క తెగినట్లుగా అక్కడక్కడా గోచరిస్తుంది ఆ పాత్ర. ఇక గిరిజనుల్లో అధికులైన గోండుల 'గోండీ'కి ప్రత్యామ్నాయంగా 'తెలంగాణా (ఆఖరి గ్రేడ్) తెలుగు యాస వాడటంవలన యితర ఆంధ్ర పాఠకులకు ఈ నవలలో చాలా పదాలు అర్థంకావు. కథను తనదైన శైలిలో, యాసలో నడిపిస్తున్న రచయిత కూడా కొన్ని సందర్భాల్లో 'పాత్రల యాస'లోకి యాదృచ్ఛికంగానే వెళ్లిపోయినట్లు కన్పిస్తారు.

నవలలో 'రుద్రారం' (ఆల్‌కబీర్), 'అక్షర జ్ఞానం' సంఘటనలు పాఠకుడికి యింపుగా ఉన్నా వాటిని కావాలనే 'ఊరు'లో దూర్చినట్లు తరచి చూస్తే తెలుస్తుంది.

అడవి బిడ్డల సంక్షేమానికి, తద్వారా సమాజ శ్రేయస్సుకు పలు ఐ.టి.డి.ఏ. పథకాలను విశ్లేషించిన రచయితకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

-యం. రమేష్‌యాదవ్
కరంజి

## ఒక దర్పణం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఆ**బోతుల కుమ్ములాటలో లేగదూడలు నలిగి చచ్చినట్లు అన్నలకు, ఖాకీలకు మధ్య గిరిజనులు అనుక్షణం శారీరకంగా, మానసికంగా ఏవిధంగా వేధింపులకు, సాధింపులకు గురౌతున్నారో కళ్ళకు కట్టినట్లు తెలియచేస్తాయీ నవలలోని కొన్ని సంఘటనలు.

ఆదర్శవంతమైన నినాదాలెన్నో పేరడీలై కొట్టుకుపోతున్న తరుణంలో 'దున్నేవాడిదే భూమి!' అన్న నినాదానికి నూతనోత్తేజాన్నిచ్చిందీ నవల. 'మా భూమి మీ చేతుల్లోకొస్తే... మా చేతుల్లోని నాగలి, పలుగు, పార మీ చేతుల్లోకి రాలేదెందుకని?' అంటూ డెబ్బై యేళ్ల జీవితానుభవంతో కినాకబాలు గిరిజనేతరులనుద్దేశించి అడిగిన సూటి ప్రశ్న ప్రతి ఒక్కరి హృదయాంతరాళాల్లోనూ వాడిగా గుచ్చుకొని నిలదీస్తుంది.

నేటి మన రాజకీయ వ్యవస్థ నీతి నిజాయితీలకిచ్చే స్థానం ఏపాటిదో కలెక్టర్, సబ్




కలెక్టర్‌ల బదిలీ సాక్ష్యమిస్తుంది. 'ఈ దేశంలో ప్రజాస్వామ్యం నేతి బీరకాయలో నెయ్యిలాంటిది' అన్న వ్యాఖ్య ఖండించలేని కఠోర వాస్తవం!

అమాయకత్వం, ఆత్మాభిమానం మెండుగా ఉండే గోండోడు కూడా నాలుగు డబ్బులు చేతబడగానే గుండెలేని బండోడుగా మారే నైజాన్ని తుకారాం, మడావి రాముల పాత్రలు తెలియజేశాయి. తమ పొట్టలు గడవకపోయినా, తమ కష్టాల్లో తోడుగా నిలిచిన మూగజీవాలైన ఎడ్లను అవసరానికి అమ్మి సొమ్ము చేసుకోక వాటిని దయార్ద్ర హృదయంతో సురక్షితమైన చోటికి చేర్చి తృప్తి పొందిన దేవుబాయిలో తన కడుపున పుట్టిన బిడ్డల్నే కాదు, తను సాకిన ఏ జీవినైనా ప్రేమించగలిగే నిజమైన మాతృత్వం, స్త్రీత్వం వెలుగుచూపాయి.

-ఎ. శ్రీకాంత్
చింతలూరు

## గుండెల్లో బాకు

*(అయిదవ బహుమతి
రూ. 50/- పొందిన సమీక్ష)*

ప్రకృతివశకు మనుషులందరూ సమానులే. అడవి తల్లి ఒడిలో పుట్టి ఆమె అందించే సంపదతో బతికే గిరిజనులను కొంతమంది రాజకీయ స్వార్థపరులు కీలుబొమ్మలుగా ఆడించే వైనం, బతుకే దినదిన గండంగా గడిపే అడవి బిడ్డల దీన స్థితికి అద్దంపట్టిన గాథే 'చతుర' నవల 'ఊరు'.

పట్నవాసానికే అలవాటు పడ్డ మేధావులున్న ఈ రోజుల్లో సిద్ధార్థ, ప్రియాంకల్లాంటి డాక్టర్లు కష్ట, నష్టాల్ని లెక్కచేయకుండా అంకితభావంతో ఊళ్ళ పురోభివృద్ధికి పాటుపడడమంటే నిజంగా మనుషుల్లో దేవుళ్లంటే వీళ్లేననిపిస్తుంది. తీవ్రవాద తత్వం తప్పుకాదు గాని సూత్రాలు వల్లించడమే కాకుండా అది ఎంతవరకు ఆచరణయోగ్యమో, ఎలా కార్యరూపంగా మలచాలో తెలుసుకొని అడుగేయడం ఓ అద్భుతమైన విషయం. అదే పంథాలో కలెక్టర్‌గారు ప్రజలకు చేరువగా వచ్చి గిరిజనులకు విద్యాబోధనతో సహా పల్లెల అభివృద్ధి అధికారాల్ని కొంతమంది గిరిజన యువకులకు అప్పజెప్పి ఉద్యోగాలీయడం గొప్ప హర్షణీయం. కాని రాజకీయ విషకోరలకు ఆ పథకం బలికావడం ఈ సమాజపు గుండెల్లో బాకు గుచ్చినట్లయింది.

బిడ్డను కోల్పోయిన ఇస్రూబాయి హృదయ విదారకంగా విలపించిన తీరు, తినడానికి తిండి లేక అవస్థలు పడుతున్న జైతు, లక్ష్మీబాయిల కూతురు దిరిసెన గడ్డలు తిని మరణించిన విషాద ఘట్టం, ఆదర్శంకోసం 'అన్న'ల దళానికే అంకితమైన సీతక్క చరిత్ర పాఠకుల మనసుల్ని కలచివేస్తాయి. తునికాకుకోసం వెళ్లి దారితప్పిన జైతు అడవిలో పడిన కష్టాల్ని చదువుతుంటే ఓ సస్పెన్స్ థ్రిల్లర్ సినిమా చూస్తున్న అనుభూతి కలిగింది. తమ బాధల్ని, కష్టాల్ని లెక్కచేయని కాంట్రాక్టర్ రంగయ్యను తదితర వడ్డీ వ్యాపారస్తుల్ని గిరిజనులు మూకుమ్మడిగా ఎదిరించి వాళ్లిచ్చే కూలీ చాలదని వాళ్లచేతే నిరూపింపజేసిన ధైర్యాన్ని మెచ్చుకోవచ్చు.

ఎన్ని కష్టాలొచ్చినా దేవుబాయి, జంగు తమ కొడుకు తుకారాం వద్దకు వెళ్లకపోవడం...

ఒకచోట మడావి రాముకు, సుభద్రాబాయికి పెళ్లిచేసి, మరోచోట తుకారాం, సుభద్రాబాయి దంపతులని రాయడం...

నవల్లో లోపంగా అన్పించి పాఠకుల్ని తికమకపెట్టింది.

ప్రతి పాఠకుడినీ గిరిజనులలో ఒకరిగా భావించి, వాళ్ల భాషలోనే చదివించి కళ్లకు కట్టినట్టుగా మలచిన వసంతరావ్ దేశ్‌పాండే గారికి, ఓ మంచి నవలనందించిన 'చతుర'కి కృతజ్ఞతలు.

**-అవునలి ఆంజనేయులు**
మూసాపేట

# చతుర ప్రపంచం

## విజయాల వెనుక విశేషం

'మిస్టర్ ఇండియా' బిరుదేకాక అనేక పోటీల్లో, 'బాడీబిల్డింగ్ కాంపిటీషన్ల'లో బహుమతులు పొందిన ప్రేమ్‌చంద్ వయసు 35 సంవత్సరాలు. ఇతడిది పంజాబ్. ప్రేమ్‌చంద్ శరీరం చిన్నప్పటినుంచీ దారుఢ్యంగా, ఆకర్షణీయంగా వుండేది. నిజానికి అతడో అనాథ. పేదరికంతో అనుక్షణం పోరాడి జీవితంలో పైకి వచ్చి తన శారీరక దారుఢ్యంతో, అందంతో నలుగురిలోనూ గుర్తింపు పొందాడు. ప్రేమ్‌చంద్ ఆసక్తిని గమనించిన ఎన్నో క్లబ్బుల యజమానులు అతడికి ఉచితంగా మల్లయుద్ధంలోను, తదితర కసరత్తులోను శిక్షణనిచ్చేవారు. దాన్ని సద్వినియోగం చేసుకున్నాడు ప్రేమ్‌చంద్.

1975లో అతడు పంజాబ్‌లో ఉద్యోగం చేస్తూనే ఎన్నో మల్లయుద్ధ పోటీల్లో పాల్గొని బహుమతులు గెల్చుకున్నాడు. కానీ క్రమంగా ఈ మల్లయుద్ధ పోటీలనుంచి తన దృష్టిని 'సుందరుల పోటీ' వైపు మళ్ళించి 'మిస్టర్ ఇండియా' పోటీలో పాల్గొనడానికి నడుం కట్టాడు. దానికోసం అతడు రకరకాలుగా కసరత్తులు చేయడం, బరువులు ఎత్తడం మొదలైన వ్యాయామాలతో శరీరాన్ని దారుఢ్యంగా, ఆకర్షణీయంగా చేసుకోనారంభించాడు.

1980లో మొదటిసారిగా ఓ 'బాడీ బిల్డింగ్ కంటెస్ట్'లో పాల్గొని ప్రథమ బహుమతి గెల్చుకున్నాడు. అటుపైన మిస్టర్ పంజాబ్, మిస్టర్ ఇండియా బిరుదులు గెల్చుకున్నాడు. 1981లో మద్రాస్‌లో జూనియర్ మిస్టర్ ఇండియాగాను, 1982లో కోయంబత్తూర్‌లో సీనియర్ మిస్టర్ ఇండియాగాను, 1983లో కోయంబత్తూర్‌లోనే మిస్టర్



ఇండియాగాను, 1984లో గోవాలో మిస్టర్ ఇండియాగాను, 1985లో కొలంబోలో మిస్టర్ ఆషియాగాను, 1985లో సోథన్ బార్గ్‌లో జరిగిన మిస్టర్ యూనివర్స్ పోటీల్లో నాలుగవ స్థానాన్ని, మలేసియాలో 1986లో మిస్టర్ ఆషియాగాను, 1986లో టోక్యోలో జరిగిన మిస్టర్ యూనివర్స్ పోటీల్లో రన్నర్ అప్‌గాను వివిధ బిరుదులను పొందాడు ప్రేమ్ చంద్.

ఇండియాలో ప్రేమ్‌చంద్ ఎన్నో మెడల్స్‌ని, బహుమతులను పొందినా భారత ప్రభుత్వం ప్రేమ్‌చంద్‌ని తగిన రీతిలో సత్కరించలేదనే చెప్పాలి. ప్రేమ్‌చంద్‌కన్న తక్కువ బహుమతులను పొందిన మిగతా అనేక రంగాల కళాకారులను ప్రేమ్‌చంద్‌కన్నా ఎక్కువగా ప్రోత్సహించిన ప్రభుత్వం ఇతడిని చిన్నచూపే చూసిందనే విమర్శ కళాకారులలో ఉంది.

ఈ విజయాలన్నిటినీ వెనక వుండి ప్రోత్సహించిన, తాను పనిచేస్తున్న టిస్కో కంపెనీకి ఈ ఘనత దక్కుతుందంటాడు ప్రేమ్ చంద్.

ఇంతకీ ఇతని ఘనవిజయానికి కారణమైన అతని శారీరక సౌందర్యం వెనక రహస్యమేమిటని ప్రశ్నించుకుంటే తెలిసిందేమంటే ప్రేమ్‌చంద్ రోజుకు ఆరు గుడ్లు, అరకిలో చికెను, రెండు లీటర్ల గేదెపాలు, 2 కిలోల పచ్చికూరలు, 24 చపాతీలు, అరకిలో అన్నం, 4 కిలోల వివిధరకాల పళ్ళూ తింటాడట.

నెలకి 13 వేల రూపాయలు తేలే ఇతని ఆహార ఖర్చులను అతను పనిచేసే టిస్కో కంపెనీయే భరిస్తుందట. ఇలా ఎంచక్కా భరించేవారుంటే ఎంతోమంది మిస్టర్ ఇండియాలు, మల్లయుద్ధ విశారదులు వెలుగులోకి వచ్చే అవకాశముంది మరి.

---

## డూప్లికేటు ఖండం

అమెరికాలోని ఫ్లోరిడాలో ఓ డూప్లికేట్ ఆఫ్రికా వుందంటున్నారు పర్యాటకులు. ఆఫ్రికాని చీకటి ఖండమంటారని అందరికీ తెలిసిందే. ఆఫ్రికాలోని భీతిగొలిపే సహారా ఎడారి గురించి విననివారే వుండరు. అందుకే యూరప్, అమెరికా, ఆస్ట్రేలియా ఖండాలని దర్శించినంత ఉత్సాహంగా ఆఫ్రికా జోలికి పోరు పర్యాటకులు. ముఖ్యంగా అక్కడి వాతావరణంలో వేడి ఎక్కువ. ప్రజలు కూడా అంత స్నేహపూర్వకంగా ఉండరు. ఎడారి కారణంగా నీటికొరత మామూలే. సౌత్ ఆఫ్రికా, కాంగో, నైజీరియా, లిబియా, ఈజిప్ట్‌లాంటి కొన్నిదేశాలు మాత్రం అక్కడున్న రాగి, వజ్రం, బంగారం, నూనె మొదలయిన ఖనిజ సంపదల కారణంగా బాగానే అభివృద్ధి చెందాయి. ఆఫ్రికాలో ఉన్న జీబ్రా, జిరాఫీ, ఏనుగు, పులి, సింహం మొదలయిన జాతుల్లోని అరుదైన రకాలు అక్కడే తప్ప మరెక్కడా కనిపించవంటారు శాస్త్రజ్ఞులు.

టాంజీనియాకి చెందిన నేగ్రోనేషనల్ పార్క్ చాలా ప్రసిద్ధిపొందింది. 10,000 అడుగుల అతి ఎత్తయిన కిలిమంజారో శిఖరం... అగ్రభాగం సదామంచుతో కప్పబడి వుంటుంది. అక్కడున్న చిత్రవిచిత్ర వృక్ష సంపద వృక్షశాస్త్రజ్ఞులకు ఓ వరం. భూగర్భ శాస్త్రజ్ఞులు ఇక్కడ అపారఖనిజ సంపద నిక్షిప్తమై వుందని తేల్చారు.

ఇంతకీ అమెరికాలోని ఫ్లోరిడాలో వున్న బుష్ గార్డెన్స్ కూడా అలాంటి ఆఫ్రికాకి ప్రతీక అంటున్నారు. బుష్ గార్డెన్స్‌కి వెళ్ళిన వాళ్ళకి ఆఫ్రికాకి వెళ్ళినట్టే అనుభూతి కలుగుతుంది.

ఆఫ్రికాలో కనిపించే అరుదైన జంతుజాలమంతా బుష్ గార్డెన్‌లోనూ వుంది.

బుష్ గార్డెన్ మొత్తాన్ని 7 ప్రదేశాలుగా విభజించవచ్చు. అంటే ఆఫ్రికన్ వన్యమృగ




ప్రాంతం, ఆఫ్రికన్ మార్కెట్ ప్రాంతం, ఆఫ్రికన్ తిను బండారాలు వగైరా.

క్రూరమృగాలు స్వేచ్ఛగా గర్జిస్తూ తిరుగుతూ వుంటాయి బుష్ గార్డెన్‌లో.

1959లో ఈ బుష్ గార్డెన్‌కి ప్రారంభోత్సవం జరిగింది. 3000 ఎకరాల్లో ఈ గార్డెన్స్ విస్తరించి ఉన్నాయి. ఆఫ్రికన్ పక్షులు ఇక్కడ అనేక విన్యాసాలు చేస్తూవుంటాయి. ఆఫ్రికాలో నివశించే క్రూరమృగాల్లో సుమారు 3000 జాతులకు చెందిన మృగాలు ఇక్కడ కనిపిస్తాయి,

ఈ బుష్ గార్డెన్స్ క్రూరమృగాలను సంరక్షించడంలో ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటున్న కారణంగా ప్రభుత్వంనుంచి అనేక అవార్డులను పొందాయి. 1980లో భారత ప్రభుత్వం ఈ బుష్ గార్డెన్స్‌కి రెండు వైట్ రాయల్ బెంగాల్ టైగర్స్‌ని బహూకరించింది. అతిక్లిష్టమైన తెల్ల పులుల సంరక్షణ భారాన్ని మొదటిసారిగా వహించిన ఘనత బుష్‌గార్డెన్స్‌కే దక్కింది.

ఈ గార్డెన్స్‌ని సందర్శించాలంటే మొరాకో గ్రామంనుండి ప్రయాణం ప్రారంభించాలి.

ఇక్కడి చేతిపనివారు ఎంబ్రాయిడరీతో అనేక అద్భుత వస్తువులను తయారుచేస్తారు. పాములతో అనేక విన్యాసాలు చేయిస్తారు పాములవాళ్ళు. జంతుకూనలకు ఓ ప్రత్యేక స్థావరముంది. అక్కడ అప్పుడే పుట్టిన జంతకూనలకు రక్షణ కల్పిస్తారు. ప్రతి సంవత్సరం సుమారు 1000 క్రూరమృగాలకు కూనలు ఉద్భవిస్తాయి ఇక్కడ.

ఇక్కడ కూడా ఆఫ్రికాలోలాగే కృత్రిమ ఎడారి నిర్మించబడింది. ఈ ఎడారిలో ఒంటెపై ప్రయాణించడం ఓ అద్భుతం. ఆఫ్రికాలోని స్టైన్ విబెల్ గ్రామంలాంటిదే ఇక్కడా వెలిసింది. అందులో చింపాంజీ, ఏనుగుల విన్యాసాలను దర్శించవచ్చు.

బుష్ గార్డెన్స్ 'బుష్ ఎంటర్‌టెయిన్‌మెంట్ కార్పోరేషన్ వారి ఆధ్వర్యంలో వున్నాయి. ఆఫ్రికాలో కాంగోలో స్థిరపడిన కొంతమంది జర్మనుల ఆచారవ్యవహారాలు కూడా ఈ ప్రాంత జనులలో కనిపిస్తాయి.

ఆఫ్రికాలో విభిన్న సంస్కృతులున్నాయి. అలాంటి సంస్కృతీవైరుధ్యం ఇక్కడ కూడా పొడగడుతుంది. అందుకే దాన్ని డూప్లికేట్ ఆఫ్రికా అంటారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402